PRSVMORA129

సాహిత్య
ప్రస్థానం
సెప్టెంబర్ 2011
సంపుటి : 11 సంచిక : 68

# బుద్ధిజీవుల బాధ్యత

అన్నా హజారే ఆందోళన అవినీతికి వ్యతిరేకంగా మధ్యతరగతి మానవులలో ఒక కదలిక రావడానికి కారణమైంది. లోటుపాట్లు వున్నప్పటికీ ఇది ఆహ్వానించదగిన పరిణామం. ప్రభుత్వం సమగ్ర లోక్‌పాల్ బిల్లును న్యాయ కమీషన్‌ను, ఎన్నికల సంస్కరణలనూ తీసుకువచ్చేంత వరకూ ఈ పోరాటం సాగాల్సిందే. ఇది సాహిత్య జీవులూ పాలుపంచుకోవాల్సిన కర్తవ్యం.

.. .. ..

సాహిత్యకారులు సమాజంలో నిర్వహించాల్సిన బాధ్యతలు చాలా వుంటాయి. ముఖ్యమైంది సాహిత్యం ద్వారా పాఠకుల చైతన్యాన్ని పెంచడం. అందుకు ముందు తమ చైతన్యాన్ని అంటే విమర్శనా శక్తిని పెంచుకోవడం చాలా అవసరం. ప్రగతి శీల ప్రజాస్వామిక ఉద్యమాల్లో కళా సాహిత్యాలు కీలక పాత్రనే పోషించాయి. మరీ ముఖ్యంగా తెలుగు నాట వామపక్ష భావాల ప్రేరణ గల ప్రజా సాహిత్యం కళలు చారిత్రాత్మక పాత్ర నిర్వహించాయి. ఆ దశలో కవులు కళాకారులకు రాజకీయాలు తగవన్నట్టు పాలకవర్గ భాష్యకారులు ప్రచారం చేశారు. మళ్లీ చాలా సందర్భాల్లో ప్రగతి శక్తులకు వ్యతిరేకంగా వారిని ఉపయోగించుకున్నారు. అలాగే ఇటీవలి కాలంలో పాలక వర్గాలు తమ రాజకీయ అవసరాలకు కవులు కళాకారులను ముందు నిల్పడం బాగా పెరిగింది. భారీ తతంగాలూ పెరిగాయి. ఇలాంటి సందర్భంలో ఆలోచనాపరులైన రచయితలు ఏ నినాదం వెనుక ఏముంది. ఏ ఆర్భాటం ఎందుకు జరుగుతుంది ఒకటికి రెండుసార్లు ఆలోచించక తప్పదు. సరళీకరణ యుగంలో ప్రజల జీవితాలపై జరుగుతున్న దాడికి వ్యతిరేకంగా జరగాల్సిన పోరాటాలను పక్కదోవ పట్టించే ధోరణుల లోగుట్టును వారు పసిగట్టగలగాలి. బహిర్గత పర్చాలి. అంతేగాని తామూ ఆ వరవడిలో కొట్టుకుపోకుండా నిలవగలగాలి.

.. .. ..

వేగుంట మోహన్ ప్రసాద్ మృతి తెలుగు సాహిత్యంలో ఒక విభిన్న కవిత్వ ప్రతినిధిని మనకు దూరం చేసింది. ఆయనకు నివాళిగా గతంలో చేసిన ఇంటర్వ్యూను పునర్ముద్రిస్తున్నాం.

బొమ్మలు : చంద్ర, శివాజీ, వెంకటేష్

## ఈ సంచికలో...





చిరునామా
సాహిత్య ప్రస్థానం
ఎం.హెచ్.భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్, ఆర్‌టిసి కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్-500 020,
ఫోన్ : 27660013, 9490099059
ఫ్యాక్స్, 040-27635136,
ఇ.మెయిల్ : Prasthanam_ss@yahoo.co.in
ssprasthanam@gmail.com
www.prasthanam.com

కథ



- పోపూరి సురేష్‌బాబు

**చ**ల్లని గాలి మనసుని సేద తీరుస్తుంటే కారు ప్రయాణం హాయిగా సాగుతోంది. ప్రక్క సీట్లో కూర్చున్న అక్కయ్య "డోర్ వేసుకోరా! లేకపోతే జుట్టు చెదిరిపోతుంది" అని చెప్పినా నేను విననట్లే వుండి కారు బయట పరిసరాలు చూడటంలో నిమగ్నమయ్యాను.

ముందు సీట్లో కూర్చున్న నాన్న డ్రైవర్‌కి కారు ఎటు వెళ్ళాలో సూచనలు ఇస్తున్నాడు. నాకు అమ్మాయిని చూడటానికి మేమందరం బయలుదేరాము. కారు ఐతవరం దగ్గర నేషనల్ హైవే నుండి మలుపు తిరిగింది. పచ్చని పొలాల మధ్య కారు వెలుతుంటే నేను ప్రకృతి పరిసరాలు పరిమళాల ఆస్వాదనలో మునిగిపోయాను.

ఉద్యోగ రీత్యా వేర్వేరు రాష్ట్రాలు తిరగడంతో పెళ్ళి ప్రోగ్రామ్ వాయిదా పడుతూ వచ్చింది. ఐదు సంవత్సరాల తర్వాత పెళ్ళి ప్రయత్నాలు ప్రారంభించాను. ఫ్రెండ్స్ 'ముదురు బెండకాయ' , 'పెళ్ళికాని ప్రసాదు' లాంటి పేర్లు పెట్టేసారు కూడా. దాంతో మా అమ్మానాన్నలు మ్యారేజ్ బ్యూరోలకీ, పెళ్ళిళ్లు కుదిర్చే బ్రోకర్‌లకీ నా వివరాలు ఇచ్చి పెళ్ళి కూతుళ్ళ వివరాలు తెలుసుకోవడం మొదలుపెట్టారు.

ఇక శోధన మొదలైంది. నేను విజయవాడ వచ్చినప్పుడు పెళ్ళిళ్ళ పేరయ్య రాఘవయ్యకి కబురు చేయడం, అతను నాకు ఫోటోలు చూపించడం జరుగుతూనే ఉన్నాయి. చూసిన ఫోటోల్లో ఒక ప్రైవేటు ఇంజనీరింగ్‌లో ఎం.బి.ఎ. చదివిన అమ్మాయిది ఒకటి సెలెక్ట్ చేసాను.

నేను చేసుకోబోయే అమ్మాయి నన్ను అర్థం చేసుకుని, నా భావుకత్వాన్ని, సెన్సిటివ్ నేచర్‌ని గుర్తించి సహకరించేదిగా ఉండాలి అనేది నా కోరిక కానీ నా కాబోయే భార్య విషయంలో మా పెద్దలకు కొన్ని నిశ్చితాభిప్రాయాలున్నాయి. వారికి కాబోయే కోడలు బాగా చదువుకున్నదై, అందంగా ఉండి ఆస్తిపాస్తులు ఉండాలని వారి కోరిక. అందుకే సెలక్ట్ చేసిన ఫోటో మావాళ్ళకు నచ్చలేదు. ఎందుకంటే వాళ్ళు కనీసం ఇంజనీరింగ్ చదివిన అమ్మాయి కోడలుగా రావాలని కోరుకున్నారు. కానీ బయట పడకుండా, అమ్మాయి అందంగా, బావుండటంతో ఈ పెళ్ళి చూపులకు ఒప్పుకున్నారు.

అమ్మాయి పేరు స్రవంతి. ఊరు నందిగామ దగ్గర్లోని కేతవీరునిపాడు. నాకు పల్లెటూళ్ళ మీద ఆసక్తి కూడా నన్ను ఈ పెళ్ళి చూపులకి బయలుదేరేలా చేసింది. మంచిరోజు చూసుకుని అమ్మా, నాన్న, అక్కా, బావ, నేను బయలుదేరాము. ఇదే నా మొదటి పెళ్ళి చూపులవడంతో వారంతా ఒకటే టెన్షన్. "ఏం మాట్లాడాలి? ఎలా మాట్లాడాలి?" అని మనసులో రిహార్సల్స్ వేసుకుంటుండగానే కారు అమ్మాయి వాళ్ళింటి దగ్గర ఆగింది.

అప్పటికే అక్కడికి చేరుకుని ఉన్న రాఘవయ్య, అమ్మాయి తరపు వారు కారు ఆగీ ఆగగానే దగ్గరికి వచ్చి మా అందర్ని రిసీవ్ చేసుకున్నారు. స్రవంతి నాన్న, బాబాయి ఎదురు వచ్చి పలుకరించారు. అందరం షేక్‌హాండ్లు ఇచ్చుకున్నాము. వారు మమ్మల్ని లోపలకి తీసుకెళ్ళి అప్పటికే సిద్ధం చేసి ఉంచిన కుర్చీలో, సోఫాలో కూర్చోమన్నారు. నేనైతే పైనున్న వెంకటేశ్వర స్వామి ఫోటో చూస్తూ కుర్చీలో కూర్చున్నాను.

స్రవంతి బాబాయి మా అమ్మా నాన్నలతో మాట్లాడుతుండగా, మా బావ స్రవంతి తండ్రితో పిచ్చాపాటి మొదలుపెట్టాడు. బావ రియల్‌ఎస్టేట్ వ్యాపారి కావడంతో కబుర్లకి కొదవలేదు. స్రవంతి తండ్రిని మాటల్లో పెట్టి మెల్లగా వాళ్ళ ఆస్తులు, అమ్మాయి చదువు వివరాల్లోకి తీసుకెళ్ళాడు.

"మావాడి వివరాలు చూసారు గదా! ఎలక్ట్రికల్ ఇంజనీరింగ్ ఎ.యు. క్యాంపస్‌లో చదివాడు. మొదటి ప్రయత్నంలోనే ఇంజనీరింగ్ సర్వీసెస్ ఎంట్రన్స్‌లో మంచి ర్యాంకు తెచ్చుకుని ప్రస్తుతం రైల్వేస్‌లో ఎలక్ట్రికల్ సెక్షన్‌కి సంబంధించిన ఆఫీసర్‌గా పోస్టింగ్ తెచ్చుకుని మంచి పొజిషన్‌లో ఉన్నాడు." అన్నాడు బావ.



"అబ్బాయి జీతం అదీ ఎంతొస్తుందండీ" అని అడిగితే కటింగ్స్ పోనూ ఎంతొస్తుందో కూడా చెప్పాడు బావ.

"అబ్బాయి సాఫ్ట్‌వేర్‌కి మారే ఆలోచన ఉందా?" అని అడిగారాయన.

"అదేం లేదండీ! రమేష్ బిటెక్. ఫైనల్ ఇయర్లో ఉండగా రెసిషన్ ఉండటంతో అప్పుడే ఐ.ఇ.ఎస్. లక్ష్యంగా పెట్టుకున్నాడు. తనకి ఎలక్ట్రికల్ ఫీల్డ్ అంటే ఇష్టం. ఇందులో వీళ్ళ జీతాలు బావుంటాయి. అదీగాక పేస్కేలు రివైజ్ అయినప్పుడల్లా శాలరీస్ పెరుగుతూనే ఉంటాయి." అంటూ బావ నా గురించి కొద్దిగా ఎక్కువే చెప్పాడు.

"అలాగా! మంచి నిర్ణయమండీ" అన్నారాయన.

ఇంతలో స్రవంతి పిన్ని, వాళ్ళ పిల్లల చేత అందరికీ బిస్కట్లూ, స్నాక్సూ పంపారు. కాసేపటికి స్రవంతి నాన్నకి లోపల్నుండి పిలుపొస్తే వెళ్ళారు. బావ వాళ్ళ ఇల్లంతా ఎగాదిగా పరీక్షగా చూస్తూ "అంతా బానే ఉందిరా! నువ్వు చూసి ఒప్పుకుంటే ఖాయం చేసేద్దాం" అన్నాడు గొంతు తగ్గించి.

"ముందు తన అభిప్రాయం చెప్పనివ్వు బావా!" అన్నాను నేను.

ప్రక్క నుంచి అక్క అందుకుని "నీకేం తక్కువరా!" అంటూండగానే గుమ్మం దగ్గిరి అలికిడి వినిపించి మాట్లాడటం ఆపింది. నేను తల ప్రక్కకి తిప్పి చూస్తే తలదించుకుని ట్రేలో టీ కప్పులతో అడుగులో అడుగు వేసుకుంటూ వస్తున్న స్రవంతి కనపడింది. నేను తలదించుకున్నాను. అక్కయ్య సోఫాలో కూర్చున్న అమ్మా, నాన్నల వైపుగా వెళ్ళింది. అందరూ టీ తీసుకుని త్రాగడం మొదలుపెట్టారు.

చీరెలో స్రవంతి అందంగా, కుందనపు బొమ్మలా ఉంది. తను నా దగ్గరికి వచ్చి టీ కప్పు ఎదురుగా పెట్టడంతో వణుకుతున్న చేతుల్తో అందుకున్నాను. ఇదంతా బావ కనపడీ కనపడని నవ్వుతో చూస్తున్నాడు.

"ఏరా! ఏమన్నా మాట్లాడుతావా?" అని బావ అంటున్నా నాకు వినపడడం లేదంటే నేను స్రవంతిని చూడటంలోనే మునిగిపోయి ఉన్నానన్నమాట. అక్క, అమ్మ స్రవంతిని చూసి బాగా ఇంప్రెస్ అయినట్లు వాళ్ళ మొహాలే చెబుతున్నాయి. నాన్న అదే అభిప్రాయంతో ఉన్నా కూడా ఆ విషయం మొహంలో కనిపిస్తే ఎక్కడ కట్నం తగ్గుతుందోనని భావ వ్యక్తీకరణ లేకుండా ఉన్నాడు.

స్రవంతి పిన్నితో "వాళ్ళేమన్నా మాట్లాడుకుంటారు. మనం ఉన్నామని సిగ్గుపడుతున్నట్లుంది" అంది అక్క. అంతే అందరూ ఇంటి బయట వసారాలోకి వెళ్ళిపోయి అక్కడ ప్రక్కగా ఉన్న మంచాల మీద, కుర్చీలో కూర్చుని కొంతమంది లోకాభిరామాయణం మొదలుపెట్టారు.

స్వతహాగా నాది చొరవ తీసుకుని మాట్లాడే స్వభావం కాదు. గడిచిన నిశ్శబ్దం సేపు స్రవంతి మౌనంగా నేల చూపులు చూస్తుంటే నేనేమో బిత్తర చూపులు చూస్తూ గడిపాను. చివరకు నేనే ధైర్యం చేసి "మీ పేరు?" అని తెలిసినా అడిగాను.

"స్రవంతి" అని క్లుప్తంగా సమాధానం ఇచ్చింది తర్వాత స్రవంతి "ఇప్పుడు ఎక్కడ చేస్తున్నారు?" అని అడిగితే చెప్పాను.

"మీరు ఎ.యు.లో చదివారు కదా! క్యాంపస్ ఇంటర్‌వ్యూలు లేవా?" అని అడిగింది. "కంపెనీలో సెలక్టయ్యాను కానీ కాల్ రాకపోవడంతో సర్వీసెస్ రాసాను." అని చెప్పాను. "మీకు సాఫ్ట్‌వేర్ జాబ్ ఇంట్రస్ట్ లేదా?"

ఇబ్బంది కలిగించిన ఆ ప్రశ్నకు "సాఫ్ట్‌వేర్‌లో హెచ్చు తగ్గులుంటాయి. నాలుగేళ్ళు బావుంటే మరో నాలుగేళ్ళు మార్కెట్ ఉండదు. నేను ఇప్పుడున్న పొజిషన్ చాలా బావుంది. ప్రమోషన్ వచ్చే అవకాశాలున్నాయి. నాకు కోర్‌ఫీల్డ్‌లో సెటిలవ్వడమే హ్యాపీ కూడా" అని సమాధానంగా చెప్పాను.

స్రవంతి ఏదో ఆలోచిస్తున్నట్లు ఆగి, "ప్రస్తుతం ఉన్న జాబ్‌లో మీ రెస్పాన్సిబిలిటీస్ ఏమిటి?" అని అడిగింది.

నా జాబ్ గురించి ప్రశ్నలడగడం ఆశ్చర్యానికి గురిచేసినా ఆ ప్రశ్న నా ఫీల్డ్‌కి సంబంధించింది కావడంతో ఐదు నిమిషాలు అన్నీ వివరంగా చెప్పాను.

"మీరు ఇప్పుడు చేస్తున్న చోటు నుండి మారడానికి, ఐ మీన్ సిటీకి మారడానికి ఏవైనా అవకాశాలున్నాయా? అని స్రవంతి అడిగింది.

"భువనేశ్వర్ కూడా సిటీయే కదా!" అని చెప్పాను.

"అఫ్‌కోర్స్! అంటే హైదరాబాద్ కానీ, బెంగుళూరు కానీ రావడం కుదురుతుందా అనీ..." కుదురుతుంది కానీ అది సర్వీస్‌ని బట్టి ఉంటుంది. మారినా ఆ ట్రాన్స్‌ఫర్ కొన్ని సంవత్సరాలే ఉంటుంది" అన్నాను.

"నేను జాబ్ చేయడం మీకిష్టమేనా?" అనడిగితే "అది మీ ఇష్టం" అని చెప్పాను. కొంచెం చొరవ పెరగడంతో తర్వాత నేను అడిగిన కొన్ని ప్రశ్నలకు సమాధానాలు కూడా స్రవంతి జడ ఉన్నంత బారుగా వచ్చాయి. ఇంకా ఏదో అడుగబోతుంటే బయటనుంచి పెద్దలంతా వస్తున్నట్లుగా అడుగుల శబ్దం వినిపించడంతో 'స్రవంతి' పేరుకు తగ్గట్లు గలగలా జారిన మాటల ప్రవాహానికి బ్రేక్ పడింది.

ఇంతలో పెద్దలంతా లోపలికి వచ్చేసారు. బావ వస్తూ కళ్ళతోనే నన్ను చదివి అమ్మాయిని నేనిష్టపడ్డానని అర్థం చేసుకున్నాడు. కాసేపు మాటామంతీ జరిగాక వాళ్ళ దగ్గర వీడ్కోలు తీసుకుని తిరిగి విజయవాడ బయలుదేరాము.



కార్లో అమ్మ "అమ్మాయి చాలా చక్కగా ఉందండి. కట్న కానుకలూ అవీ బాగానే ఇచ్చేట్లున్నారు." అంది నాన్నతో. నాన్న కూడా తలూపి "ఏ విషయమూ సాయంత్రం చెప్తామని చెప్పారని రాఘవయ్య చెప్పాడు." అన్నారు.

కారు పటమటలోని మా ఇంటిదగ్గర ఆగాక మమ్మల్ని దింపేసి, అక్క, బావ కారులో వాళ్ళింటికి వెళ్ళిపోయారు.

నేను కట్నంతో నిమిత్తం లేకుండా స్రవంతి నా భార్యగా వస్తే అంతకన్నా అదృష్టం లేదని ఫీలయ్యాను. ఆ రోజు ఏ కబురూ వాళ్ళ వైపు నుంచి రాలేదు. ఆ రాత్రి నేను డ్రీమ్స్‌లోకి క్రీమ్‌లా కరిగిపోతూ స్రవంతి రూపాన్నీ ఊహించుకుంటూ నిద్రలోకి జారుకున్నాను.

మరుసటి రోజు వాళ్ళ సమాధానం కోసం నేను ఎదురుచూస్తుంటే రాఘవయ్య పిడుగులాంటి వార్తతో ఇంటికి వచ్చాడు. "అమ్మాయీ అబ్బాయీ జాతకాలు కలవలేదట. ఇది వదిలేసుకున్నామని అమ్మాయి తరపువారు చెప్పమన్నారు." అని చెప్తుంటే నాకు షాక్. అయితే ప్రక్కనే ఉన్న బావ అసలు విషయం అదికాదని గ్రహించి రాఘవయ్య నుంచి వివరం రాబట్టాడు.

"అమ్మాయికి సాఫ్ట్‌వేర్ ఇంజనీర్ కావాలట. మరి పెళ్ళి చూపులకి ఎందుకొప్పుకున్నారని అడిగితే వాళ్ళు రమేష్‌గారి ప్రొఫైల్ చూసి 'మంచి మెరిట్ కుర్రాడు. సాఫ్ట్‌వేర్‌కి ఈజీగా మారగలడు' అనుకున్నారట. మీవాడు ఇప్పుడున్న జాబ్‌లోనే కంటిన్యూ అవుతానని అనడంతో మన సంబంధాన్ని కాదనుకున్నారు" అన్నాడు రాఘవయ్య.

"అమ్మాయికి ఉద్యోగం లేదు. మనవాడు మంచి ఉద్యోగంలో ఉన్నాడు. మనం ఇన్ని మెట్లు దిగివెళ్తే వాళ్ళ ఆలోచనలు అంత ఎత్తులో ఉన్నాయనుకోలేదు" అన్నాడు నాన్న.

"ఇది వదిలేయండి. ఇంతకంటె మంచిది ఇంకొకటి చూస్తాను." అంటూ రాఘవయ్య వెళ్ళిపోయాడు.

ఇలా నా తొలి పెళ్ళి చూపులు ఫెయిల్ అయ్యాయి. ఈ అనుభవాన్ని ఎందుకో తేలిగ్గా తీసుకోలేకపోయాను. ఆ దిగులుతోనే భువనేశ్వర్ వెళ్ళిపోయాను.

తర్వాత నేను ఉద్యోగం చేసుకుంటున్నప్పుడు రాఘవయ్య ఫోన్ చేసి అమ్మాయిల వివరాలు చెబుతూనే ఉన్నాడు. మంచి ప్రొఫైల్ అనిపిస్తే ఆదివారాలు విజయవాడ వచ్చేవాణ్ణి. ఇంజనీరింగ్ చదివిన ఇద్దరు అమ్మాయిల్ని చూసాను. ఒకరేమో భువనేశ్వర్ దూరమైందనీ, ఇంకొకరు నా వయసెక్కువనీ రిజక్ట్ చేసారు. ముప్పై సంవత్సరాలు ఎక్కువా? ఏం చేయను? ఉద్యోగం చేసే కొంతమంది అమెరికా లేదా సాఫ్ట్‌వేర్ అంటున్నారు.

ఇన్ని జరుగుతున్నా స్రవంతి వాళ్ళు మనసు మార్చుకుంటారేమో నన్న చిన్న ఆశతో ఆ విషయాన్ని రాఘవయ్యతో కదిలిస్తూనే ఉన్నాను. ఎందుకో ఆ ఊరు, పొలాలు, వాతావరణం నాకు విపరీతంగా నచ్చాయి.

రాఘవయ్య కూడా ఒకట్రెండు ప్రయత్నాలు చేసి" ఆ అమ్మాయికే ఇష్టం లేదు వదిలెయ్యి బాబు" అన్నాడు. నేను బి.ఎ., బి.ఎస్.సి. చదివిన వారి ఫోటోలు చూపించమంటే రాఘవయ్య మాత్రం "మీ వాళ్ళకి బాగా చదువుకున్న అమ్మాయే కావాలటండీ" అనేవాడు.

"అవి మంచి చదువులు కావా?" అంటూ మా అమ్మా.నాన్నల్ని కన్విన్స్ చేయడానికి ప్రయత్నించాను.

"పెద్ద పెద్ద చదువులు చదివితేనే గొప్పకాదనీ, జ్ఞానం, తెలివితేటలున్నా అందరూ ఇంజనీర్లూ, డాక్టర్లూ కాదనీ, వాళ్లు తెచ్చే కట్నం శాశ్వతం కాదనీ, 'డబ్బు ఈ రోజు ఉంటుంది. రేపు పోతుంద'నీ చెప్పి వాళ్ళని ఒప్పించి "మంచి గుణాలున్న అమ్మాయిని చూడ"మని చెప్పాను.

కేవలం పెళ్ళి చూపుల కోసం భువనేశ్వర్ నుండి విజయవాడకు ఆదివారాలు వచ్చేలా ప్లాన్ చేసుకునేవాణ్ణి. ఇలా గడుస్తూ ఉండగా అనుకోకుండా ఒకసారి పనిపడి సోమవారం కూడా ఉండిపోవాల్సి వచ్చింది. ఆరోజు ఉదయం పోరంకిలో ఉంటున్న అక్క బావల దగ్గరకు వెళ్ళాను. సెవెన్త్ క్లాస్ చదువుతున్న మా అక్క కూతురు మృదుల స్కూల్ బస్‌మిస్ అవడంతో నా బైక్‌మీద ఎక్కించుకొని తన స్కూల్‌కి తీసుకెళ్ళాను.

మృదులతో స్కూల్ కారిడార్‌లో నడుస్తూ వెళ్తుంటే ఒక క్లాస్ రూంలోంచి ఏదో స్వరం స్పష్టంగా మధురాతి మధురంగా వినిపించింది. కోయిల స్వరంలా ఉన్న ఆ గొంతు ఎంతటి వారినైనా మెస్మరైజ్ చేసి వాళ్ళని తనతో పాటు నడిపించే విధంగా ఉంది.

ఆ క్లాస్ ప్రక్కగా వెళ్తూ ఓరగా తొంగి చూసాను. ఇరవై నాలుగేళ్ళ ఆ యువతి పిల్లలకు పాఠాలు బోధిస్తుంటే, వివరంగా చెబుతూ ఉంటే చాలా ముచ్చటగా అనిపించింది. క్లాసులో పిల్లలంతా పిన్‌డ్రాప్ సైలెన్స్ మెయిన్‌టెయిన్ చేస్తూ, ఆమె చెప్పేది తన్మయత్వంతో వింటూ పాఠాలు నేర్చుకుంటున్నారు. విడమర్చి వివరణ ఇస్తూ, అర్థం చెబుతున్న ఆ టీచర్ తీరూ, అందర్నీ తను చెప్పే సబ్జెక్ట్‌లో లీనమయ్యేలా చేసి లయబద్ధంగా సాగుతున్న ఆమె టాకింగ్ స్టైల్ నాకు నచ్చాయి. ఒద్దికా, పద్ధతి గల అమ్మాయని ఆమె బాడీ లాంగ్వేజ్‌ని బట్టే అర్థమవుతుంది.

నేను ఆగడం చూసిన మృదుల "సాహితీ టీచర్ క్లాస్ చాలా బాగా చెబుతుంది. మామయ్యా! మా సాహితీ మిస్ క్లాసులంటే అందరికీ ఇష్టమే. మమ్మల్ని అర్థం చేసుకుంటూ పాఠాలు ఎంత కష్టమైనా ఇట్టే మార్చి సులువుగా ఉండేటట్లు చెబుతుంది. తెలుసా! సాహితీ టీచర్ వల్లే మా అందరికీ సైన్సూ, మ్యాథ్స్ అంటే చాలా ఇంట్రస్ట్ కలిగాయి" అంది.



బయట మేము నిలబడి తనవైపే చూస్తున్నామనైనా పట్టించుకోకుండా, చెప్పే పాఠంలోనే లీనమై క్లాస్ తీసుకుంటుంది సాహితీ. మృదులకు అనుమానం రాకుండా మరోసారి సాహితి వైపు చూసి తర్వాత తనని క్లాస్‌రూం దగ్గర వదిలిపెట్టి నేను బయటకు వచ్చాను.

ఆ రోజు సాయంత్రం నాకు ఫోటోలు చూపించడానికి వచ్చిన రాఘవయ్యతో కానూరులో మృదుల చదివే స్కూల్లో టీచర్‌గా పనిచేస్తున్న సాహితీ వివరాలు తీసుకోమనీ, వీలైతే నా బయోడేటా కూడా ఫార్వర్డ్ చేయమనీ చెప్పాను.

నాకు నేనుగా వివరాలు ఇవ్వడంతో రాఘవయ్య కూడా ఉత్సాహంగా "సరే బాబూ!" అన్నాడు. ఇంతకు ముందు స్రవంతి సంబంధం కుదర్చలేకపోయిన రాఘవయ్య ఈసారి నాకు ఈ సంబంధం కుదర్చాలని పట్టుదలగా ఉన్నాడు.

నేను సాహితీ కులగోత్రాల గురించి కూడా ఆలోచించలేదు. తన ఒప్పుకుంటే చాలు కట్న కానుకలతో నిమిత్తం లేకుండా, ఆమె చదువుతో సంబంధం లేకుండా తనని స్వీకరించాలని నిర్ణయించుకున్నాను. అందుకే రాఘవయ్యని తొందరపెట్టాను. "వచ్చే వారానికల్లా ఆ అమ్మాయి వివరాలు తీసుకొని వాళ్ళ పేరంట్స్ ఆ అమ్మాయికి పెళ్ళి సంబంధాలు చూస్తున్నట్లయితే గనుక నా బయోడేటా వాళ్ళకి వెళ్ళేలా చెయ్యి. వీలయితే నెల రోజుల్లోపు చూపులయ్యేలా చూడండి" అన్నాను రాఘవయ్యతో

రాఘవయ్య నా నుంచి రాబోయే మంచి కమిషన్ కూడా దృష్టిలో పెట్టుకుని పని ప్రారంభించాడు. వారం రోజులు కష్టపడి, లింకులు ఫామ్ చేసుకుని సాహితీ అడ్రస్ సేకరించాడు. పప్పులమిల్లు సెంటర్ దగ్గర్లో ఉన్న వాళ్ళింటికి వెళ్ళి నా వివరాలు ఇచ్చి ఫాలో అప్ చేసాడు. చాలా కష్టపడి వాళ్ళంటికి తిరిగి తిరిగి నా గురించి అదేపనిగా (పాజిటివ్‌గా) చెప్పి నా బయోడేటా ఇచ్చి చివరకు పెళ్ళిచూపుల ప్రోగ్రామ్‌కు ఒప్పించాడు.

మరుసటి ఆదివారం అందరు మళ్ళీ సాహితీ వాళ్ళింటికి బయలుదేరాము. కార్లో వెళ్తున్నంతసేపూ అమ్మ మళ్ళీ పురాణం విప్పింది." స్కూల్లో టీచర్ నీకెలా నచ్చిందిరా! ఇంజనీరింగ్ చదివిన అమ్మాయిని చూద్దామని మేమనుకుంటే నువ్విలా చేస్తావేమిట్రా?"అంది.

అంతకు మునుపు నేను కన్విన్స్ చేసి చెప్పినా గానీ ఇలా అనడంతో "తనని ఒకసారి చూసి మాట్లాడమ్మా! అయినా ముందు మనం వాళ్ళకి నచ్చాలి. తన అభిప్రాయాలు స్పష్టంగా తెలుసుకోవాలి! తర్వాత ఏదేమైనా, చదువు సంగంతంటావా? పల్లెటూళ్ళో ఉండే స్రవంతిని చూసావుగా! తన కోరికలే అలా ఉంటే ఇక్కడే విజయవాడలో ఉంటున్న వాళ్ళు ఏం ఆశిస్తారో! ఈ అమ్మాయి మీకు నచ్చుతుందనే ఆశిస్తాను. అన్నీ బావుంటే ఇది ఖాయం చేయండి. నేను కూడా వారం వారం భువనేశ్వర్, విజయవాడల మధ్య షటిల్ చేయలేక చచ్చిపోతున్నాను" అన్నాను.

"పెళ్ళి ప్రయత్నాలు ఉద్యోగం వచ్చిన వెంటనే మొదలుపెట్టమంటే విన్నావు కాదూ? అలా చేస్తే ఇన్ని బాధలుండేవి కాదు గదా!" అన్నాడు నాన్న.

"అయిందేదో అయింది! ఇక దాన్ని వదిలేయండి నాన్న. సాహితీ మీకు తప్పకుండా నచ్చుతుంది." అన్నాను.

ఇంతలో కారు సాహితి ఇంటి దగ్గర ఆగింది షరామామూలుగా ఫార్మాలిటీస్ అన్నీ అయిన తర్వాత మా పర్సనల్ టాక్‌కి ఎరేంజ్ చేసారు.

ఇంతకు ముందు జరిగిన నా మూడు పెళ్ళి చూపుల అనుభవంతో ముందు పొడిపొడిగా మాట్లాడి తర్వాత సంభాషణని వడివడిగా పరుగు తీయించాను. మధ్య మధ్యలో సాహితి తక్కువగానే మాట్లాడింది.

నా వివరాలూ, జాబ్ గురించీ అన్నీ సాహితికి చెప్పి 'మీకేమన్నా రిక్వైర్‌మెంట్స్ ఉన్నాయా?" అని అడిగాను.

"అంటే?"

"కాబోయేవాడు సాఫ్ట్‌వేర్ ప్రొఫెషనల్ అయి ఉండాలని గానీ, ఫారినర్ గానీ ఇలాంటివి ఏమైనా....."

నాకలాంటి ఆలోచనలు ఉంటే ఈ పెళ్ళిచూపులకు ఒప్పుకునేదాన్నే కాదు" అంది సాహితి క్లుప్తంగా. ఆమె స్ట్రయిట్ ఫార్వర్డ్ నేచర్‌కి ఆశ్చర్యపోయాను.

'అది నిజమే. కానీ నేనేమన్నా భవిష్యత్తులో అటువైపు వెళ్ళాలన్న కోరిక ఏమన్నా మీ వైపు నుంచి ఉందేమోననీ....' అన్నాను గత అనుభవంతో.

"నేను స్కూల్ టీచర్ని. పిల్లలతో కలిసి ఉంటూ వారిలో జ్ఞానమనే విత్తనాన్ని నాటి దానికి ఉత్సాహమనే నీళ్ళు పోసి తెలివితేటల్ని శాఖోపశాఖలుగా పెంపొందింపజేసి, పరిపూర్ణత, విజయం, వ్యక్తిత్వంతో కూడిన మహా వృక్షాల్ని పెంచడానికి కష్టపడుతున్న దాన్ని. నాకు వేరే ఆలోచనలు, కోరికలూ ఏముంటాయి? సాఫ్ట్‌వేర్‌కి వెళ్ళి కంపెనీకి రాత్రింబవళ్ళు పనిచేసి ప్రాజెక్టుల డెడ్‌లైన్లలో పడి టెన్షన్ పెంచుకుంటూ కంపెనీ ప్రాఫిట్స్ పెంచుతూ డబ్బు వెనకేసుకునే వారిని నేను ప్రిఫర్ చేయను. ఇది నా వ్యక్తిగత అభిప్రాయం. అందుకే మీతో పెళ్ళిచూపులకి ఒప్పుకున్నాను." అంది సాహితి.

ఆమె మాట్లాడిన విధానాన్ని బట్టి చూస్తే తనకి సాహిత్యంతో పరిచయం బాగా ఉన్నట్లనిపించింది. మొత్తంగా ఆమె చెప్పిన సమాధానం నాకు బాగా నచ్చింది. వరుస చూస్తే ఇదేదో కుదిరేదిలా కూడా అన్పించింది. అలా అవ్వాలని మనస్ఫూర్తిగా కోరుకున్నాను కూడా.



సాహితి తల్లిదండ్రులు టీచర్లవడంతో మావాళ్ళను చాలా ఆదరంగా చూసారు. తర్వాత సాహితిని మావాళ్ళు "ఏం చదివావమ్మా" అనడిగితే "డిగ్రీ అండీ" అని వినయంగా చెప్పింది. మొత్తంగా వాళ్ళకు కూడా సాహితి నచ్చేసింది. అణుకువ, వినయం, ఒద్దిక, అందం ఇలా అన్ని లక్షణాలు కలగలసిన అమ్మాయి అవడంతో వాళ్ళకి 'నో అనడానికి కారణాలేవీ కనపడలేదు.

నాకు సాహితి ముందే నచ్చి ఉండడంతో, తన అమ్మా, నాన్న ఉద్యోగులు కావడంతో పద్ధతి గల కుటుంబం అని భావించి మిగతా వివరాల (కట్నం అవీ) జోలికి వెళ్ళలేదు. 'అమ్మాయి నచ్చింది చాలు' అనుకున్నారు. ఏదో ఓ చోట రాజీపడాలి అనే భావనతో అమ్మా, నాన్న ఇంజనీరింగ్ చదివిన అమ్మాయే కోడలిగా రావాలన్న వాళ్ళ నియమాన్ని సవరించుకున్నారు. ఒక ప్రక్క నా వయసు పెరిగిపోతూ ఉండటంతో పాటూ, అమ్మాయిల కొరత ప్రస్తుతం అధికంగా ఉండి మంచి సంబంధమే దొరకని పరిస్థితుల్లో వాళ్ళు కూడా చాలా సంతోషంగా ఒప్పుకున్నారు.

ఎంగేజ్‌మెంట్, పెళ్ళి అన్నీ వరుసగా, వేగంగా జరిగిపోయాయి. పెళ్ళయిన వారం రోజులకే భువనేశ్వర్ వెళ్ళిపోయి కాపురం కూడా పెట్టాము. నెలరోజుల్లో మా ఇద్దరి మధ్య చెప్పలేనంత ప్రేమా అన్యోన్యతలు చోటు చేసుకున్నాయి. తర్వాత సాహితి భువనేశ్వర్‌లో రైల్వేస్కూల్లో టీచర్‌గా జాయినయింది. తన ఇష్టానికి విలువనిచ్చి నేను అడ్డుచెప్పలేదు.

నన్ను అర్థం చేసుకుని, తను ఎలా ఉంటే, ఎలా ప్రవరిస్తే నేను ఆనందంగా ఉంటానో అంతకంటె పదిరెట్లు మిన్నగా ఉంటూ నాలో సగభాగమయ్యింది. నాలో ఏమయినా కొత్తవిషయాలు తెలుసుకోవాలన్న ఆసక్తి ఇంతకుముందు కన్నా ఎక్కువ కలిగిందంటే దానికి కారణం సాహితి. తన ఎనలిటికల్ నాలెడ్జితో ఎటువంటి సమస్యనైనా పరిష్కరిస్తూ ఎప్పటినుంచో నాతో కలిసి ఉంటున్న ఒక వ్యక్తిలా ఈ కొద్దిరోజుల్లోనే కల్సిపోయింది సాహితి.

ఇలా మా దాంపత్యం అన్యోన్యంగా సాగుతూ ఉండగా ఒక రోజు నేను ఏదో ఆలోచిస్తుంటే "ఏంటి శ్రీవారూ ఏదో సీరియస్‌గా థింక్ చేస్తున్నారు?" అంటూ ప్రక్కన కూర్చుంది సాహితి.

"ఏం లేదు సాహితీ! ఈ మధ్య కాలంలో ట్రైన్ యాక్సిడెంట్స్ ఎక్కువ జరుగుతున్నాయి. ఏం చేస్తే పూర్తి స్థాయిలో ఇవి జరక్కుండా అరికట్టవచ్చు అనేదాని గురించి ఆలోచిస్తున్నాను. నేటి ఇంజనీరింగ్ టెక్నాలజీని ఉపయోగించుకుని రైలు ప్రమాదం జరగకుండా చేయడం సులువైన పని. రెండు రైళ్ళు ఢీకొనడం వలన గానీ, నిలిచి ఉన్న రైలుని వెనుక నుంచి వచ్చిన రైలు గుద్దడం అనేవి జనరల్‌గా 'సిగ్నలింగ్' లోపాల వలన జరుగుతున్నాయి. ఈ రైలు ప్రమాదాల్ని అరికట్టడానికి ఎంబెడ్డెడ్ ఎలక్ట్రానిక్స్' వాడుకుని మనుష్యుల వల్ల జరిగే లోపాల్ని, పొరపాట్లనీ సరిదిద్దుదామనుకున్నాను. అందులో భాగంగానే ఒక ఇంజనీర్‌గా లెవల్ క్రాసింగ్స్‌కి ఐదు కిలోమీటర్ల ముందే పట్టాలపై రైలు వెళ్తున్నప్పుడు కలిగే విపరీతమైన ఒత్తిడిని గుర్తించి ఆటోమేటిగ్గా గేట్లు పడే ఎలక్ట్రానిక్ లాక్ సిస్టమ్ కనుక్కున్నాను. దాని వల్ల కొంతవరకూ లెవల్ క్రాసింగ్స్ దగ్గర డ్యూటీ చేసే మనుష్యులు లేకపోయినా జరిగే ప్రమాదాన్ని నివారించగలిగాము. కానీ డ్రైవర్ల నిర్లక్ష్యం వల్ల, సిగ్నల్ ప్రాబ్లమ్స్ వల్ల అక్కడక్కడా ట్రైన్ కొల్లిజన్స్ జరుగుతూనే ఉన్నాయి. పట్టాలు తప్పడం వల్ల కూడా ఈ మధ్యే జరిగిన ప్రమాదంలో నలభైమందికి పైగా చనిపోయారు. వీటిని అరికట్టడానికి ఏం చేయాలి? ఎలా ఆటోమేట్ చేసి ఈ ప్రమాదాల్ని నివారించవచ్చు అనే విషయం గురించి ఆలోచిస్తున్నాను" అన్నాను.

సాహితి కూడా కొద్దిసేపు ఆలోచించి" నా పరిధిలో నాకు తెల్సిన సొల్యూషన్ చెప్తాను సార్! సరేనా? రెండు రైళ్ళు ఒకే పట్టాల మీద ఎదురెదురుగా వస్తున్నప్పుడు యాక్సిడెంట్ కాకుండా "గ్లోబల్ పొజిషినింగ్ సిస్టమ్" (జి.పి.ఎస్) ద్వారా ఒక రైలును మరొక రైలు ట్రాక్ చేయడం జరుగుతుంది. క్రాసింగ్ పాయింట్‌కు దగ్గరగా ఉన్న ట్రైన్‌ను వేరే ట్రాక్ మీదకు మళ్ళించి క్రాసింగ్ పాయింట్‌కు దూరంగా ఉన్న ట్రైన్‌ను నిలిపివేయడం వలన యాక్సిడెంట్‌ని కొంతవరకూ తగ్గించవచ్చు. దీనినే మనం 'యాంటీ కొల్లిజన్ సిస్టమ్' అని కూడా అనవచ్చు. ఎలా ఉందీ ఐడియా చెప్పండి" అంది. నేను తెరచిన నోరు అలాగే ఉండిపోయింది. నా బుర్రకి తట్టని పరిష్కారం నా భార్య విడమరచి చెప్పడంతో ఆశ్చర్యంతో కూడిన ఆనందం కలిగింది నాకు.

"ఏమిటండీ! అలా చూస్తూ ఉండిపోయారు?"

"సాహితీ! ఒక్క విషయం చెప్పు. నువ్వేం చదువుకున్నావు కరెక్ట్‌గా చెప్పు?" అనడిగాను. "పెళ్ళయిన నెల రోజుల తర్వాత భార్య ఏం చదువుకుందో అడగాలనిపించిందా మాష్టారు?!" అంది నవ్వుతూ.

"అహ! అదికాదు. నువ్వు ఏ సైన్సు గ్రూప్‌లోనో గ్రాడ్యుయేట్ వనుకున్నాను. కానీ నా అంచనా తప్పు. అందుకే అడుగుతున్నాను చెప్పవా ప్లీజ్." అన్నాను.

'నేను కచ్చితంగానే 'డిగ్రీ' అని చెప్పాను. కాకపోతే ఇంజనీరింగ్ డిగ్రీ. బి.టెక్. ఇ.సి.ఇ, ఐ.ఐ.టి ఖరగ్‌పూర్ నుండి" అంది సాహితి.

నాకు షాకే షాకు. ఇప్పటివరకూ సాహితి ఓ మామూలు డిగ్రీ గ్రాడ్యుయేట్ అనుకున్నాను. అందుకే ఏం చదివింది? ఎక్కడ చదివింది? లాంటి విషయాలు తెల్సుకోవాలన్పించలేదు. పెళ్ళయిన తర్వాత స్వీట్ నథింగ్స్. సరదా కబుర్లా కాలక్షేపాలయ్యాయి గానీ చదువుల గురించి ఎక్కువ మాట్లాడుకోలేదు. తను ఆ ప్రసక్తి తీసుకురాలేదు కూడా. ఈ రోజు నా సమస్యకు తను కనుక్కొన్న పరిష్కారం టెక్నికల్ బ్యాక్‌గ్రౌండ్ ఉన్నవాళ్ళకే సాధ్యం అన్పించింది. అందుకే తన క్వాలిఫికేషన్ అడిగాను. నేను చదివిన కాలేజీ కన్నా గొప్ప కాలేజీలో చదివి ఓ స్కూల్లో టీచర్ పనిచేయడం భువనేశ్వర్‌లో కూడా స్కూల్లో జాయినవ్వడం, ఇప్పుడు తన క్వాలిఫికేషన్ తెలియడంతో కలిగిన విస్మయం... వీటిన్నింటితో నా తెరచిన నోరు ఆశ్చర్యంతో ఇంకా పెద్దయి ఒళ్ళంతా కళ్ళు చేసుకుని తనవైపే చూస్తుండి పోయాను.



ఆశ్చర్యం కలిగించిన షాక్ నుంచి తేరుకోకుండానే "మరి నువ్వూ, స్కూలూ, పిల్లలూ, సింపుల్ లివింగ్..?" ఒకదానికొకటి సంబంధం లేకుండా కలగలపి ప్రశ్నగా అడిగాను.

"ఇంజనీరింగ్ డిగ్రీ నా చదువూ, క్వాలిఫికేషన్ మాత్రమే. కానీ నా మనసుకి ఆనందాన్నిచ్చేది పిల్లలకు జ్ఞానాన్ని పంచడం, అందుకే స్కూల్ టీచింగ్‌ను నేను కెరీర్‌గా, ఛాలెంజ్‌గా తీసుకున్నాను. ఇందులోనే నాకు సంతృప్తీ, ఆనందం ఉన్నాయి. నేను కమ్యూనికేషన్ ఇంజనీరింగ్ చదివాను. కాని మనిషికీ మనిషికీ మధ్య తగ్గిపోతున్న కమ్యూనికేషన్, పిల్లల్లో పెరగాల్సిన కమ్యూనికేషన్ స్కిల్స్ గురించి ఏ పుస్తకంలోనూ లేవు. అవి స్వచ్ఛమయిన మాటల వల్ల, అనుభవం వల్ల వస్తాయి. అవి పిల్లల్లో పెంపొందించగలిగితే వారు పెద్దవారయ్యాక ఎటువంటి సమస్యలనైనా తేలిగ్గా పరిష్కరించుకోగలరు. పిల్లల్లో స్వతంత్ర్యభావాల్ని కలుగజేసి తగినంత స్వేచ్ఛనిస్తూ వారి బాధ్యతనూ గుర్తుచేస్తుంటే వారు ముత్యాల్లా మారతారు. అలాంటి జ్ఞానాన్ని వారికి కాస్త ముందే కలుగజేయాలనే కోరికతోనే టీచింగ్ ప్రొఫెషనల్‌లో ఇష్టపడి చేరాను. ఈ ఆత్మ సంతృప్తి నాకు వేరే ఏ జాబ్‌లోనూ దొరకదు" అంది సాహితి. అంటూనే అరిచింది కూడా. ఈ అరవడం మాత్రం నేను ఆనందాతిరేకంతో తనను గట్టిగా హత్తుకుని గాలిలో గిరగిరా తిప్పడం వల్ల వచ్చింది.

"నువ్వు ఐ.ఐ.టి.లో ఇంజనీరింగ్ చదివి కూడా ఇలా సింపుల్‌గా..." అంటూ ఆగాను. "నాకు సింపుల్‌గా ఉండటమే ఇష్టం అండీ" అంటూ ఉంటే సాహితిని నేను వదిలి పెట్టలేకపోయాను.

"మా అమ్మా,నాన్న ఎలాగైనా ఇంజనీరింగ్ చదివిన అమ్మాయి కోడలిగా రావాలని ట్రై చేసారు. ఆ సంబంధాలు మిస్ అయితే బాధపడ్డారు. పైకి చెప్పలేదు. కానీ అలా జరగడం నా మంచికే జరిగింది. ఆ సంబంధాలు ఫెయిలవ్వడం వల్లే నిన్ను నేను భార్యగా పొందగలిగాను. నువ్వు ఇంజనీరింగ్ చదివావని కాదు నీ నిరాడంబరత్వం ఉంది చూడూ... అది నాకు చాలా బాగా నచ్చింది. ఇంతకన్నా ఏం అదృష్టం కావాలి చెప్పు సాహితి. అందం, చదువు, ఆస్తి ఇవన్నీ కాదు. అర్థం చేసుకునే అమ్మాయి భార్యగా దొరకడం ముఖ్యం. ఆ అర్థం చేసుకునే గుణం నీలో ఉంది. అలాగే ప్రక్కనే ఉండి ఇన్‌స్పిరేషన్ కలుగజేస్తూ నన్ను ముందుకు నడిపిస్తున్నావు. అందుకే ఐ ఫీల్ వెరీవెరీ హ్యాపీ టు హేవ్ యు యాజ్ మై లైఫ్. ఐలవ్ యూ డియర్" అన్నాను ఎంతో ఆప్యాయంగా.

"శ్రీవారు నన్ను మునగచెట్టు ఎక్కించేస్తున్నారు. పొగిడింది చాలు. దానికి ప్రతిగా ఈ రోజు రాత్రికి మీకివ్వాల్సింది చాలా ఉంది" అంది సాహితి కొంటెగా నవ్వుతూ.

నేను తొలిసారి చూసిన స్రవంతి సంబంధం తప్పిపోయిందని ఫీలయ్యాను. ఒక చిన్న ప్రైవేట్ ఇంజనీరింగ్ కాలేజీలో ఎం.బి.ఎ. చదివి తన కాబోయేవాడు మాత్రం చాలాగొప్ప పొజిషన్‌లో ఉండాలని కోరుకున్న స్రవంతి ఎక్కడ? ఒక ప్రెస్టేజియస్ ఇనిస్టిట్యూట్‌లో బి.టెక్. చదివి కూడా ఆ విషయం బయటపెట్టని నిగర్వి సాహితీ ఎక్కడ?

సాహితి ఇంజనీరింగ్ గ్రాడ్యుయేట్ అన్న విషయం తెలిస్తే మా అమ్మా,నాన్నల సంతోషానికి కొదవే ఉండదని తెల్సినా ఏనాడూ మాటల్లో తన గురించి చెప్పుకోవడం జరగలేదు. కొద్ది విషయాన్నే ఎక్కువ చేసి చెప్పకుంటున్న ఈ రోజుల్లో చేసింది చెప్పుకోకపోవడం అనేది మంచి గుణం. ఎంత ఎత్తుకి ఎదిగినా ఒదిగి ఉండాలనే సాహితి సూత్రం నాకు ఆదర్శప్రాయం. ఆలోచనలు ఆకాశమంత పెద్దవైనా తన చూపులు ఎప్పుడూ నేలవైపే. నాకు స్రవంతి మిస్ అయినా సాహితీ మిసెస్ అయినందుకు నేను సంతోషించని రోజు లేదు.

నా గురించి తెలుసుకుని, నన్ను అర్థం చేసుకున్న సాహితి ఏ విషయాన్నీ సీరియస్‌గా తీసుకోగూడదనీ, మనకు దక్కేది మనకు దక్కుతుందనే నా ఫిలాసఫీనే అర్థవంతంగా నాకు చెప్పేది. మనసు ప్రశాంతంగా ఉంటేనే మన శక్తి సామర్థ్యాలు బయటకు వస్తాయని తెలిపేదీ. దక్కని దాని గురించి ఆలోచించకుండా, దక్కిన దానిలో ఎంతో ఆనందం. సంతృప్తి వెతుక్కోవచ్చుననీ సాహితి నాకు భార్యగా వచ్చాకే పూర్తిగా తెల్సింది. అలాంటి భార్య నాకు దొరకడం నా అదృష్టం. అంతే కాదు తను నా జీవన పయనంలో ఒక మరపురాని మధురానుభూతిగా రోజు రోజుకీ శక్తినిచ్చే ఆలంబన కూడా...

●

# వ్యగ్ర మనస్కత

- డా॥ సి. నారాయణరెడ్డి



ఎండిపోయిన కొమ్మల సందుల్లోంచి
చూస్తుంటే
ఆకాశం ముక్కలు ముక్కలుగా కనిపిస్తుంటుంది
ఆ లోపం చూపులది కాదు
అగుపడుతున్న దృశ్యానిది.
జలజల పారే ఏటినీటిపైన
ప్రసరించిన చూపులు
అలలు అలలుగా సాగిపోతుంటాయి.
చూపులకు ఆ ప్రవాహ లక్షణం
పారే నీటివల్ల సంక్రమించిందే.

పక్షుల్లాగే
ఆలోచనలు ఎగిరెగిరి పోతుంటాయి.
పొద్దు వాలగానే పక్షులు
తమతమ గూళ్లలోకి చేరుకుంటాయి
ఆలోచనలు అలాకాదు
అప్పుడు అవి తమ చిరునామాలను
మరిచిపోతాయి.
ఎప్పుడూ విన్న ధ్వనులే
ఒక్కొక్కసారి
చెవులకు జోలలు పాడుతాయి.
అవే కొన్ని సందర్భాల్లో
చెవుల్లో చిల్లులు పొడుస్తుంటాయి.
చూసినప్పుడైనా విన్నప్పుడైనా
ఆలోచించినప్పుడైనా
కాపలాదారుగా ఉండేది
నిర్ణిద్రంగా నిలిచే మనసే.
ఆ మనసే కునికిపాట్లు పడితే
విశాలంగా పరుచుకున్న వెలుతురుపైన
చీకటిపొరలు కమ్ముకుంటాయి.
మనసుకుండే వ్యగ్రత
మనిషి జీవికకు భద్రత.

# జాషువా కవిత్వానికి ప్రాణం జీవితమే

- డా॥ కత్తి పద్మారావు



*నారాయణరావు జాషువాని తలుచుకుని దీపము అనే పదానికి తిర్లిక అనే పదం వాడిన ఘనుడు జాషువా అని చెప్తూ గ్రామీణ పదాలకు కావ్యగౌరవం కల్పించిన వాడు అని చెప్తుండేవారు. ఆయన అనేక సందర్భాల్లో మా ఇంటికి వచ్చి బౌద్ధం మీద ఆయన రాసిన కావ్యాలకు ప్రేరణ జాషువా అని చెప్పేవారు. సమకాలీనంలో ఆయనను అనుకరించని కవులు తక్కువ అని వ్యవసాయ కులాలు కూడా ఆయన కవితా విన్నాణానికి అభిమానులని నారాయణరావు చెప్పారు.*

సమకాలీనంలో ఉన్న కవులందరిని జాషువా అనుకూలంగా గాని, వ్యతిరేకంగా గాని ప్రభావితం చేస్తూ వచ్చారు. కొండవీటి వేంకటకవి మా గురువు. ఆయనతో పాటు సాయంత్రం ఆయనింటికి చేరేవాళ్ళం ఆయనింటిముందు లైబ్రరీకోసం ఒక చిన్న కుటీరం ఉండేది. అందులో నేను ఏల్చూరి వెంకటరావు (ఇప్పుడు టీవీలో ఆయుర్వేదం  బోధిస్తున్న వైద్యుడు) చదువుకొని ఉదయం గురువుగారితో కాలేజీకి వచ్చేవారం. ఈ సందర్భంగా ఆయన జాషువా గురించి మాకు చెప్తుండేవారు. ఆయన సమయపాలన చేసేవారని ఒకసారి తనను భోజనానికి పిలిచారని. మధ్యాహ్నం ఒంటిగంటవరకు ఎదురుచూసి ఆలస్యంగా వెళ్లినందుకు బాధపడ్డారని చెప్పారు. జాషువా కవిత్వంలో మాధుర్యం ఉందని, కరుణరసభరితమైందని కొండవీటి వేంకటకవి చెప్తూ చాలామంది కవుల్లాగా జాషువా ఇళ్ళకు తిరిగి పుస్తకాలు పంచరని పుస్తకాలు ముద్రించబడిన అనతికాలంలోనే ఆయన పుస్తకాలు చెల్లుబడి అవుతాయని అనేవారు. ఆయన కవి చక్రవర్తి, మేము కవిరాజులం మాత్రమే అని చెప్తుండేవారు. ఎక్కువమంది కవులు ఆ రోజుల్లో జాషువాగురించి మాట్లాడుకుంటూ ఉండేవారు. మా కాలేజీలో దిగ్గంతులైన పండితులు ఉండేవారు. నిష్ఠల సుబ్రహ్మణ్యం అనే గొప్ప పండితుడు మాకు రఘువంశం చెప్పేవాడు. ఆయన దగ్గర జాషువా ప్రస్తావన వచ్చినపుడు సంస్కృత కవుల్లో కాళిదాసుతో పోల్చదగిన కవి జాషువా అనేవారు. జాషువాకి సనాతనుల్లో కూడా అభిమానులుండేవారు. ఆయన కవితా శిల్పం శ్రీనాథుడికి దగ్గరగా ఉండేది. అందుకే ఆయనని మధుర శ్రీనాథుడనేవారు. బొద్దులూరి నారాయణరావు అని గొప్ప కవి మా ప్రాంతంలో ఉండేవారు. ఆయనను ఎన్.జి.రంగా సన్మానించారు. ఈ సందర్భంగా జరిగిన భోజనాల్లో నారాయణరావు జాషువాని తలుచుకుని దీపము అనే పదానికి తిర్లిక అనే పదం వాడిన ఘనుడు జాషువా అని చెప్తూ గ్రామీణ పదాలకు కావ్యగౌరవం కల్పించిన వాడు అని చెప్తుండేవారు. ఆయన అనేక సందర్భాల్లో మాఇంటికి వచ్చి బౌద్ధం మీద ఆయన రాసిన కావ్యాలకు ప్రేరణ జాషువా అని చెప్పేవారు. సమకాలీనంలో ఆయనను అనుకరించని కవులు తక్కువ అని వ్యవసాయ కులాలు కూడా ఆయన కవితా విన్నాణానికి అభిమానులని నారాయణరావు చెప్పారు. మోదుకూరి జాన్సన్ ఒకసారి మా ఇంటికి వచ్చినపుడు జాషువా తనను ప్రభావితం చేసిన విషయం చెప్పారు. ఆవుల గోపాల కృష్ణమూర్తి. జాషువాను ఎంతో అభిమానించేవారు. ఈ చర్చలన్నీ నన్ను ప్రభావితం చేసేవి. ఒక బలమైన కవిత్వం ద్వారా సమాజాన్ని ప్రభావితం చేసినపుడే సమాజంలో అన్ని వర్గాల ప్రజలు మారడానికి అవకాశం ఉంటుందని కవిత్వ సాధనకు ఈ చర్చలు పురికొల్పాయి.

హేమలత కూడా వాళ్ళ నాన్న గురించి చెప్పేటపుడు. ఆయన జంతుప్రేమ గురించి చెప్తూనే వుండేది... జంతువుల్ని ప్రేమించటం దళితుల జీవనంలో మమేకమై ఉంటుంది. కుక్కల్ని, పిల్లుల్ని, గేదల్ని ఇలా ఏదో ఒకజంతువుని పోషించని, ప్రేమించని దళితులు ఉండేవారు కాదు. ఇది గిరిజనుల్లో కూడా ఎక్కువ మానవ సమాజ పరిణామంలో జంతు ప్రేమ అతి ముఖ్యమైనది జంతువుల్ని మచ్చిక చేసుకున్నాకే స్థిర జీవనం ప్రారంభమైనది. జాషువాలో ఈ జంతు ప్రేమ కూడా ఎక్కువ. దాని అభివ్యక్తి కూడా చాలా ఆర్ద్రంగా ఉండేది.

> ఏ కాలంబుననో ఋణంబువడిన నన్నిన్నాళ్ళు సేవించి. నేఁ
> డీకాయంబు పరిత్యజింతివి. జాకీ! నాకు మర్యాదతోఁ
> దోకాడింపులు స్వాగతంబులిడి సంతోషించు నీ దృష్టికిన్
> నాకన్నన్ మొనగాడునుత్తముడు గన్పట్టుడుగా యుర్వరన్

(జాకీ, ఖండకావ్యం రెండవభాగం
- అదే పుస్తకం పేజీ: 79వ)

జాకీ చనిపోయినపుడు మహాకవి జాషువా కూడా కళ్ళ నీళ్లు పెట్టినట్టు హేమలత అక్క చెప్పారు. ఆయన ఆ కుక్కను గూర్చి చెబుతూ...

> నోరులేదుగాని చేరి నీవానరించు
> పనులతోన వింత భాషగలదు
> నీవు నేను దప్ప నితరులెఱుంగరు
> కనులతోడ నవ్వ గలవు నీవు

(అదే పుస్తకం పే:79)

అన్నారు. కనులతో నవ్వడం ఎక్స్‌ప్రెషన్ చాలా గొప్పది. తెలుగు సాహిత్యంలో ఇంత గొప్పమాట ఏ కవి అనలేదు. జాషువా కరుణ హృదయం ఇక్కడా మనకు అభివ్యక్తం అవుతుంది. ఒక

**కవిత్వం ఒక జీవన ప్రవాహం. మానవ సంబంధాలేకాక, జీవన సంబంధాలు కూడా ఆయన కవిత్వంలో ఒక పాఠశాలలా నడిచాయి. ఆయనది మాతృ హృదయం. జీవులతో ఆయన సంబంధం తల్లిలాంటిది. జాషువా కులతత్వనిరసనను అంతటా కొనసాగించారు. మాల, మాదిగల్లో వున్న వైరుధ్యాల పట్ల ఆయన మొదటి నుండి బాధను వ్యక్తం చేశారు. అంతే గాక మాల మాదిగలను హీనంగా ఇతరకులాలు సంభోధించడాన్ని నిరసించారు.**

జంతువును ప్రేమించడం వేరు, పూజించడం వేరు. మన సమాజం జంతువులను పూజిస్తుందికాని ప్రేమించదు. ప్రేమతో ఏ జంతువును నీవు దగ్గరకు తీసినా అది మానవులకంటే మననుకు దగ్గరవుతుంది.దానికి ద్వేష మాత్సర్యాలు లేవు. అనేకసార్లు మనుషులు వంచిస్తారుగాని జంతువులు మోసగించవు. పైగా యజమానిని అవి కాపాడుతాయి. ముఖ్యంగా 'కుక్క' విశ్వాసం కల జంతువు. కుక్క స్వభావాన్ని భావవ్యక్తీకరణను జాషువా మహోన్నతంగా చిత్రించారు. కృతజ్ఞతలను పసిగట్టడంలో ఆయనది లోతైన చూపు. ఆయన మనుషుల ద్వేషాన్ని లుకుటంగా చూశాడు.

పెట్టుంబోతలు సన్నగిల్లెననుచున్ విశ్వాస హీనాత్ములై
చుట్టాలుంజనినారు; నీ కడుపు చిచ్చున్ దీర్పు మృష్టాన్నమున్
బెట్టన్ జాలని నా యెడన్గలుగు నీ ప్రేమానుబంధం బహో
పట్టుస్వీడదు: నీ కృతజ్ఞతకు నా స్వాంతంబు నీరయ్యెడిన్
(అదే పుస్తకం - 75)

ఈ పద్యం జన జీవనంలో నిత్యం జరిగే అంశాలను తీసుకుని కవిత్వం జేయడంలో జాషువా కున్న నైపుణ్యాన్ని చెప్తుంది. చుట్టాలేమో సరిగా చూడకపోతే అలిగి వెళతారు. పెంపుడు కుక్కేమో అన్నము చాలకపోయినా కృతజ్ఞతతో ఉంటుంది.

చిన్నప్పటినుంచి పిట్టలతో, పక్షులతో, కుక్కలతో ఆయన కున్న అనుబంధం అపారమైంది. చిన్నపుడు పిట్టలను ప్రేమించడం వాటిని నిశితంగా పరిశీలించడం వలన ఆయన కవిత్వంలో ప్రకృతి ప్రభావం పరుచుకొంది. జీవ కారుణ్యం అంతర్లయగా ప్రవహించింది.

కవిత్వం ఒక జీవన ప్రవాహం. మానవసంబంధాలేకాక, జీవన సంబంధాలు కూడా ఆయన కవిత్వంలో ఒక పాఠశాలలా నడిచాయి. ఆయనది మాతృ హృదయం. జీవులతో ఆయన సంబంధం తల్లిలాంటిది. జాషువా కులతత్వనిరసనను అంతటా కొనసాగించారు. మాల, మాదిగల్లో వున్న వైరుధ్యాల పట్ల ఆయన మొదటి నుండి బాధను వ్యక్తం చేశారు. అంతే గాక మాల మాదిగలను హీనంగా ఇతరకులాలు సంభోధించడాన్ని నిరసించారు.

మాదిగలు, మాలలని మ
ర్యాదలల కాస్పదములేని అభిదలలో
సంబోధింప పలుకుదీనులు
పేదలు సుఖమన్నవారే? వినుకొండపురీ,
చండాలత్వం బొకదెస
గుండెలు దినివేయచుండ గొప్పల కొరకై
యొండొరులు కలహమాడుచు
నుండెదరా నేడు దైవమొకుడనుచున్ (నాకథ - 18వపేజీ)

జాషువా కవిత్వంలో కులతత్వానిరసనం ప్రధానాంశం. ఆయన ప్రతికదలికలో అసమానతలకు వ్యతిరేకంగా పోరాడుతూనే వచ్చాడు. జాషువా ముందు ప్రకృతిని పరిశీలించారు. ప్రకృతిలో అసమానతలు లేవు. మనషుల్లో అసమానతలు ఎక్కువ. ఇవన్ని కల్పించుకున్నవే. కొందరు కేవలం ప్రకృతి కవులు మరికొందరు ప్రకృతి ఆరాధకులు. అయితే ప్రకృతిలోవున్న సహజనజీవితగుణాలను మానవులకు ఉత్తేజం గొల్పేదిశగా వర్ణించడం ఉన్నతకవుల లక్షణం. ఆ ఔన్నత్వమే జాషువాను మహాకవిని చేసింది. ఈ ప్రభావం నామీద బలంగా ఉండటం వల్లనే ఆధునిక దళిత కవిత్వానికి 'నల్ల కలువ' 'నీలికేక' అందించగలిగాను.

గమనించినాడ చక్కని వన్నియలతోడ
విహరించుబహుకోటివిహగచరిత
సాకినాడతమాషాకోసమైకాక
ముంగిపిల్లల, గన్నబుడతలట్లు
చదువుకొన్నాడను సాలీన గూటిలో
దాగిన గాంధీ కథనకంబు
ఆకళించితి రవ్యతన్న దానముచేసి
స్వానములందున్న స్వామిభక్తి
మేటి జన్మంబునాదని మిటిపడెడు
మానవుని కన్న శాంతి సంపాదనమున
జంతుజాలంబు మెరుగన్న సత్యమింత
బోధపడ్డిది పదివేలగాథలేల

జాషువా జంతువులలో వుండే ప్రేమను గుర్తించారు. కుక్కల్లో వుండే విశ్వాసం పట్ల జాషువా చాలా మక్కువ చూపారు. వినుకొండ ఒకరకంగా ఆయనకు సామాజిక పాఠశాలలా ఉపకరించింది. ఏ కవైనా అంతఃపురాల్లో కూర్చొని, ఏసీ రూముల్లో కూర్చొని సమాజాన్ని, ప్రకృతిని సమన్వయం చేయజాలడు. మానవుడు ప్రకృతికి ప్రతిబింబం. ప్రకృతి ప్రభావం ఉన్నంతకాలం మానవుడిలో మానవత్వం ప్రతిఫలిస్తూనే వుంటుంది.

భావ కవుల ప్రకృతి వర్ణన వేరు. భావకవులు ప్రకృతిలోని ఋతువులను తమ ప్రేమకు, ప్రేయసికి అనుకూలంగా, ప్రతికూలంగా వర్ణిస్తారు. ప్రేమ పుట్టడానికి వసంత రుతువును, విరహాన్ని గ్రీష్మరుతువును, మేఘాలను ప్రణయదూతలుగాను ఇలా వర్ణిస్తూ ఉంటారు. కాని ప్రకృతిని మానవ జీవితంలోని వ్యత్యాసాలను చూపడానికి వాడిన వారు తక్కువ. వారిలో జాషువా ముఖ్యుడు. జాషువా ప్రకృతి పరిశీలనతో పాటు పశుపక్ష్యాదుల జీవన గతులను కూడా చక్కగా వర్ణించాడు.

ఏట్రింతపిట్ట పై కెగసి పల్టీ గొట్టి
యెయ్యారయుగ నేల కుఱుకుచుండ
పీకె తుమ్మలనుండి బెలగువ్వ జంటలు
ననసన్న గుడగుడ ధ్వనులు సేయ
చెట్ల కొమ్మల డాగి చెవులు గింగురుపోవ
యాల పుర్వుల పిండు గొల వెట్ట
పొలముగట్టుల కాపుపాలతుకల్ పోలికేక
బెట్టుచు వడిసెలల్ విసరుచుండ
అతి నిరాడంబ రానంద మాటలాడ
పండిన పొలాలతో నేత్ర పర్వమగుచు
ప్రబలునే నీదు పరిసర ప్రాంత లక్ష్మి
పెద్దనగరాల పెను హడావిడులు లేక. (నా కథ పేజీ: 17)

ఈ పద్యంలో కవి చాట్రగడ్డపాడు పరిసరాలను వర్ణించాడు. ఏట్రింతపిట్ట, బెలగువ్వల జంటలు, ఈల పురువులు, కాపు పాలతకుల్, పండిన పొలాలు ఈ పదాలు గ్రామీణ సంస్కృతినుంచి పుట్టినయి ఈ పక్షుల పేర్లన్ని తెలుగులో ఉన్నాయి. ఈ పక్షులన్నింటికి వాటి ప్రభావాన్ని బట్టి తెలుగువారే పేర్లు పెట్టుకున్నారు. దళిత వాడల్లో తెలుగు ఇంకా సవ్యంగా ఉండటానికి

కారణం వాళ్ళు నిఘంటు కర్తలు. ఒక పక్షికి గాని, ఒక జంతువుకు గాని, ఒక మనిషికిగాని స్వభావాన్ని బట్టి పేర్లు పెట్టడం చిన్నప్పుడు నేను మా ఈతేరులో చూశాను. మా చిన్న తాతయ్య చమత్కారి. నల్లగా ఉండేవాడిని మట్టోడు అనేవాడు. ఎర్రగా ఉంటే కొండోడు అనేవాడు. ఎక్కువ మాట్లాడే వాడని డబ్బాలోడు అనేవాడు. పిల్లలు పుట్టక పుట్టక పుడితే చెత్తోడు అనేవాడు. బొడ్డు ఎక్కువ కోసి కొందరికి లావుగా వుండేది. అప్పుడు పై చొక్కాలు ఉండేవి కాదు కాబట్టి బొడ్డోడు అనేవాడు. చక్కగా ఉండే అమ్మాయిని చందమామలా ఉందిరా అనేవాడు. ఎవరైనా నల్లగా ఆడపిల్లలు పుడితే బూలచ్మి అనేవాడు. చెంగుచెంగున ఎగురుతుంటే బొమ్మిడాయిలా ఎగురుతుందిరా అనేవాడు. చిన్నప్పుడు నేను అంతా కవిత్వమే వినేవాణ్ణి. ఇది నాకు జాషువాలో కన్పించింది. నేను కవిని కావడానికి జాషువా ఎంతకారణమో, మా ఊరుకూడా అంతే కారణం.

మాది ఈతేరు గుంటూరు జిల్లాలో బాపట్ల మండలంలో రోడ్డుప్రక్క ఊరు. మా దళిత వాడ ఊరులో పెద్దది. ఆ వూరు చిన్నప్పటి జీవితం నా కవిత్వానికి ప్రాణం. ఏ కవైనా తన ఊరు తన అమ్మ, నాన్నా, తాత, తన చెల్లి, తన భార్య గురించి రాసే దానిలోనే ఆత్మీయత ఉట్టి పడుతుంది. జాషువా కవిత్వంలో ఈ ఆత్మీయాంశాలన్నీ ఉన్నాయి. చాలా మంది తెలుగు కవులు వూరుపేరూ లేకుండా కవిత్వం రాసారు. అందు వల్ల వాళ్ళవూరి గురించి పుట్టిన తేదీ గురించి పరిశోధించడమే తెలుగు సాహితీ చరిత్రగా మిగిలిపోయింది. దేశీయత అనేది వూరి కవిత్వంలోనే ఎక్కువ వస్తుంది. తాత తల్లిదండ్రుల గురించి చెప్పేటపుడు గుండెలోతుల్లోంచి మాటలు పలుకుతాయి. ఆ రోజుల్లో పెళ్ళికూడా ఒక పెద్ద సందడి. జీవితంలో ఒక ప్రధాన ఘటం, మరచిపోలేని గుర్తు. ఈ పెళ్ళి ఘట్టాన్ని వర్ణిస్తూ జాషువా ఇలా చెప్పాడు.

*జాషువా కవిత్వంలో ఈ ఆత్మీయాంశాలన్నీ ఉన్నాయి. చాలా మంది తెలుగు కవులు వూరుపేరూ లేకుండా కవిత్వం రాసారు. అందు వల్ల వాళ్ళ వూరి గురించి పుట్టిన తేదీ గురించి పరిశోధించడమే తెలుగు సాహితీ చరిత్రగా మిగిలి పోయింది. దేశీయత అనేది వూరి కవిత్వంలోనే ఎక్కువ వస్తుంది.*

చదువు ముగించి, 'మేరి'యను
సద్గుణరాశిని, నాయెదందలో
మెదలెడు దాని, రూపవతి,
మేనటికంబను జన్మహక్కుతో
నెదిగినదాని, మాతపిత లిర్వురు
కూర్చినదాని, పెండ్లియై
బ్రదుకుచు, పల్లెటూరి బడిపంతులు వృత్తి నలంకరించితిన్.
తల్లియు దండ్రియుం, బరమధామము జేరి, గతించె నప్పుడే
జల్లగ దొమ్మిదేండ్లు సడిసన్నది చాటరగడ్డపాడు నీ
పల్లియలందు, మత్పితల భవ్య సమాధు లురంబునందు రం
జిల్లెడు రత్నభూషణవిశేషములైన కతాన మానినీ.

(నా కథ పేజీ:49)

జాషువా భార్యపేరు మేరి క్రైస్తవ నామమే. భార్యని సద్గుణ రాసి అని చెప్పాడు. జాషువా అంత ఎదుగడానికి కారణం ఈ మేరిమ్మే రూపవతి అనే ఒక్క మాటతో ఆమె చక్కదనాన్ని గురించి చెప్పాడు. పల్లెటూర్లల్లో ఆ రోజుల్లో ఒక్క మాటతోనే మొత్తం అంశం తేల్చేస్తారు. నమ్రతగా ఉండే అమ్మాయిని 'మంచిది' అని అంటారు. లేకపోతే 'గయ్యాళి' అంటారు. మగవాళ్ళలో కొంచెం దూకేవాళ్ళని 'పొగరుబోతు' అంటారు. కొంచెం కరుకుగా ఉండేవాన్ని 'ఎండి మిరగాయి' ఒక్క మాటతోనే స్వభావాన్ని మొత్తం ఒక్కమాటతో వర్ణించటం తెలుగువారి గొప్పతనం. అది జాషువా కవితలో కన్పిస్తుంది. ఆయన తన తల్లిదండ్రుల సమాధులను 'రత్న భూషణ విశేషములు' అన్నారు. అంటే చారిత్రక నిధులు అనే అర్థంలో వాడాడు. అంటే తన తల్లి దండ్రులకు పేరు తెస్తానని ఆ సమాధులు చరిత్రలో గుర్తింప బడతాయనే అర్థంలో విశ్లేషించాడు. కవి తన చుట్టూ ఉన్న పరిసరాన్ని బొమ్మ గీస్తాడు. పరిస్థితులకి అద్దం పడతాడు. సత్యాన్ని వక్కాణిస్తాడు. అందుకే చాట్రగడ్డపాడులో ఉన్న తన చుట్టాల దరిద్ర స్థితిని ఇలా వర్ణించాడు.

క్రాలుం జాటరగడ్డపాడనెడు కుగ్రామంబు; మా కందు జు
ట్టా లున్నా రిపుడుం; దరిద్రులుయి, మాటల్నేర్చి, దద్దమ్మలై
చాలీచాలని యన్నవస్త్రములతో, సంపూర్ణ దాస్యంబుతో
పై లోకంబు లభించునన్న మతగర్వగ్రస్త చిత్తాలతో.

(నా కథ పేజీ:49)

దళిత పల్లెల్లో తాగుడు, సోమరితనం, అలసత్వం ఇప్పటికీ రాజ్యమేలుతున్నాయి. జాషువా అప్పుడే వాటిని పసిగట్టాడు. ప్రతిభద్వారా, శ్రమద్వారా నిరంతర చలనం ద్వారా ఏ సమాజమైనా పైకి వస్తుంది. కేవలం మేము అంటరాని వారం మా బ్రతుకింతే అంటే జాషువా అంతవాడయ్యేవాడు కాదు. అందుకే ఆయన దళిత పల్లెల్లో ఉండే సోమరితనాన్ని కూడా ఎద్దేవా చేశాడు. ఈ కులతత్వాన్ని ఎదిరించి కవిత్వ కన్య నన్నెలా వరించిందో ఇలా చెప్పాడు.

ఒకడు ప్రోత్సహింప, నొక్కడు నిరసింప
నొకడు చేరబిలువ నొకడు తరుమ
మిట్టపల్లములను మెట్టుచు నెట్టులో
పలుకులమ్మసేవ సలిపినాడ.

నలత్రామల్‌బలె వర్ణభేదములు నాల్కల్ సాచుకాలంబునన్
వలచెన్ నన్ను కవిత్వవాణి, వనరుం
బ్రాయంబునన్ వెత్తిబా
గులై, బన్నము లందుకొన్నది, విడాకుల్
గోర దీనాడు, బి
డ్డలు పావల్ గలదై చరించెడిని
రాష్ట్రఖ్యాతి నార్జించుచున్.

(నాకథ
పేజీ: 87)

ఈ రెండు పద్యాలు తెలుగు కవనానికి పెట్టని కోటలు మొదటి పద్యంలో సరస్వతికి వలుకులమ్మా అని వాడాడు. పదాలు సృష్టించడంలో జాషువాది అందే వేసిన చేయి. రెండో పద్యంలో ఈ కవితా కన్య నన్ను జేసుకుని బిడ్డల్ని, పాపల్ని వృద్ధి చేస్తుంది. రాష్ట్రఖ్యాతి నార్జించున్ అన్నాడు. ఇక్కడ ఆయన ఆత్మ గౌరవం వెల్లివిరుస్తుంది. జాషువా దళిత జీవితం నుంచి ఆత్మ గౌరవాన్ని ప్రదీపింప చేస్తుంది. కవిత్వాన్ని జీవితంగా మలచుకుని జీవితాన్ని కవిత్వ పతాక ఎగురవేసినవాడు. ఎవరు ఏ కులంలో పుట్టారనేది ముఖ్యంకాదు. ఎవరు ఎలా జీవించారనేది ముఖ్యం జీవితాన్ని కవిత్వంలో రంగరించడమే నిజమైన శిల్పం. జీవితంలేని కవిత్వం వెలవెల బోతుంది. సామాజిక జీవనం కవిత్వానికి ప్రాణం. సమాజ స్పృహలేనివాడు. ఎండుకట్టెల్లాంటి పద్యాలే మా ముందు పడేస్తాడు. అందుకే జాషువా కవిత్వం చదువుతున్నపుడు మనకు మనం అందులో దర్శితం అవుతాము. అందుకే వారి తల్లిదండ్రుల సమాధులు చారిత్రక గుర్తులౌతాయి అనగలిగాడు.

ఈ స్ఫూర్తితోనే నేనూ ఒక చోట ఇలా అన్నాను.

చారిత్రక గుర్తులన్నీ
ఈనాడు పునర్ముద్రితమవుతున్నాయి
భూమి పొరల్లో నిక్షిప్తమైనవి
కొండ చరియలపై ముద్రించబడినవి
అంతరాంతరాల్లో దాగినవి
అన్ని జీవన సంస్కృతుల్లో సంకేతాలుగా
వెలుగొందుతున్నాయి
ఏదో పెనుగాలికి గుండెపొత్తం

# ఆగస్టు నెల పురస్కారాలు



## చెత్తోడు

కథకు.......రూ.700/-

రచయిత : యెన్నం ఉపేందర్



## బంజారా నానీలు

కవితకు.......రూ.500/-

రచయిత : డా॥ సూర్యా ధనంజయ్

**సినీ రచయిత జనార్దన మహర్షి అందిస్తున్న పురస్కార చెక్కులు ఈ రచయితలకు అందుతాయి.**

మీరు చదివిన కవితలు, కథలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు. ఒక రచయిత ఈ ఎంపిక నుంచి తనను మినహాయించాలని కోరాడు. అలాంటి అభిప్రాయాలున్న రచయితలు కూడా మాకు రాయవచ్చు.

- ఎడిటర్

---

రెపరెపలాడుతూ, పుటలు తిప్పుతుంది
అనుభూతులు కాదు
ఆయుస్సులూదిన శబ్దాలు
(కట్టెల మోపు: కార్యశీలురే బోధిసత్త్వులు పద్యం: పేజీ 122)

నేను జాషువాని చదవకముందు చాలా కవిత్వం రాశాను. మా చీరాల్లోని పేటల్లో ఇళ్ళు కాలిపోయినపుడు, ఒక పెద్ద పాట రాశాను అప్పుడు నేను 8వ తరగతే చదువుతున్నాను. అయితే ఆ పాటలు ఒక దుఃఖ ఘటనను చూసి హృదయం పొంగిరాసినవి. అప్పటికి బండారు రామారావు, హరిశ్చంద్ర నాటకంలో కాటిసీనులో జాషువా పద్యాలు పోగయి వుండే వారు. అందులో శారు, పహాడి మాల్కోస్, తోడి రాగాల్లో పాడేవాడు. ఆ పద్యాలు మానోళ్ళల్లో నానుతూ వుండేవి. అక్షరాల్లో చదవకముందు మేము జాషువాని డ్రామా పద్యాల ద్వారా విన్నాము. నిజానికి సంస్కృత కళాశాలలో నేను చేరడానికి కూడా ఈ పద్యాలు ఒక ప్రేరణ అంటే జాషువా ప్రభావం మౌఖికంగా మా మీద ఎంత పడిందనేది అర్థం దృశ్య చిత్రణ వుంది. శ్మశాన దృశ్యాన్ని చూపిస్తూ...

ఎన్నో యేండ్లు గతించిపోయినవి గానీ, యీ శ్మశాన స్థితిన్
గన్నుల్ మోడ్చిన మందభాగ్యుడొక డైనన్ లేచిరాఁ డక్కటా!
యెన్నాళ్ళీ చలనంబులేని శయనం? బేతల్లు, లల్లాడిరో,
కన్నీటంబడి క్రాగిపోయినవి నిక్కించిండి పాషాణముల్!!
(జాషువా రచనలు ఖండకావ్యాలు - పేజీ: 13)

శ్మశానంలో ఎందరో చనిపోయిన వారిని కాలుస్తున్నారు. పూడుస్తున్నారు. కాని ఎవరూ తిరిగి లేవడం లేదు. చలనం లేకుండా నిద్రిస్తున్నారు. తమ బిడ్డలు, భర్తలు చనిపోయినపుడు తల్లులు చేసే ఆక్రందనలకు పాషాణాలు కరిగిపోతున్నాయి. శ్మశానాన్ని చూస్తూ ఎవరికి భావాలు రావు, ఆలోచనలను రావు. అటువంటి శ్మశానాన్ని చిత్రించడం ఒక దళితులకే సాధ్యమవుతుంది. నా మొదటి కవిత కూడా శ్మశాన వర్ననమే....

అగ్రవర్ణ సాహిత్యంలో తత్వ శాస్త్రం మృగ్యమైంది. తద్దినాలు, ఆబ్దికాలు, కర్మకాండలతోనే వారి రచనలు సాగాయి మనిషి మరణంలో వున్న తాత్త్విక పార్శ్వాన్ని వారు గుర్తించలేకపోయారు. అందుకే పోయారు. అందుకే ఆధునిక దళితవాదానికి జాషువా ఆయువులు పోశాడు.

తత్వశాస్త్రం అంటే, మనిషికి, ప్రకృతికే కాదు మనిషి పుట్టుక, మరణం, బ్రతుకును తెలిపే జీవన శాస్త్రం అవుతుంది. అటువంటి జీవన శాస్త్రం తెలియకుండా గడిపే బ్రతుకులో నిరంతరం, శంకలు, మూఢాచారాలే పెత్తనం చేస్తాయి. మనిషి తన్నుతాను తాత్వికంగా అర్థం చేసుకోగలగాల్సి వుంది. దీనికి కవిత్వం కూడా తోడ్పడుతుంది. మానవ జీవన శాస్త్రంలో మరణం ఒక పెద్ద శాస్త్రం. దానిలో కూడా శిల్ప రూపకల్పన ఒక అద్భుతం. శ్మశానంలో 'సౌఖ్యం' క్రీడిస్తుందని జాషువా ఇలా చెప్పారు.

ఆకాశంబున కాఱు మబ్బుగములాహరించే, దయ్యాలతో
ఘుతంబుల్ చెరలాడసాగినవి; ఘోషించె నల్దిక్కులలన్
గా కోలంబుల్! గుండె జల్లుమనుంచున్నంగాని
దా కల్లాడిన జాడలే దిచట సౌఖ్యం యిక్కాటింయం చెంత క్రీడించునో!
(జాషువా రచనలు ఖండకావ్యాలు పేజీ:13)

గుండె జల్లుమనడం, ఆ కల్లాడిన జాడలేక పోవడం - రెండు వైరుధ్యాంశాలను కవి ఇక్కడ సమన్వయం చేయడంలో కవి సామర్థ్యం చూడ వచ్చును. జాషువాలో లోతైన తాత్విక దృక్పథం వుంది. మానవతా స్పర్శవుంది. ఆర్ద్ర హృదయం వుంది. ఈ భావాలన్నీ ఒక సమన్వయ రూపంలో ఆయన ఒక దృశ్యంగా పాఠకులకు అందించడంలో కృతకృత్యుడయ్యాడు. జాషువా జీవితం పూల పాన్పుకాదు. ముళ్ళ మీద నడుస్తూ కూడా ఆయన చిరు నవ్వే చిందించాడు. మానవాభ్యుదయం అనేది తాత్విక చింతనమీదే ఆధారపడివుంది. వవ్యశాస్త్రం జీవితంలో నమోన్నతాలు చూసిన వారికే అర్థమవుతాయి. అందుకే కాదు మనిషికి ఆర్ద్ర హృదయం కూడా అవసరం. ఆర్ధ్రత లేనివాడు కవికాలేడు. ఆనాడు విశ్వ విఖ్యాత కవులుగా ప్రసిద్ధి చెందని విశ్వనాథ సత్యనారాయణలాంటివారు. ఒక ప్రక్క చాతుర్వర్ణ్య, వేయిపడగల సంస్కృతిని ప్రచారం చేస్తుంటే. మానవులు పుట్టుకలోను, మరణంలోను ఒక్కటే కాబట్టి కుల, వర్ణ బేధాలు కల్పితాలని కవిత్వంలో జాషువా చెప్పటం ఒక సామాజిక విప్లవమే అవుతుంది. ఈ సందర్భంగా శ్మశాన వాటికలో ఆయన ఇచ్చోటనే సత్కవేంద్రేనికమ్మని కలము, నిప్పులోన గరిగిపోయే
(ఖండకావ్యము పేజీ: 13)

ఇది కరుణార్ద్రమైన కవిత శ్మశాన వాటికకు ఒక తాత్విక దృక్పథం వుంది.

శ్మశానం అనేక సందర్భాల్లో నిర్వేదానికి గురిచేస్తుంది. అయితే ఒక కళాకారుని మరణం ఒక చిత్రలేఖకుని మరణం, ఒక కవి మరణం భౌతికంగా తాత్కాలికం. వాళ్ళు అమరులుగానే ఉంటారు.

# సహజాతం

- జుగాష్‌విలి



పొద్దుటే తోటలోకి వెళ్ళాను
అప్పుడే వికసించిన ఆ పువ్వు నవ్వుతోంది
ఆ సౌందర్యానికి ముగ్ధున్నయ్యాను
మురిసిపోయాను
ఎక్కడ వాడిపోతుందో రాలిపోతుందోనని
నా చేతులు రెండూ అడ్డుపెట్టి
మోకాళ్ళపై కూర్చొన్నాను
పొద్దెక్కింది, మధ్యాహ్నమైంది
నేను కదల్లేదు మెదల్లేదు పువ్వును
వదల్లేదు
పొద్దు కుంకింది
సూర్యుడు వాలిపోయాడు
పువ్వూ తలవాల్చింది
గతితర్కం తెలుసునాకు
అయినా
ఆ క్షణం దిగులు మేఘం
నన్ను చుట్టుముట్టింది.

# చెట్టు

- అయినంపూడి శ్రీలక్ష్మి



పచ్చగా బతుకుతూ
పదుగురికై పాటుపడే ఓ చెట్టూ!
నన్నూ నీ జట్టు చేర్చుకో-
గుడిసెకి నిట్టాడిగానో
గుడికి గడపగానో
పెళ్ళికి పందిరిగానో
శవ దహనానికి కట్టెలుగానో
ఉపకరిస్తాను
వెతల ఆడ బతుక్కంటే
నవ్వే నయమన్న
నిజం-
నీ గుండె బల్ల గుద్ది
మరీ చెప్తాను-

# చౌడు నేల

- మహమ్మద్ ఇలియాస్



మృతగతపు మగతలో
ఎగ్రబాకే ఆలోచనలను
ఆలింగనం చేసుకునేటప్పుడు
మారువేషంలో ఉన్న కలగా
నీవు మూర్తీభవిస్తుంటావు

వ్యధభరిత నీ ప్రేమ శిథిలాల మధ్య
తచ్చాడే నా ఆత్మ సందేశాలు, సంవేదనా తరంగాలు
కపాల కడలినంతా కుదుపుతుంటే
కాల క్రౌర్యం కంపరమై కోరలు చాచుతుంది

గాయపడ్డ నా హృదయంలో
జ్ఞాపకాలు మరుగుతుంటే
ఉడుకెత్తే ఎడబాటు
బీటలువారిన బాంధవ్యమై
బ్రతుకును భారం చేస్తుంది

నా ప్రేమ నిత్యపరిహాసం అవుతుంది
మచ్చిక రాక్షస సాలీడేదో
అందమైన సీతాకోక చిలుకల్ని
కబళించేస్తుంది....

ఏ స్వార్థపు వడగాడ్పుల వేడికో
ఈ వదనం వడలింది
ఏ యాంత్రిక నిర్లక్ష్యమో
లేక నిర్లజ్జ కుతంత్రమో కాంచి
హృదయ నయనం ద్రవించింది

మధురమైన నీ పెదవులపై
ప్రేమ మదమెక్కిన ప్రేలాపన
నేడది ఒకడు అనుభవిస్తున్న వేదన
అస్తవ్యస్త పథాన సాగుతున్న
జీరబోయిన కంఠపు ఒంటరి ఆలాపన...

కమురొత్తి కక్కే కరి ధూపంలా
ఖాళీ అలమారంటి నా హృదయానికి
గబ్బు కంపు కొడుతున్న గతాన్ని అంటించావు

నక్షత్రాల్ని, సూర్యచంద్రుల్ని
తనలో దాచుకున్న ఆకాశం మాత్రం
ఎవరికీ కానిదే... నాలా శూన్యంగా బ్రతుకుతున్నదే
అందుకేనేమో ... నా అస్తిత్వం వణుకుతున్న ఒంటరి నీడ
రూపం... విచారం ఆకళించుకున్న జీవశిల
ప్రాణం... మరణానికి, జీవితానికి మధ్య
ఊగిసలాడుతున్న ఎండు గడ్డిపరక

అయినా... నాకు తెలుసు, నీ గూర్చిన
ముక్కుపచ్చలారని నా పంచరంగు స్వప్నాలు
రేపు ఖననం కావల్సింది, నా ముందర
నిస్సారంగా, నిస్తేజంగా పరుచుకున్న
ఈ 'చౌడునేల' లోనేనని.

కథ

# నిజంగా నిజం

- ఎస్. నాగ శిరీష



**'హజ్రత్ నిజాముద్దీన్ సే సికింద్రాబాద్ జానేవాలీ ఏ.పి. ఎక్స్‌ప్రెస్ దో నంబర్ కే ప్లాట్‌ఫాంసే ఖడీహై' అనే ఎనౌన్స్‌మెంట్ వినబడగానే కబుర్లలో మునిగితేలుతూ వెయిటింగ్ రూమ్‌లో ఉన్న మేము ఒక్కసారిగా లగేజీ పట్టుకొని ప్లాట్‌ఫాం వైపు పరుగుతీశాము. అది మే నెల కావడం చేతనో లేక ఉత్తరాది వారి పరిశుభ్రత చేతనో గానీ కంపుగొట్టే వెయిటింగ్ రూం నుంచి ఎ.సి. బోగీలో పడగానే ప్రాణం లేచివచ్చినట్లు అయింది.**

నేనుండేది హైదరాబాద్‌లో. నా భర్త ఉండేది ఘజియాబాద్‌లో. పెళ్ళయి నిండా సంవత్సరం కూడా కాలేదు. కానీ ఇక్కడ నుండి అక్కడకు, అక్కడ నుండి ఇక్కడకు కనీసం ఓ నాలుగు సార్లయినా తిరిగి ఉంటాను. నాకు నాట్యంపై ఉన్న మక్కువ, అర్హత గుర్తించి ఎలా అయినా సరే నాతో హైదరాబాద్ సెంట్రల్ యూనివర్శిటీలో ఎం.ఏ. చేయించాలని మావారు ఎంట్రన్స్ ఎగ్జాంకు కట్టించారు. ఎగ్జామ్ డేట్ రావడంతో తిరుగు ప్రయాణం కట్టాం. నన్ను, అమ్మమ్మను మా సీట్లలో కూర్చోబెట్టి, ట్రెయిన్ కదలడంతో వీడ్కోలు చెప్తూ ప్లాట్‌ఫాంపై నిలబడ్డారు మావారు. క్రమక్రమంగా ప్లాట్‌ఫాం దూరం కాసాగింది. మా పక్క సీట్లో ఒక తెలుగు యువతి ఉండటంతో అమ్మమ్మ ఆనందానికి పగ్గాలు లేవు. పాపం నెల నుండి తెలుగువారు కనబడక, మాట్లాడేవారు లేకపోవడంతో దిగాలు పడిన అమ్మమ్మ, తెలుగామె కనబడటంతో తబ్బిబ్బై నెమ్మదిగా మాటలు మొదలుపెట్టింది.

"ఏమ్మా! మీరు తెలుగువారా? నీ పేరేంటి?"

"అవునండి. నా పేరు వనకుమారి. మేము గుర్గావ్‌లో ఉంటాము. ఇందాక నన్ను ట్రెయిన్ ఎక్కించింది మా వారు. నేను పెళ్ళికి వెళ్తున్నాను" అంది.

పరీక్ష కదా! చదువుకుందామని పుస్తకాలు ముందేసుకున్న నేను వారి సంభాషణ చెవిన పడటంతో తలతిప్పి వింటూ కూర్చున్నాను.

మాతో పాటు నలభై ఐదు యేళ్ళున్న అంకుల్, ఓ తాతగారు, దగ్గర దగ్గరగా ఓ ముప్పై ఏళ్ళ యువకుడు ఉన్నారు. ప్రక్కనే సైడ్ బెర్త్‌లో ఓ తల్లీ కొడుకు ఉన్నారు. వీరంతా కూడా ఢిల్లీవాసులేనని, తరువాత వారి సంభాషణల వల్ల తెలుసుకున్నాను.

"ఒక్కదానివే వెళ్తున్నావమ్మా. పిల్లల్ని తీసుకెళ్ళడం లేదా. సెలవలే కదా" అడిగింది అమ్మమ్మ.

"నాకు ఒక పాప. దాన్ని ముందే మావారు అమ్మ వాళ్ళ దగ్గర దించి వచ్చారు. నేను పెళ్ళి దగ్గరకు డైరెక్ట్‌గా వెళ్తాను. అమ్మ వాళ్ళు పాపను తీసుకువస్తారు. అయినా పెళ్ళికి ఇంకా రెండు రోజులు టైం వుంది. మావారు బహుశా రాకపోవచ్చు. మాకు ఇక్కడ ఓన్ బిజినెస్ ఉంది. పాపం ఆయనొక్కరే చూసుకోవాలి. మీకు ఇంకో విషయం చెప్పమంటారా ఆంటీగారు. నేను ఎవరి పెళ్ళికి వెళ్తున్నానో తెలుసా! సినిమాల్లో సైడ్ క్యారెక్టర్స్ చేస్తారే రాజా వీరేంద్ర,. ఆయన కూతురి పెళ్ళికి. ఆయన నాకు స్వయానా బావగారు వరుస అంటూ చెప్పుకుపోతోంది.

అమ్మ బాబోయ్. ఒక్క ప్రశ్నకు ఇన్ని సమాధానాలా. నేనో పెద్ద వాగుడుకాయనని, నాది చెక్క నోరైతే ఎప్పుడో పగిలిపోయేదని, దొరికిన వారి బుర్రలు అమాంతం తినేస్తానని... అబ్బో మనకింకా చాలా చాలా పేరు ప్రఖ్యాతులు ఉన్నాయనుకోండి. ఈమె వాగుడికి నేనే ఇంత ఇబ్బంది పడుతుంటే, పాపం నా వాగుడు బాధితుల సంగతి గుర్తొచ్చి నవ్వు, కాస్త జాలి కూడా కలిగాయి. ఎవ్వరికీ తెలుగు రాదు కాబట్టి అయోమయంగా ముఖాలు పెట్టుకు కూర్చున్నారు. ఆ యువకుడు మాత్రం బండెడు పుస్తకాలు ముందేసుకుని ఏదో నోట్స్ ప్రిపేర్ చేస్తూ తన లోకంలో తను బిజీగా వున్నాడు. అంకుల్‌కి మాత్రం ఏదో ఒకటి మాట్లాడాలని వున్నా, ఏదో అర్థం కాని భాషలో సంభాషణ వుండటంతో పాపం తగ్గాడు.

"రాజా వీరేంద్ర అంటే టీవీ సీరియల్స్‌లో వచ్చేవాడు కదా. ఇప్పుడు సినిమాల్లో కూడా బాగానే వస్తున్నట్లున్నాడు."

"అవునండీ! అది సరే ఆంటీగారు..."

.... నాలో వున్న ప్రేమ నీతో చెప్పనా... అంటూ సెల్‌ఫోన్ మ్రోగింది.

"హలో బామ్మా! నేనే! ట్రెయిన్ బయలుదేరింది. అంతా బానే వుంది. ఇక్కడ అమ్మ వయసున్న ఆంటీగారు దొరికారు. ఆ...ఆ... తెలుగువారే... అలాగే బామ్మా... అంతా సౌకర్యంగానే వుంది. ఓం శాంతి... ఉంటాను."

"ఆంటీ గారు! మరేమో"

... నాలో వున్న ప్రేమ... మళ్ళీ ఫోన్ రింగయింది.



"ఏమండీ నేనే. అప్పుడే ఇల్లు చేరారా... ఫ్రిజ్‌లో కూర, ఆవగాయ, పెరుగు ఉన్నాయి. అన్నం వండే వచ్చాను. బయటి తిళ్ళు తినకండి. ఉంటాను... ఓం శాంతి.."

'సారీ అంటీగారు... మా వారి ఫోన్. మాకు అస్సలు బయటి తిండ్లు తినే అలవాటు లేదు. నేను లేనప్పుడు ఆయన ఎక్కడ తినేస్తారో అని అన్నీ వండే వచ్చాను. నేను మాత్రం అస్సలు అంటే అస్సలు ముట్టుకోను. సరిపడవని కాదు కానీ అస్సలు ఇష్టం ఉండదు. "

"స్నాక్స్! స్నాక్స్! అంటూ ట్రెయిన్‌లో బాయ్‌లు ట్రేలు పట్టుకొని హడావిడి చేస్తున్నారు. ఎ.సి. ట్రెయిన్‌లో ఫుడ్ డిపార్ట్‌మెంట్ వారే ఎరేంజ్ చేస్తారు. ఎండాకాలం కావడంతో ఎ.సి. బుక్ చేసుకోక తప్పలేదు. అందరితో పాటు స్నాక్స్ ట్రే ఆమె కూడా అందుకోవడంతో ఇంతసేపు ఒక రేంజ్‌లో వూదరగొట్టిన ఈమె ట్రే ఎందుకు తీసుకుందా అని ఆశ్చర్యంగా చూశాను. నా ముఖంలో మార్పు ఆమె గమనించక పోలేదు.

గబగబా సర్దుకొని "ఆంటీగారు నేను ఉదయం నుంచి ఏమీ తినలేదండి. నాకు కారు సరిపడదు. ఏమైనా తింటే కడుపులో తిప్పుతుంది. అందుకోసమని ఏమీ తినకుండా వచ్చాను. క్యాబ్ అను కునేరు. మాకు సొంత కారుంది. ఇంతకీ మీరు ఎక్కడ ఉంటారు" అంది.

"మేము ఘజియాబాద్‌లో ఉంటామమ్మా.. ఈ పిల్ల మా మనవరాలు. నా మనవడికి క్వార్టర్ ఫెసిలిటీ ఉంది. అక్కడే ఉంటాము. అన్నట్లు మీ ఇంటి అద్దె ఎలా ఉంటుందమ్మా. ఇక్కడ అసలే అద్దెలు వేలకు వేలు వసూలు చేస్తారట కదా."

"అయ్యో ఆంటీగారూ. మాది సొంత ఇల్లు. మేము ఢిల్లీ వచ్చి పదేళ్ళవుతుంది. పోయిన సంవత్సరమే ఇల్లు కొనుక్కున్నాము."

"మంచి పని చేశారు. ఈ అద్దె గోల తప్పింది. ఇంతకీ ఎంత పడిందమ్మా ఇల్లు?"

"ఎంతెందుకు పడలేదండి. ఎనభై లక్షలు. అందుకే కారు కొన్నాము. పాప ఇంటర్నేషనల్ స్కూల్లో చదువుతోంది. ఇంకా మరేమో..."

"మేడమ్ టీ" అంటూ బాయ్ మళ్ళీ వచ్చాడు.

అందరూ టీ త్రాగటంలో నిమగ్నులయ్యారు. చాలాసేపు నిశ్శబ్దం. హమ్మయ్య! ఈ టీ పుణ్యమా అని కాసేపైనా చదువుకునే అవకాశం దొరికిందని సంతోషంగా పుస్తకాలలో తలదూర్చాను.

"నాలో వున్న ప్రేమ నీతో చెప్పనా...." అంటూ మళ్ళీ ఫోన్ మోగింది.

("హాజీ! మై వనకుమారి హీహు. అబ్ మై ట్రెయిన్ మే హూ... హైదరాబాద్ జా రహీహూ. వాపస్ ఆనేమే ఏక్ మహీనా లగేగా......) అవును. నేను వనకుమారినే . ఇప్పుడు ట్రెయిన్‌లో వున్నాను. హైదరాబాద్ వెళ్తున్నాను. రావడానికి నెల పడు తుంది. నెల తరువాత నన్ను కలవండి. అప్పుడైతే మీకు పూర్తిగా బోధిస్తాను. నమస్తే... ఓం శాంతి."

అంతలో అంకుల్ "మేడమ్! ఆప్ హిందీ జాన్‌తే హో" ఎంతో ఉత్సాహంగా అడిగాడు.

"(హా! హమ్ యహా...) అవును... మేము ఇక్కడ పదేళ్ళ నుండి ఉంటున్నాము. దాంతో నేర్చుకున్నాను.

ఇక అంకుల్‌కి ఎక్కడలేని ఉత్సాహం వచ్చేసింది. ట్రెయిన్ మూవ్ అయిన దగ్గర నుండి ఎలా మాటలు కలపాలా అని తెగ ఎదురు చూస్తున్నాడు మరి.

"(తో మేడమ్ ఆప్....) అయితే మేడమ్! మీరు ఢిల్లీలో ఎక్కడ వుంటారు. పదే పదే ఫోన్‌లో "ఓం శాంతి" అని ఎందుకు అంటున్నారు. ఎందుకో మీరు కొంచెం ఇంట్రస్టింగ్‌గా అనిపిస్తున్నారు.

("హమ్ గురుగావ్ మే...) మేము గురుగావ్‌లో ఉంటాము. మావారు బిజినెస్ చేస్తారు. మాకు సొంత ఇల్లు ఉంది. లాస్ట్ ఇయర్ కొన్నాము. 80 లక్షలు అయింది. మాకు సొంత కారుంది..." అని మొదలుపెట్టి రాజా వీరేంద్ర కూతురి పెళ్ళి వరకు చెప్పుకొచ్చింది.

అప్పటి వరకు తెలుగులో ఈ చరిత్ర అంతా విన్న నాకు మళ్ళీ హిందీలో అనువాదం విన్నట్లయి కాస్త విసుగు అనిపించింది. అయినా ఆమె పిచ్చిగానీ, పాపం ఆ హిందీ వారికి రాజా వీరేంద్ర ఎలా తెలుస్తాడు. అది కూడా చెప్పింది. ఈమె ఓపికకు నిజంగా జోహారు అనుకున్నాను. కానీ ఆమె అసలు ఓపిక గురించి ముందు ముందు చాలా చూడాల్సి వస్తుందని 'పాపం' నాకే తెలియలా.

"(ఆప్ ఓం శాంతి కే బారే మే...) మీరు 'ఓం శాంతి' గురించి అడిగారు కదా! నేను కృష్ణకుమారి సమాజంలో మెంబర్‌ని. గురుగావ్‌లో ఈ సమాజం వారి పెద్ద బిల్డింగ్ వుంది. నేను ప్రతి రోజూ అక్కడకు వెళ్తాను. మంచి సంస్కారం నేర్చుకుంటాము. నేర్పుతాము. మానవుడు ఎలాంటి జీవనం గడపాలి, ఎలా జీవించాలి

అనేటటువంటి ఆధ్యాత్మిక ప్రసంగాలు అక్కడ ఇస్తారు. నేను కూడా ఈ విషయాలలో ప్రసంగాలు చేస్తుంటాను."

ఆమె మాటలు వినగానే అందరూ చాలా ఆసక్తిగా ఆమెను చూడటం మొదలుపెట్టారు. ఇంతలో అంకుల్‌గారు మరీ ఆత్రంగా "మేడమ్! ఓ భాషణ్...) మేడమ్! ఆ ప్రసంగం మేము కూడా వినాలని ఆశ పడుతున్నాం. వినిపించండి ప్లీజ్" అంటూ గారాబంగా దీర్ఘం తీశారు.

దొరికిందే ఛాన్స్ అనుకుందేమో... ఒక చిన్న గాత్ర సవరణతో మొదలుపెట్టింది. "(మనుష్య్ హమేశా....) మనిషి ఎల్లప్పుడూ ఏదో ఒకటి వాంఛిస్తూనే వుంటాడు. తన పూర్తి జీవితం డబ్బు సంపాదనతోనే వ్యర్థం చేస్తాడు. మనం బ్రతకడానికి ఎంత డబ్బు అవసరమో అంతమాత్రం చాలు. ఈ విషయాన్ని మరచి ఇతరులను బాధిస్తూ ఉంటాడు. ఈ శరీరం ఇవాళ ఉంటుంది. మరునిమిషం కూడా ఇలా వుంటుందని భరోసా లేదుగా. ఈ తుచ్ఛ శరీరం శాశ్వతం కాదు. ఈ రోజు కాకపోతే రేపైనా మట్టిలో కలవాల్సిందే. మనం ఎల్లప్పుడూ ఆడంబరం లేని జీవితం గడపాలి. ఈ డబ్బు, నగలు, కార్లు మనతో రావు. మనం మన దేహాన్ని ఆరోగ్యంగా ఉంచుకోవాలి. స్పైసీ ఫుడ్స్, ఆయిలీ ఫుడ్స్, మాంసాహారం పూర్తిగా వదిలేయాలి. తనువు, మనసు ఆరోగ్యంగా ఉంచుకోవాలి. మన ఆత్మను, ఆ పరమాత్మలో ఐక్యం చేయాలి. అప్పుడు ఎలాంటి భయాలూ, అనుమానాలూ ఉండవు..." అంటూ చాలా చాలా అభినయిస్తూ చెప్పింది.



ఇక అందరూ "(వాహ్ వా మేడమ్ జీ...) ఆహా! మేడమ్ గారూ, మీరు ఎంత సుందరమైన పదప్రయోగాలు చేస్తున్నారు. మీ మాట ఎంత శుద్ధంగా, తీయగా వుంది. మేమంతా మిమ్మల్ని అనుసరించి తీరుతాము" అని ముక్తకంఠంతో ప్రతినబూనారు. విశేషం ఏమిటంటే నోట్స్ ప్రిపేర్ చేస్తున్న ఆ యువకుడు కూడా ఎవరో సమ్మోహనాస్త్రం ప్రయోగించినట్లు సంభాషణల్లో కలిసిపోయాడు. హిందీ అర్థం చేసుకోగలగటం మాత్రమే తెలిసిన అమ్మమ్మ ఈ (సంభాషణలకు) వాగ్ధాటికి భయపడి నెమ్మదిగా పక్కకు తప్పుకుంది. నాకు మాత్రం ఎవరో పెద్ద సుత్తితో తల వాయగొడ్తున్నట్లు అనిపించింది.

అలా నెమ్మదిగా అందరూ ఒకరినొకరు పరిచయం చేసుకోవడం, అడ్రస్‌లు, సెల్‌ఫోన్ నెంబర్లు మార్చుకోవడం నిమిషాల్లో అయిపోయాయి. జోకులు వేసుకోవడం, పడీ పడీ నవ్వటం నాటరాగంలో మొదలైంది కానీ సురటి రాగానికి చేరే దాఖలాలు కనపడలేదు. ఆమె ప్రసంగం విన్న నేను ఎందుకొచ్చిన గొడవలే అన్నట్లు ఏమీ అర్థం కాని దానిలా అమాయకమైన ముఖాన్ని ఆశ్రయించాను. ఇంతలో భోజనం ట్రేలు రానే వచ్చాయి. జీరా రైస్, నాలుగు పూరీలు, కుర్మా, పనీర్, పెరుగుతో శుభ్రంగా సుష్టుగా భోం చేశారు. మన వనకుమారి గారైతే ఐస్‌క్రీంతో చాలదన్నట్లు, నెమ్మదిగా బ్యాగ్‌లోంచి స్ప్రైట్ బాటిల్ తీసి తాగి మరీ డిన్నర్ ముగించింది. అందరం నెమ్మదిగా నిద్రలోకి జారుకున్నాము.

నేను నిద్రను చాలా ప్రేమిస్తాను. పడుకుంటే ఒక పట్టాన లేవను. గుప్పుమనే కట్‌లెట్ వాసన నా ముక్కుపుటాలకు తగలడంతో లేచి చూద్దును కదా అందరూ అల్పాహారం ఆరగిస్తున్నారు. గబగబా లేచి, ముఖం కడుక్కొని నేను కూడా నెమ్మదిగా కానిచ్చేశాను. ట్రెయిన్ మధ్యాహ్నం 2.00 గంటలకు సికింద్రాబాద్ చేరుతుంది. టైం చూస్తే ఇంకా 9 గం॥లే. త్వరగా చేరిపోతే బాగుండు అని అనుకుంటుండగా, అంకుల్ మళ్ళీ మొదలెట్టాడు.

"అబ్ హమ్ ఆప్ సబ్ కో ఏక్ జోక్ సునాయేంగే" అంటూ ఏదో ఒక కుళ్ళు జోక్ చెప్పాడు.

అందరూ పడీ పడీ నవ్వారు. ఒక నవ్వు రాని జోక్‌కు ఇంతమంది ఇంతలా నవ్వాలా అనిపించి నాకు నవ్వొచ్చింది. నా ముఖంలో రాత్రి నుంచి ఎలాంటి రియాక్షన్ లేకుండా.. ఇప్పుడు చిరునవ్వు కనబడేసరికి, ఆయన జోక్‌కి నేనేదో నవ్వేస్తున్నానని అనుకొని.

'ఆప్ హిందీ సమఝ్ తే హై క్యా" అని ఆశ్చర్యంగా అడిగాడు అంకుల్. "సమఝ్‌తీ హు. బాత్ భీ కర్‌సక్‌తీహూ (అర్థం చేసుకోగలను. మాట్లాడనూగలను)" అన్నాను.

దానికతను కళ్ళు విప్పార్చి "(ఆప్ హిందీ కితనే అచ్ఛే...) మీరు హిందీ ఎంత చక్కగా మాట్లాడుతున్నారు. ఇప్పుడు మీరు మాకో జోక్ చెప్పాలి" అన్నాడు చనువుగా.

బాబోయ్ ఈ గోల నాకెందుకని చిన్న నవ్వు నవ్వి, పుస్తకం చదువుతున్న ఫోజు పెట్టాను.

ఇంతలో వనకుమారి నెమ్మదిగా అమ్మమ్మ పక్కకు జరిగి "ఆంటీగారూ! చూస్తున్నారుగా. రాత్రి నుంచి ఈయన తెగ బుర్ర తినేస్తున్నాడు. చచ్చిపోతున్నాననుకోండి" అంది చేతులు తిప్పుతూ. చివరికి ఎలాగో పన్నెండయింది భారంగా. భోజనాలు వచ్చాయి. ఈసారి వనకుమారి వయ్యారాలు పోతూ "(భయ్యా! ముఝే ఖానా నహీ చాహియే. మై బాహర్‌కీ ఖానా బిల్‌కుల్ నహీ ఖాతీ) చూడు బాబూ! నాకు భోజనం వద్దు. నేను బయటి తిండ్లు అస్సలు తినను" అంది.

దానికతను అదోలా చూసి అర్థం కానట్లు వెళ్ళిపోయాడు.

అతని చూపులో "రాత్రి బాగానే తిన్నావుగా. ఇప్పుడేమయింది" అనే భావం మాత్రం నాకు అర్థమయింది.

భోజనాలు అయ్యాక మా అందరికీ సర్వ్ చేసిన బాయ్‌లు టిప్ కోసం వచ్చారు. మనిషికో పది రూపాయలు చొప్పున వారికిచ్చాము.

వాళ్ళను అటుపోనిచ్చి మన వనకుమారి "ఎంత దోపిడీ చూడండి ఆంటీగారు. ఇన్నిన్ని డబ్బులు పోసి టిక్కెట్లు కొన్నామా! మరి వీళ్ళేం చేశారని మనం డబ్బులు ఇవ్వాలి. నిజంగా ఇది పెద్ద దోపిడీ అండి" అంది ఆవేశంగా ఆక్రోశిస్తూ...

"మనిషి, జీవితం, శాశ్వతం, అశాశ్వతం అని ఇన్ని కబుర్లు చెప్పిన కృష్ణకుమారి సమాజ సభ్యురాలు వనకుమారి గారి అసలు రూపం చూస్తే జాలేసింది.

మళ్ళీ కాసేపు అంతా నిశ్శబ్దం. ఎలాగోలా ట్రెయిన్ నెమ్మదిగా స్టేషన్ చేరింది. అందరూ గబగబా లేచి లగేజ్ పట్టుకొని, వీడ్కోలు చెప్పుకోకపోగా, వారంతా ఒకరికొకరు అపరిచితుల్లా ప్లాట్‌ఫాంపైకి పరుగెత్తారు.

వీడ్కోలు చాలా భారంగా పెద్ద ఎత్తులో ఉంటుందని ఎదురుచూసిన నాకు ఇదంతా చూసేసరికి కాసేపు నవ్వాలో, ఏడ్వాలో అర్థం కాలేదు. ●



# నాది బాధపడిన కవి పక్షం

- వేగుంట మోహనప్రసాద్

**ఈ ఇంటర్వ్యూలో వ్యాఖ్యానాత్మక ప్రశ్నలు, వివరణాత్మక జవాబులు గతంలో అందరినీ ఆకట్టుకున్నాయి. ఆయనకు ఒక నివాళిగా ఈ పునర్ముద్రణ - ప్రస్థానం ప్రత్యేక సంచిక 2002 నుండి.**

**నేనొక దుర్గం నాదొక స్వర్గం అనకపోయినా మీరో ప్రత్యేక బాణీతో వుండి పోయారు కదా. ఇప్పుడు వెనక్కు తిరిగి చూసుకుంటే కవిత్వకంగా తాత్వికంగా ఏమనిపిస్తుంది?**

'స్వర్గం', దుర్గం' అన్న పదాల్లోని అతీత లోకాన్ని అతిమానవ 'అహం' కారాన్నీ ఈనాడు మనం ఆనాటి శ్రీశ్రీకి కాక ఒకనాటి బైరాగికీ కాక మరొకప్పటి కృష్ణశాస్త్రికీ కాక వాళ్ళవాళ్ల మరో ప్రపంచాల మనో ప్రపంచాల భావనా ప్రపంచాల పరిధుల్లో కాక నానాటికీ విస్తృత మవుతూ పోతోన్న విరుద్ధభావాల విభిన్న శక్తుల విచ్ఛిన్న యుక్తుల చిన్నాభిన్న వేరువేరు, ఇతరేతర ప్రపంచాల నాటకీయ పరస్పర ఘర్షణా నేపథ్యాలకు అన్వయించుకొన్నప్పుడు ఏ ఒక్క మహాకవీ (శ్రీశ్రీ) మహారచయిత (చలం) కూ మాత్రమే పరిమితం కాలేని ఒకానొక అపరిమేయ సాహిత్య కర్తవ్యాల (కవిత్వమనే ఒకే ఒక్క సాహితీ రూపం మాత్రమే కాక) అనంత వైరుధ్యాల వ్యక్తిత్వాలు కలిగిన సాహితీ కారులెందరెందరో ఈనాడున్నారు- వారందరూ కూడా వారంతట వారే ఒక్కొక్కరుగానే 'అనితరసాధ్యం నామార్గం' అనగలిగిన వారే. మహాప్రస్థాన కవిగా, చరమరాత్రి కథకుడిగా అనంత స్వీయ జీవన చిత్రకారుడిగా, అభ్యుదయాన్నుంచి విప్లవప్రగతి మార్గంలోని మరో ప్రస్థాన కవిగా, అతిమేలపు ప్రయోగశీలంతో అధివాస్తవిక నాటక ప్రయోక్తగా కలాన్ని ఖడ్గంగా సృజించిన అతను ఆ మాట అపుడెపుడో చెప్పుకొన్నందువల్ల ఇక అనితర మార్గాలు లేవనీ అనితర సాధ్యాలూ లేవని ఆగిపోనక్కరలేదని ఈనాటి(1967నుంచి) దిగంబర, విప్లవ, స్త్రీవాద, దళిత కవిత్వాలు నిరూపిస్తూనే అనుభవ, అనుభూతి, హైకూ, ఐంద్రియ, వాంఛా, కవిత్వాలకు కూడా సముచిత స్థానాన్నిస్తూ ఆయా ఛాయల్లోని కవులకు కనీసం ఒక్కొక్కరికైనా ఆ అనితరత్వాన్ని ఇచ్చుకోక తప్పిందికాదు. అసలీ అనితరత్వం అనే విశేషణాపదాన్ని, భుజకీర్తిని కవికే ఎందుకివ్వాలి? కవిత్వరచన ఒక్కటే సాహిత్యం కాదు. సారస్వతంలోని అంతఃశక్తి సాహిత్యం. సాహిత్యం బహుముఖి. ఈనాడు అనితర సాధ్యమైన కథలు వస్తున్నాయి. (91 నుండి 2001 వరకు ఏటేటా కథలు) ఈనాడు అనితర సాధ్యమైన అనంతాలు వస్తున్నాయి (గమనాగమనం, భ్రమణకాంక్ష, ఆఖరి బ్రహ్మడు) ఈనాడు అనితర సాధ్యమైన నవలలు వొస్తున్నాయి, (అంటరాని వసంతం, ఎల్లి,నీలి, అతడు అడవిని జయించాడు, నేనూ చీకటి,ఐదు హంసలు) ఈనాడు అనితరులు కారు-అనేక అనితేతరులున్నారు. చండీదాస్, నామిని, పతంజలి,శ్రీరమణ, పతంజలిశాస్త్రి, దీవి సుబ్బారావు, ఎండ్లూరి సుధాకర్, జొన్నవిత్తుల జగన్‌రెడ్డి, సిద్ధార్థ, అయిల సైదాచారి, సైదా, రమణ జీవి, దాము, రాణి శివశంకర్‌శర్మ, దెంచనాల, ఎం.ఎస్. నాయుడు, సీతారాం, యాకూబ్, గురుస్వామి, జయప్రభ, కొండేపూడి నిర్మల, ఓల్గా ఇంకా ఎవరెవరి సాహిత్యప్రక్రియలలో వాళ్లు 'అనితర సాధ్యం నా మార్గం' అనదగినవాళ్లున్నారు. కాకపోతే కొందరు వాళ్లవాళ్ల స్వర్గాల్ని వాళ్లవాళ్ల నరకాల్నీ వాళ్లే సృజించుకొంటున్నారు. స్వర్గం ఎంత సృజనశీలమో నరకం అంతే సృజనశీల దుష్ప్రయాత్మకం. మీప్రశ్న మొదటికి రావాలంటే-నా నరకాన్ని, నా చేజేతులా చేసుకొన్న నరకాన్ని, కవిత్వ ప్రక్రియలో కాకుండా కథనాత్మకంగా వ్యథావ్యధాత్మకంగా 'బతికిన క్షణాలు'లోనూ, 'పునరపి' లోనూ సృజించుకొని తీరా సముద్రపుటొడ్డున కట్టుకున్న పిచికగూళ్లుగా నేనే ఒక్కక్కటిగా కూల్చేసుకొన్నాను- బుచ్చిబాబు అంతరంగకథనంలోలాగా, ఈ రెండు రచనలలోనూ నేను, అనితర సాధ్యం నా మార్గం' అని ప్రస్తుతం అనుకొంటూనే ఉంటాను, వాటిని మించిన చొక్కాలాగూ చించేసే ఆత్మస్థైర్యం వచ్చేదాకా ముందుగా, నా కంటే ముందుగానే'త్రిపుర' అలాంటి సాహితీ రచన చేయకుండా ఉంటే.

**విమర్శలు విసుర్ల మధ్య మిమ్ములను మీ మార్గానికే అంటిపెట్టుకుని వుండేలా చేసిందేమిటి?**

మరచిపోయాను. మీ పై ప్రశ్నలోని 'తాత్వికంగా', 'కవిత్వకంగా' అనే రెండు సూచనలు..

'తాత్వికంగా' అనేది ఒక పెద్ద బరువైన మాట. వాడి 'తత్వమే' అనేది చాలా సులువైన మాట. 'చితి-చింత' అనే సంకలనానికి ఏ

తత్వమూలేదు. అయినా భయపడి పోయారు. ఒక్క కె.వి.ఆర్.తప్ప. సంజీవదేవ్, నాగళ్ల గురుప్రసాదరావు, రోణంకి వాళ్లవాళ్ల అద్భుత జ్ఞాన సంపదని ఐలార్చుకొన్నారు తప్పించి- 'చితి-చింత' లోని అమాయకత్వాన్ని, నవయౌవ సందేహ సందోహాల్ని వాళ్లు పట్టుకోలేకపోయారు. దిగంబర కవిత్వం కంటే ముందు వొచ్చిన డ్రాయరు లేని పిల్లాడి కవిత్వం అది. విప్లవకవిత్వం కంటే ముందువచ్చిన విద్రోహ చర్య అది. ఈ రెండు ఉద్యమాల ఉధృతీ 'చితి-చింత'ని అవజ్ఞలోకి నెట్టేయటానికి ప్రయత్నం అంటూ ఏమీ లేకుండానే కొత్తకొత్త పదబంధాల్తో పిచ్చిరెచ్చిపోయే సభల్తో నన్ను పాఠకులకి దూరం చేసినయ్. దిగంబరుల ముఠా. అప్పటి విప్లవుల గుంపు. ముఠాలోనైనా నిలిచిపోయే కవి- ఈనాటికిన్నూ ఒక మహాస్వప్న. గుంపులో చెర. అప్పటి "అరుణతార". ఈనాటి హెచ్చార్కె ఆనాటి సమీక్షా వ్యాసమూ, ఈ నాటి వ్యక్తిగత లేఖా అర్థం చేసుకోవటం లోని వైఫల్యానికి అనర్థాలకి ఉదాహరణలు.

**ఇక రెండవ ప్రశ్న:** విమర్శలూ విసుర్లు! కదా! మీ తర్వాతి మాటకు అడ్డుపడినట్టున్నాను. పైన చెప్పిన సమాధానమే. కాకపోతే-లేకపోతే-ఒక రకంగా చెప్పుకుందామా! న్యూ బేరింగ్స్ అనేవి ఎపుడూ ఉండాలి. నా విషయంలోనూ ఉన్నాయనుకొంటున్నాను, ఎలాంటే- ఇస్మాయిల్ 'రెండో ప్రతిపాదన' లాగా! విమర్శపై పునర్విమర్శ ఎన్నిసార్లు రాలేదు! కన్యాశుల్కంపై కె.వి.ఆర్, కోవెల, కేతవరపు, పోస్ట్‌మాడర్నిజంపై అఫ్సర్, బి.టి.ఆర్., గూడ శ్రీరాములు, ఎన్.వేణుగోపాల్, నామిని పై రామకృష్ణారెడ్డి, ఎండ్లూరి సుధాకర్‌పై చేరా, చేరాపై బూరా, నారాపైచేరా, రారాపై ఎబికె, చేరాపై రామకృష్ణారెడ్డి, రంగనాయకమ్మల్లాగా.... ఇది అనంతం గురూ.... ' అనుభవం.... ఏమిటంటే- గుంపుకి ఒక మతం, ఒక విశ్వాసం, ఒక మూఢత్వం ఉంటుంది. వ్యక్తి ఐనపుడు గుంపుకి ప్రతినిధిగా ఒకానొక గణాచారి అవుతాడు. ఆ గణాచారిని నేను చూస్తూ ఆ పదధ్వనిని ఆ పదాల ప్రకంపనలనీ నేను ఆహ్లాదిస్తూ వస్తున్నాను. ఈనాటికిన్నూ. గుంపులోని మతాన్ని వ్యక్తి అభిమతంగా మార్చినపుడు అది సాహిత్యస్థాయినందుకొంటుంది.

**ఉంటే గ్రామంలో వుండాలి. పోతే సముద్ర తీరాల ఆవలికి పోవాలి అన్నారు కదా, అంత మట్టి వాసనల నేటివిటీని మామూలు ఉహకందని అంతర్జాతీయ ప్రతీకలను ఒక్క ఊపులో ఎలా ఇమడ్చగలిగారు?**

అవునండీ! గ్రామం.... ఊరు.... అమ్మ.... తల్లి..... ఇవన్నీ వీటి విలువలన్నీ ఎపుడు తెలిసొస్తాయంటే వాటిని పోగొట్టుకొన్నప్పుడే. పల్లెటూరు పోయిందనే కాదు నా ఏడుపు.... నిన్న గాక మొన్న మా వట్లూరు (మా స్వగ్రామం) వేణుగోపాలస్వామి ఆలయంలో 150సంవత్సరాల దేవతా విగ్రహాలు నల్లబారిపోయాయన్నా, అటుమొన్న నా మహానగరం న్యూయార్క్ కుప్పకూలిపోయిందన్నా, నాకు అనంతమైన ఏడుపు. దుఃఖమే దుఃఖం ప్రాచీన సముద్రాలలో పురాతన నగరాలెన్ని కూలిపోయినాయో, అప్పటి ఆ జనజీవనం ఎంత సజలనయనమైనదో కదాని నా అనంత దుఃఖదీనగానం! 'మట్టివాసన' అని మీరన్నారు గానీ నేనేనాడూ నాకు వారసత్వంగా వచ్చిన మూడు ఎకరాల పొలాన్ని కాచుకోలేకపోయినాను. పొలాన్ని, హలాన్ని అమ్ముకొంటే కవికి కలాన్ని అమ్ముకొన్నంత ఏడుపు రాదా! మొన్నీమధ్య సరదాగా మాట్లాడుకుంటూంటే- చలసాని ప్రసాద్ ఓ మాటన్నారు. "తాజ్‌మహల్ కూ్కడా సైట్ వాల్యూ తప్పితే ఏమీ లేదు" పదెకరాలమ్ముకొని సిద్ధార్థ కాలేజ్ చుట్టుపక్కల ఓ చిన్న ఇంటిచోటు కొనుక్కొన్నవాళ్లు పొలాన్ని అరువుకో ఎరువుకో ఇచ్చేసి పిల్లల ఇంజనీరింగ్, డాక్టర్ చదువులకోసం వచ్చేసినవెన్ని కుటుంబాలు! అగ్నిపెటికల్లాంటి అపార్ట్‌మెంట్స్‌లో పక్కవాళ్ల పేర్లుకూడా తెలీని తనాల ఇతరత్వాలు...! పైగా వీళ్లే మళ్లీ ప్రైవేటైజేషన్, గ్లోబలైజేషన్, ఎం.ఎన్.సి.ల మీద కంప్యూటర్ కంపెనీలమీద వాజ్యమాడే వేషగాళ్లు, ముఖ్యంగా మన కవులూనూ, వాళ్ల పిల్లలకి ఈ చదువులే ఈ వీసాలే కావాలి. మైక్‌ముందు మాత్రం వాక్చాతుర్యంలో మనల్ని అవమానిస్తారు. ముఖ్యంగా వాళ్లల్లోనూ లెఫ్టిస్టులు! దళిత స్త్రీవాద కవులూ కవయిత్రులునూ, కెరీరిస్టు సేవా సంఘాలు ఎవరికి వారే వేరు వేరు కుంపట్లు నెలకొల్పుకొని స్వీయసేవా కీర్తి, తృప్తీ పొందుతున్నవాళ్లు. నిజానికి మాట్లాడే పెదాల శబ్దాల లోపలికెళ్లి వింటే ఎంత అనృత వాసనో శబ్ద కాలుష్యమో కదా! మీరన్న 'నేటివిటీ' అంటే బాల్యభాషలో అందంగా నా తనాన్ని నేను శాశ్వతంగా చెప్పటమే. నేనిపుడు పుస్తకాల్నించి కాక చిన్నపిల్లల్నించి 'భాష'ని నేర్చుకుంటున్నాను. 'నామిని' ఎంత ప్రాంతీయ సాహితీవేత్తో అంత విశ్వాంతరాళపు కవి. నా మనమడు - విరాట్ (విరి) నించి ఎంత గొప్ప కవిత్వం నేనిపుడు నేర్చుకుంటున్నానో!" తాతయ్యా! ఐ వాంట్ టెల్యు ఎ సీక్రెట్" అంటే నేను చెవొగ్గాననుకోండి "ఐ లవ్యూ" అనన్నా అంటాడు, లేదా "ఐ డోంట్ లైక్యూ" అన్నా అంటాడు. "నీ తోటి రహస్యమొకటున్నదోయీ" అన్నపాట వ్యక్తికీ సమాజానికీ ఇద్దరికీ చెప్తూనే తన రహస్యాన్ని తనకు తాను చెప్పుకొనే వాడే నాకు ఆత్మీయుడైన కవి. సాహిత్య, సాంఘిక, సాంస్కృతిక వైయక్తిక రహస్యాల్ని ఓ వారం పదిరోజుల క్రితం నా కళ్లముట ఊ అదే పనిగా నీళ్లొచ్చేట్లుగా చెప్పిన మహారచన చేసినవాడు రాణి శివశంకర 'శర్మ' తండ్రి ప్రథమ శత్రువు. తల్లి ప్రథమ ప్రేయసి. ఇతరులకు చెందని జ్ఞానం, విజ్ఞానం, సంస్కారం విషవృక్ష ఫలాలు. చదువు ప్రథమ ప్రభుత్వం, నాకు నేనే ప్రేమికుడ్ని ద్వేషినీ, గమనాగమనం లోలాగా 'పింజారీ' లాగా మన అంతర్యాలేమిటో కన్నీళ్ల హ్యాంకీలతో తుడుచుకొనే దాకా మనం మానవ విలువల మూల్యాలు తెలుసుకోలేం. తండ్రిలానో తల్లిలానో మానవహక్కుల కోసమో, మానవత్వం కోసమో ఔన్నత్యం కోసమో ఏడ్చే, దుఃఖించే మహామానవుడు - ఆయన మన మామూలు కవిత్వ పరిభాషలో కవి కాకపోవచ్చు కానీ ఒక పక్క వృద్ధుడ్ని, యువకుడినీ, స్వాప్నికుడినీ, బాలుడినీ కరుణాంతరంగుడ్నీ- ఒకే ఒక్క కాళోజీలో నేను చూచాను....

కొంచెం నిమ్మళించుకొంటానింక.

**మాస్క్ చర్మంలోకి ఇంకి పోతుంది, "పచ్చి బాలింతరాలు స్మితా పాటిల్ చచ్చి పోయింది" ఇంకా ఇలాటి కొన్ని చోట్ల తేలిగ్గా అర్థమయ్యే మీరు అంతలోనే అందకుండా పోవడానికి కారణం?**

ఊరుకుందామన్నా ఊరుకోనివ్వని ప్రశ్న. ఏం చేస్తానిక. ఇందులో మా అమ్మ మరణరహస్యం ఇమిడిఉంది. స్మితాపాటిల్ పిచ్చిపిల్ల. అయోగ్యుడ్ని నమ్ముకొంది. తనకీ బిడ్డకీ నెమ్ము చేసింది.... ఇలాంటి వేవో కొన్ని విన్న విషయాలు. నేను అంటే ఈ 'మో' అనే కవి గురించి మీరందరికీ లేదా ఏ కొందరికో చెందినవాడిగా అడుగుతున్నారు కదా. కదలాకాదు. మా అమ్మ మస్తానమ్మకి నేను రెండో కుమారుడ్ని, నా తర్వాత ఇద్దరు కవలలు. ఆ తర్వాత నాకిద్దరు చెల్లెళ్లు. ఆ తర్వాత మళ్లీ మా అమ్మకి తమ్ముడో చెల్లెలో....! ఒద్దొనుకొంది, 1954, మార్చి 30, గర్భస్రావం... అప్పట్నించీ నాకు మాతృప్రేమ, పితృద్వేషం. అన్ని బతికిన క్షణాలలోనూ కన్పించే స్త్రీమూర్తి మా అమ్మే. మస్తానమ్మే. ఇకనప్పట్నించీ "స్త్రీ"ని ప్రేమించటమూ, ద్వేషించటమూ పైతృక స్థానంలో నన్ను అసహ్యించుకోవటమూ మొదలు పెట్టానన్నమాట. మునిగిపోయిన పక్షులంటేనూ ఎగిరిపోయిన చేపలంటేనూ నాకెంత ఇష్టమైన దృష్టి అన్నమాట. కీర్తిశేషులయిన సావిత్రి అన్నా, మీనాకుమారి అన్నా నాకు మా అమ్మ అంత ప్రేమ.

**నిజాతీత తాత్వికత అంటూనే అతి నిజమైన నిత్య నైమిత్తకాలతో సదా సహజీవనం చేయించడం వల్ల సహజత్వం పాలు తగ్గదా?**

సాల్వడార్ డాలీ స్వీయ చరిత్ర చదివినపుడు ఈ ప్రశ్న నాకు నేనే వేసుకొన్నాను. నేటివిటీతో బాటు నిత్యనైమిత్తికాలని జత కలపటంవల్ల సాధించేదేమిటని? డాలీ నేటివిటీ వేరు; మన నేటివిటీ వేరు. అర్బేనిటీ మనిషిని డీ హ్యూమనైజ్ చేస్తుంది. డీ ఫెమీలియర్ చేస్తుంది. 'ది అనాటమీ ఆఫ్ ది నావెల్' పుస్తకంలోని ఒక చర్చలో – క్లాస్ రూమ్‌లో ఒక విద్యార్థి అడిగిన ప్రశ్న ఏమిటంటే – "హౌజీట్ దట్‌నో హీరో ఇన్ ఎనీగ్రేట్ నావెల్ సీమ్స్ టుబి గోయింగ్ టుది లూ?" అని. దేవదాస్‌ని పెళ్ళి చేసుకొని ఉంటే పార్వతి అంట్లు తోముతుంటుందా ప్రతి ఉదయమూనని ఒక విమర్శకుడు ఆశ్చర్యపోయాడు. "గెర్నికా" చిత్రాన్ని మెచ్చుకొన్న వాళ్ళే అదే పికాసో వేసిన మరో చిత్రం – "ది ఉమెన్ యూరినేటింగ్"ని చూచేటప్పటికి ముఖం పక్కకి తిప్పుకుంటారు. మనిషంటే ఒకడు కాదు, వాడికి మూడు ముఖాలు అని మన ముఖం మీద కొట్టి చెప్పిన మహాద్భుత క్యూబిస్ట్ పికాసో. ఈ అన్నమయ, జీర్ణమయ కోశాల్నించి మనల్ని మనోమయ కోశాలకు ఉన్మత్తుల్ని చేసేదే సంగీత, చిత్ర శిల్ప కళా వైదగ్యాలు. పంచభూతాల స్వనాల్ని పట్టేసిన ఫ్లూట్, వయొలిన్, డ్రమ్స్, షహనాయ్, సితార్, క్లారినేట కసెట్స్‌ని వింటూ కూడా ఉభయ సంధ్యలూ వార్చొచ్చు కాస్తంత విస్కీ సిప్ చేస్తో. "మళ్ళీ పరుండేవు మసలుతూ ఉండేవు మారాము చాలింక లేరా" అని మళ్ళీ మరో ప్రత్యూష ఊహ నిదరలేపుతుంది.




**కవిత్వంలో వ్యక్తి వాదం, నిరాశా వాదం, కాల కృత్యాలు, కామకృత్యాల ప్రతీకలు అనేకసార్లు తొంగి చూడడంవల్ల ప్రయోజనం?**

కామకృత్యాలు తొంగి చూడటమనేది... సాహిత్యంలో సగభాగం. వాస్తవ ప్రపంచంలోని సమస్యలైన ఆర్థిక, సామాజిక, కౌటుంబికమైనవి. వీటికి రాజకీయాలను చేర్చి సోకాల్డ్ అభ్యుదయ, ప్రగతివాద విప్లవ కార్యాచరణ సోకాల్డ్ సాహిత్యతత్వవేత్తలు మానవుడికి మరొక సగభాగమైన మానసిక ప్రపంచమంటూ ఏదీ లేకుండానే చేసారో నలభై యాభై ఏళ్ళుగా, సాహిత్యానికి ఒక స్వయం ప్రతిపత్తి అంటూ ఏమీ మిగల్చనీకుండా తయారు చేశారు వాళ్ళు. ఈనాటి ప్రచార సాధనాలు అన్నీ కలగలిసి చేస్తున్న మూస ఆలోచనా ధోరణి కంటే సాహిత్యానికి ఎక్కువ హాని చేసింది. ఆ సోకాల్డ్ వామపక్ష మేధావులే. లిటరేచర్‌కీ సోషియాలజీ నడుమనున్న సూక్ష్మరేఖను చెరిపివేశారు. సాహిత్యానికీ మనస్తత్వజ్ఞానానికి ఉన్న సాన్నిహిత్యాన్ని ఛిద్రం చేశారు. వ్యక్తి (వ్యక్తివాదం!) అంటే వీళ్ళకున్న అంచనా అల్లా స్వీయ ఆలోచన నశించిన మందబుద్ధి, మందలో కలిసి పోలేని వాడూనని, వాడొట్టి నిరాశావాది అని, నామిని, ఖదీర్‌బాబు, గోపిని కరుణాకర్ అంత గొప్ప రచయితలవటానికి మూలకారణం – వాళ్ళ కారెక్టర్స్‌లోని వ్యక్తిత్వాలమూలాన్ని సృజించటమే.

**మిమ్మల్ని ప్రభావితం చేసిన వారు?**

ప్రభావితం చేయటమంటే నన్ను కూడా కథకుడిగా చేయటం. అలా జరగలేదు కానీ కథలు రాయటమంటే కవిత్వం రాయటమంత తేలిక కాదని తెలియజెప్పిన వాళ్ళు మన ప్రపంచానికి కొత్త ద్వారాలు తెరిచిన వాళ్ళు – పద్మరాజు, బుచ్చిబాబు, చింతాదీక్షితులు, శ్రీపాద, చాసో, తిలక్, రావిశాస్త్రి.... ఆర్డరిది కాదనుకోండి, ఈనాటి వాళ్ళలో మధురాంతకం మహేంద్ర, రాప్తాడు, అల్లం రాజయ్య, కేతు విశ్వనాథరెడ్డి, స్మైల్... వీలు చిక్కినపుడుల్లా మాండలికంలో రాసిన కథలు కూడా శ్రద్ధగా, బుద్ధిగా చదవటానికి ప్రయత్నం చేస్తున్నాను. మనిషిలోపలి మనిషిని చిత్రించే కథలంటే చాలా ఇష్టం (స్మైల్, త్రిపుర, అల్లం రాజయ్య, కాశీభొట్ల, డా.చంద్రశేఖర్, పతంజలి శాస్త్రి, తుమ్మేటి రఘోత్తమరెడ్డి) 'యజ్ఞం' మీద అంత యజ్ఞం చేశారు కానీ 'నోరూమ్' ఎంత గొప్ప కథ! అభిప్రాయ ప్రకటనలకి కవితలూ కథలుఎందుకు? వ్యాసాలు రాసుకోవచ్చుకదా. ఓల్గా తన పాత్రల్లో ఎందుకు అంతనోరు పెట్టి మాట్లాడుతుంది! పెద్దిభొట్ల మోరలైజ్ చేయటం మానుకోవాలిక. చలాన్ని ఎవరూ అనుకరించలేరు. ఆ అవసరమూ లేదిక.

**ఆరుద్ర త్వమేవాహం అర్థం కాలేదనే మాట సాధారణంగా వినిపించేది. అలాగే మీ కవిత్వంపైనా విమర్శలున్నాయి. మరి ఈ రెండింటి మధ్యా తేడాను మీరెలా చూస్తారు?**

పియానోకీ హార్మోనియంకీ తేడా తెలుసుకోకపోతే ఎట్లా? గొప్పగా పియానో వాయించే వాడినొక్కసారి చూడండి! వీపు వెనక్కు వాల్చుకొని కీ బోర్డు మీద చూడకుండానే గొప్ప నొక్కులు నొక్కుతాడు. నొటేషన్ కాగితాన్ని పదేపదే చూడడుకదా. తల వెనక్కి వాల్చుకొని కళ్ళు మూసుకొని అద్భుత సంగీత ప్రకంపనాల్ని అందిస్తోంటాడు. 'త్వమేవాహం' కావ్య రచనలో మనం మరచిపోయిన, తెలీని తెలుగు ఛందోరచనా విశేషాలున్నై. పైకి మాత్రం వచన కవిత్వంలా కన్పిస్తూనే ఆరుద్ర 'కవిహృదయం' అంటూ దాశరథికి ఓ లేఖ రాయటం... ఇదంతా చరిత్రే. అందులో భాగమే ఈ ముప్పయ్ ఏళ్ళుగా మోహనప్రసాద్ కవిత్వం అర్థం కాదనటమూనూ.

**శైలీక్లిష్టత, భావ క్లిష్టత, తాత్విక క్లిష్టత వీటి మధ్య కూడా కవిత్వం అందేలా చూడాలంటే ఏం చేయాలి?**

**శైలి క్లిష్టత :** 'శైలి' అనే పదం ఒక్క కవిత్వ రచనకే కాదు. అన్ని రకాల రచనలకీ ఉంటుంది. అన్ని వీలునామాలు ఒక శైలిలోనే రాయబడతాయే. కరణంగారి 'శైలి' దాని ప్రత్యేకత దానితే. శాస్త్రీయ పరిశోధనలలో చేసే ప్రయోగఫలితాలు, ప్రేమలేఖలోని రచనాశైలి, ప్రేమని వ్యక్తం చేసేప్పటి మౌఖిక పదాలూ, తత్వాలలోని పాడుకొనే శైలీ, ప్రకృతి వర్ణన చేసేప్పుడూ, పండగ పబ్బాలపై రాసే చదివే పద్యాలలోని శైలీ, మన వచన కవులు అనవసరంగా ఒక పంక్తిని పునఃపఠించే శైలీ ఇవన్నీ రకరకాలు. ద్రాక్షాపాకం, నారికేళపాకం లాంటి అరిగిపోయిన పదాలెటూ ఉన్నయ్. స్టైల్ ఈజ్ మాన్ అన్నారు కదా. శైలి – భాషని బట్టీ, ప్రాంతీయతని బట్టీ, యాసనిబట్టీ – మరీ ముఖ్యంగా మనసుని బట్టీ వుంటుంది. స్టైల్ ఈజ్ మైండ్ అనడం మంచిదేమో. శైలి గురించి చెప్పాల్సింది భాషా శాస్త్రవేత్తలు. మార్క్సిస్టు, ఫెమినిస్ట్, స్ట్రక్చరిస్టులు వాళ్ళవాళ్ళ పరిభాషను వాడ్తారు. శైలి విషయంలో కొండగుర్తులుగా కొన్ని పదాల్నిస్తాను. అవి – కోహెషన్, కాలొకేషన్, సెమాంటిక్ ట్రాన్సిషన్, ట్రాన్సిటివిటీ, అండర్ లెక్సికలైజేషన్ లాంటివి. 'గీతాంజలి'కి వచ్చిన అనువాదాల్ని పోల్చి చూస్తే శైలీ భేదాలు కన్పిస్తాయే.

**భాష / భావక్లిష్టత :** "ఎదియు అర్థమ్ముకాని రక్తి స్ఫురియించు భావ గీతమ్ములని" అని కవి స్వయంగా చెప్పుకొన్నది తన భాష గురించి కాదు. రొమాంటిసిజం అనేది మనకు ఇప్పటికీ అవగాహనకీ అర్థానికీ అందని స్థితి గురించి ఇపుడయితే ఆధునికత్వం నుండి అత్యాధునికత్వానికి వెళ్తున్నప్పుడు కూడా అదే క్లిష్టత ఎదురవుతుంది.

**తాత్విక క్లిష్టత** : ఇదీ కవిత్వ విషయంలో తత్వశాస్త్రానికి సంబంధించిన విషయంకాదు. అలవాటయిన పదబంధాల్ని ఆలోచనలను తెంచటం, తుంచటం, "విశ్వనాథ సత్యనారాయణగారు ఓ మంచి శుక్రవారం ఎర్రశాలువా కప్పుకొని...." అన్నప్పుడు గుడ్‌ఫ్రైడే, రెడ్ శెల్యూట్ వెంటనే తట్టవు. ఆడెన్ ఒక కవితలో – ప్రస్తుతం తల దాచుకొంటున్న కమ్యూనిస్టుల గురించి చెప్తూ, వాళ్ళు వైటింగ్ పేషెంట్లీ అనే బదులు వైటింగ్ ఎక్స్‌పెన్స్‌వ్‌లీ ఎక్స్‌పెక్టింగ్ మిరకల్స్ టు హాపెన్ అంటాడు. ఓ నగరంలో కూచున్నారని రాస్తాడు. మామూలుగా అయితే 'వైటింగ్ పేషెంట్లీ అని రాయాలి కదా. 'సీతమ్మా చెప్పవే' అంటూ రామదాసు. "రాములవారు నాపై చలమూ చేసినారూ" అంటూ వాపోతాడు. సందర్భాన్నిబట్టి 'చలమూ' అనే మాటకి అర్థం నినాదంగా ఇంకుతుంది మనలో. తంత్ర కవితను అర్థం చేసుకోవటం నిషిద్ధం. మంత్ర కవిత మనల్ని లీనాలీన స్థితిలో ఉంచుతుంది. తత్వాలు నిదానంగా మనలోకి ఇంకుతాయే. అర్థం చేసుకోవటం అంటే ఒక వస్తువుని వినియోగంలోకి తెచ్చుకోవటమన్నమాట. A poet communicates before it is understood అని అన్నారు ఆధునిక కవితా 'గురువులు' a moon slowly released by the boughts" (మక్లీష్)

**కవితా గుణ స్పృహ పెరగడానికి ఏం చేయాలంటారు?**

గుణ స్పృహ పెరగాలంటే మనకు పూర్వం (కనీసం ఓ వంద సంవత్సరాలయినా) నుండీ నిలబడిన మంచి కథనాలు మనకు తెలిసినన్ని భాషల్లో అధ్యయన శీలంతోనూ అనుభవసారంతోనూ పఠించాలి. పైకి (లోలోపల కాక) చదువుకుంటూ పోవాలి. అపుడు శబ్ద సౌందర్యం కొంచెం తెలుస్తుంది. సంగీతం వింటున్నప్పటిలా. ఏమీ చదవొద్దని చెప్పి ఆధునికులకు ద్రోహం చేసిన కవి కుందుర్తి. సామాజిక వాదాలతో ఆగిపోకుండా ఆ వాదాల వేదనలతో రాసిన కవితల్ని మననం చేసుకోవాలి. నిజమైన ఆర్తి ఉన్న గీతమేదో కానిదేదో స్పష్టమవుతుంది. కవి "ఎంత గొప్పగా రాసాను" అని పొంగిపోతే అది అతన్నించి తన్నుకొచ్చిన కవిత కాదనే. ఆర్ట్ లేని(క్రాఫ్ట్' అది సామాజిక వాదులతో రాయబడే. రాయించబడే కవితల్లో ఇదే లోపం. ఇక నా తర్వాత కీర్తి! తృప్తినివ్వని కీర్తి!! ఆ కీర్తి కోసం ఇతర్ల వెంటబడటం!!!

**వైయక్తిక వ్యక్తీకరణల నిగూఢ శైలిని సామాజిక అంశాలకు ఆటోమాటిగ్గా అన్వయించడంవల్ల ప్రయోజనం?**

ఇదికూడా, ఆర్ట్ క్రాఫ్ట్‌ల మధ్య జరిగే గొడవే. అటూ ఇటూ రెండు వైపులా నుంచీ కీర్తి రావాలనే. అరువు తెచ్చుకున్న ఆవేశంతో, తనది కాని అనుభవంతో సామాజిక సమస్యలపైన తత్క్షణం ప్రతిస్పందిస్తేనేకానీ పేరు నిలవదేమోననే ఆరాటం. కవిత్వం భవిష్యత్తుకోసం వర్తమానంలో రాసే ప్రక్రియ. సమస్యకి పరిష్కారం దొరికిందా ఇక ఆ కవి చేతులు ఖాళీ అయిపోతాయి. ఇక వాడే కొత్త సమస్యల్ని లేనివాటిని తీరిగ్గా కూచుని సృష్టిస్తాడు. అలాంటి వాడి కవిత ఒక devils workshop. A wrong man in a paradise. రాజ్యాన్ని తిడ్తూనే, రాజ్యంలో భాగంగా ఉంటూనే, వాటి ఫలాల్ని అనుభవిస్తూనే తానుగా అందరికన్నా మించిన రాజ్యాధికారాన్ని హస్తగతం చేసుకోవాలనే ప్రయత్నమిది. వాళ్ళే కెరీరిస్టుకవులు, రచయితలు. ఈ విషయంలోనే దళితవాద స్త్రీవాద కవులు, రచయిత్రులపై నా అసంతృప్తి.

**అభ్యుదయ కవిత్వం నుంచి నేటి వివిధ వాదాల వరకు మీరెలా చూస్తారు? వాటి నుంచి దూరంగా వున్నారనొచ్చా?**

అవును, నేను ఎడంగా ఉన్నాను. దూరంగా కాదు. వీధిలో ప్రొసెషన్ వెళ్తోంటే దారిపక్కన నొంచొని చూస్తుంటామే అలాగ. శతృత్వంతోకాదు. అందాకా ఎందుకు? walk for books అని రన్ ఫర్ బుక్స్ అని మనతో కొందరు పరుగులు తీయిస్తారే, రచయితల్నే

పరుగులు తీయిస్తారు కొందరు పబ్లిషర్స్,కొన్ని బుక్‌షాపు వాళ్ళు - రచయితల్ని ఎక్కువగా అవమానించేది వాళ్ళే. అలాగే కొన్ని ఉద్యమాలూ వాటి నాయకులూనూ, చివరికి మనని ఫూల్ చేస్తారు. అభ్యుదయ, విప్లవ, కవిత్వ రచనలకంటే వాటి వచన రచనలే (కథలూ, నవలలూ) ఇప్పటికీ విశ్వసనీయంగా నిలిచాయనుకొంటాను. వాటిల్లో నిజమైన జీవితచిత్రణ ఉంది. ఈనాటికీ అవేక్లాసిక్స్‌గా నిలిచాయనుకొంటాను. ప్రజానాట్యమండలి వాళ్ళ నాటకాలు కవిత్వం కంటే ప్రజల్ని ఎక్కువ ప్రభావితం చేసినాయేమో. ఆనాటి నాజర్, ఈనాటి గద్దర్ గొప్ప పర్ఫార్మింగ్ ఆర్ట్‌తో ప్రజల్ని ఉర్రూతలూగించారు. వచన రచనలే ఆలోచనని పెంచినయ్. కవిత్వపు ఆవేశం తాత్కాలికాలై పోయినవేమో.

**తాత్విక ప్రగాఢత లేకుండా మీ శైలీ క్లిష్టతను మాత్రం అనుకరించాలని ప్రయత్నించే వారిపై మీ కామెంట్?**

'తాత్విక ప్రగాఢత' అనే గొప్ప కితాబు నాకు నేనిచ్చుకోలేను. నన్నే కవీ అనుకరించినట్లు నేననుకోవటం లేదు. మహాఅయితే వెక్కిరిస్తూ పారడీలు రాసారు. వాటిని చూచి ఎంజాయ్ చేశాను. 'తెలుగు కవిత్వంపై నా ప్రభావం' కూడా ప్రత్యక్షంగా ఉందనీ నేను చెప్పుకోలేను. కాకపోతే డిఫరెంట్‌గా రాయటం అనేది మాత్రం స్పష్టంగా కన్పిస్తోంది. Variety is the spice of poetry కదా. ఒకటి మాత్రం నిజం. నన్ను కూడా తమ కవితల్తో ఆశ్చర్యంలో ముంచగలిగిన కవులు సీతారాం, పసుపులేటి పూర్ణచంద్రరావు (ఈయన కవిత్వం ఇంకా పుస్తకంగా రాలేదు). జగన్‌రెడ్డి, జల్‌జలాలోని కవులూ, నామాడి శ్రీధర్, పసునూరి శ్రీధర్‌బాబు, ఎం.ఎస్. నాయుడు, గోరటి ఎంకన్న, ఇంకా తెలంగానం చేస్తున్న కొందరు. ఎవరి గొంతులు వారివే అలా ఉండాలి. అలానే ఉండాలి. ముఖ్యంగా హైకూ కవులు. ఎక్కడ్నించి వస్తోన్నాయే వాళ్ళకీ విచిత్రపుటూహలు (టివివి ప్రసాద్, గాలి) అని నా ఆశ్చర్యం!




**నేటివిటీ గురించి అంతగా రాసిన మీరు నేడు దేశీయ సంస్కృతులను ధ్వంసం చేస్తున్న గ్లోబలైజేషన్‌ను ఎలా చూస్తారు?**

గ్లోబలైజేషన్ అని గగ్గోలు పెడ్తున్న మనమే ఆ దారిలో వచ్చే మొట్టమొదటి అవకాశాన్ని అందరికంటే ముందుగా చేజిక్కించుకోవాలని ప్రయత్నం చేస్తున్నాం. కవులలో ఈ 'డబుల్‌టాక్' ఒక్క ప్రపంచీకరణ అనే అంశంలోనే గాక పితృస్వామిక, కౌటుంబిక, వర్ణ, మహిళా వ్యవస్థలు విషయాల్లోనూ విన్పిస్తోంది. గ్రామాలు విడిచి పెట్టడం, మూలాల్ని మరచిపోయినట్లు నటించటం, తమ తమ కులాలకే దూరంగా జరిగిపోవటం, పిల్లల చదువుల విషయంలోనూ అమెరికాపై చూపు నిగిడ్చటం, వీలయితే అక్కడికే చివరి దశలోనైనా చేరుకోవటం, వీలయినంత కట్నాల్ని ఎక్కువగా గుంజుకోవడం - ఇవన్నీ మైకుల్లో వీరావేశాల్ని వెలిగక్కే వాళ్ళ oratorial ప్రతిభే.

దేశీయ సంస్కృతి అంటున్నారు మీరు! అది బ్రాహ్మణీయ, అగ్రకుల ఆధిపత్య సంస్కృతి అనే గదా మీరు దాన్ని ధ్వంసం చేయాలనేది! అలాంటి సంస్కృతి నిజంగానే ధ్వంసమవుతుంటే ప్రపంచీకరణను తప్పకుండా ఆహ్వానించాల్సిందే. ప్రపంచీకరణ అనే పదంలో నిగూఢంగా దాక్కొన్న మీ అభ్యంతరమల్లా రాజకీయ వ్యవస్థపైనేనని నా అనుమానం. ముందు మనమందరం ఈ టాల్‌టాక్‌ని కట్టిపెట్టి - మన వీధిలో మన కార్పొరేటర్ పరిధిలో, మనకు సంబంధించిన ప్రభుత్వ కార్యాలయాల్లో మన పనులు లంచాలిస్తేగానీ అవనితనం ఎందుకుందో, కరప్షన్‌లోని ట్రాన్సురెన్సీని మనం ఎందుకు ఎదుర్కోవటం లేదో ఆత్మశోధన చేసుకోవాలి. ప్రెసిడెంట్ ఆఫ్ ఇండియాని విమర్శించగలం పోలీస్ కానిస్టేబుల్‌ని పల్లెత్తు మాటనలేం. నిజజీవితంలో లంచాల్వికుండా ఏ ఒక్క పనినైనా చేయించుకోగలిగిన ఒక్క కవీ నాకింతవరకూ కనపడలేదు. అలాగే వివిధ వృత్తులకు సంబంధించిన వివిధ యూనియన్ల నాయకులు! మంది మీదపెట్టి వాళ్ళసొంత పనులు చేయించుకొంటారు. వాళ్ళందరూ ప్రగతివాదులే. పోరాటశీలురే పైకి! ఎన్‌జిఓలు నడుపుతున్నవాళ్ళు... ఆహా ఏమి స్వీయసేవ! ఎంత స్వయం తృప్తి!!

**మీ కవిత్వంపై వచ్చిన విమర్శలలో మీకు నచ్చినవి, మిమ్మల్ని మార్చినవి ఏవైనా వున్నాయా?**

విమర్శలు, వ్యాఖ్యలకు నేనెప్పుడూ వ్యతిరేకంగా స్పందించలేదు. ఆ పని నేనూ చేస్తున్నాను కదా. అచ్చులో కూడా. పదవిలో ఉన్నకవి, రాజభవనంలో ఉన్న కవీ నన్ను భయపెట్టలేరు. నాదెపుడూ నిజంగా బాధపడిన కవిపక్షమే. ప్రసిద్ధి అనేది స్వయం సిద్ధంగా వస్తే బాగుంటుంది. సహజంగా ఉంటుంది. లేకపోతే చాటునైనా వీపు వెనుకనైనా నవ్వుకొంటారు. నా రచనా విధానం కొంతలో కొంతయినా మంచికైనా చెడుకైనా మారిందని నమ్మకం కలుగుతుంది. అది చెప్పాల్సింది అధ్యయన శీలురైన విమర్శకులే.

**సంక్లిష్టమవుతున్న సామాజిక పరిస్థితులతో కవిత్వం భవిష్యత్తు ఎలా వుంటుందనుకుంటున్నారు?**

వచన కవిత్వం ఇప్పటికే రాసిరాసి అరిగిపోయింది. శైలీభేదాలు లేకపోవటం ఒక కారణం. కవిత్వం రూపంగా కాదుగానీ, సారంగా మాత్రం మునుముందు గేయాలలోనూ గీతాలలోనూ కథలలోనూ నవలల్లోనూ దాక్కుంటుంది. ప్రస్తుతానికి ప్రచార సాధనాలే పైచేయి. ఈ రోజైనా - వార్తపత్రిక చదవటంలో గడిపినంత కాలం, మతిలేని టి.వీ. సీరియల్‌ని చూడటంలో గడిపినంత కాలం మనం ఒక్క కవితను చదవటానికి వెచ్చించలేకపోతే కవులు రాసినా వాళ్ళకు పాఠకులు ఉండరిక.

**మతం మీద విశ్వాసం మీద సాముదాయిక హత్యలు జరగాలి అన్నారు కదా. నేటి మతతత్వ ధోరణులను ఎలా చూస్తారు?**

నిజమే. ఎవడి మతం మీద వాడికిపుడు పిచ్చి ముదిరిపోయింది. కార్యకారణాలతో సంబంధంలేని సాముదాయక హత్య. ఆత్మహత్యల కల్చర్ పెరిగిపోతూంది. ఉదాహరణకి విజయవాడ బిసెంట్ రోడ్ సెంటర్‌లో ఆ బహిరంగ పూజలేమిటి? శ్రీ రామనవమి అయితే సరే, అదేదో ఇంట్లోనే ఎందుకు చేసుకోగూడదు. మామూలు రోజుల్లో ట్రాఫిక్ పోలీసులు అందర్నీ తంతారుకదా. మరారోజు జిల్లా అధికారులు వారి సతీమణులు అక్కడ రోడ్డు మీద కుర్చీలేసుకు కూచోడమేమిటి? ప్రార్థనలకు – అదే మతమైనా పబ్లిక్ మైక్‌లెందుకు? ఎంత శబ్దకాలుష్యం? ప్రార్థనా మందిరాలన్నిటినీ బహిరంగ స్థలాల్నించి రాత్రికి రాత్రే తొలగించితే తప్పితే ఎవడి గుడిని ఎవడి మడినిఎవడి దడిని వారు ఇంట్లోనే పెట్టుకోమంటే తప్పించే మనకింకా "ట్రైన్ టు పాకిస్థాన్"లూ, "తమస్"లు రావల్సే ఉంటాయి. కార్పొరేట్ ప్రార్థనాలయాలు (ఎన్ఆర్ఐ మహానుభావుల పుణ్యం ఇవన్నీ) కార్పొరేట్ కాలేజ్‌లు, కార్పొరేట్ హాస్పిటల్స్ అన్నీ ఉన్నప్పుడు కార్పొరేట్ ప్రభుత్వాలు, సిఇఓలూ అన్నీ ఉన్నప్పుడు కార్పొరేట్ ప్రభుత్వాలు, సిఇఓలూ తప్పవు కదా తప్పవు.

**పోస్టు మాడ్రనిజం, డికన్‌స్ట్రక్షన్, క్షణికం, శాశ్వతం ఇవన్నీ ఎలా ఇముడుతాయి?**

ఈ ప్రశ్న. దానికి జవాబులూ అఫ్సర్, తిరుపతిరావు, వేణుగోపాల్, గూడ శ్రీరాములు, ఫణి – పత్రికలు మిసిమి, అరుణతార, ప్రజాసాహితి తెలుగు అకాడమీ తెలుగుల్లో విన్పిస్తున్నాయి లేదా కన్పిస్తున్నాయి. కదా అలా కొన్నాళ్ళు సాగనివ్వండి. ఆ తర్వాత ఈ రెండింటినీ తెలుగు కవిత్వానికీ,కథకూ, నవలకీ అన్వయించే క్రమం కూడా సాధ్యమవుతుందని నేనాశిస్తున్నాను. మౌలికమైన ఈ అత్యాధునిక భావజాలాన్ని అప్పుడే రాజకీయం (లెఫ్టిస్టు) చేయకుండా అంతే చాలు. వెస్ట్‌లో పోస్ట్ మాడర్నిజం గతించినవాదంగా చెప్తున్నారు. మనమెంత లేదన్నా ఓ మూడు దశాబ్దాలు ఆలస్యంగా మేల్కొంటాం కదా. గతించిన వాదమన్న కమ్యూనిజం గురించి కూడా! అత్యాధునికత కేవలం సాహిత్యాంశం కాదు. వినిర్మాణ వాదం అవును. అత్యాధునికత సాహిత్యం–సాంఘికం, వ్యక్తి – సమూహ ప్రవర్తన వర్తనలకి సంబంధించిన అంశం. వినిర్మాణవాదం భాషకీ, భావనకీ (అంటే మౌఖికమూ, లిఖిత రూపము రెండూ కూడా) రెండింటికి సంబంధించిన అంశం ఫాల్‌స్టాప్ మాటిమాటికీ వాడి బీరు పొట్టకి "మై ఊంబ్, మై ఊంబ్" అంటాడు 400 ఏళ్ళక్రితం. ఇప్పుడు ఆ 'కడుపు'ని స్త్రీ పరంగా ఏ మాటతో వినిర్మాణం చేద్దాం?

**శ్రీశ్రీ రసన మీ రస రాహిత్యం వీటిలో ఏది నిజం?**

శ్రీశ్రీ అన్న 'రసన'కి పొడిగింపు వ్యంగ్యంలోనూ కన్పిస్తుందని చలసాని ప్రసాదరావు రుజువు చేశారు. 'రససాహిత్యం' అస్తిత్వ వాదంలోని ఒక అంశం. 'రసరాహిత్యం'తోనే అద్భుతమైన రచనలు చేయొచ్చని నిరూపించిన వారు అల్బర్ట్ కమ్యూ, సార్త్రే, మన శ్రీశ్రీయే మళ్ళీ తెలుగులో దానికెక్కడా అద్యుడు. 'సంస్కార' సినిమాలో ఉన్న రసరాహిత్యం మానవ అవస్థకూ మూలాలు ఏ వేదాల్లోనూ, ఏ అపౌరుషేయాల్లోనూ దొరకవని మనకెపుడో తెలిసిపోయింది. మీరంటూన్న గ్లోబలైజేషన్‌వల్ల మళ్ళీ అదే అవస్థ ఎదురవుతుంది. సైనికదళాలూ, పోలీసులూ, కోర్టులూ, విద్యాసంస్థలూ, ప్రార్థనాలయాలూ విధి నిషేధాల్ని చెప్పినప్పుడల్లా ప్రభుత్వం, దాని అంతః స్వరూపమైన రాజ్యం మనల్ని రసరాహిత్యంలోకీ ప్రేమరాహిత్యంలోకీ నెట్టేస్తాయి. సృజనశీలమయిన సాహిత్యం, కళలు, స్వేచ్ఛాభావాలూ తిరిగి రక్షించడానికి ప్రయత్నిస్తాయి.

**గ్లోబలైజేషన్ వల్ల దేశీయ సంస్కృతిలోని ఆరోగ్యకరమైన అంశాలు కూడా నాశనమవటం లేదా?**

అవును. ఖచ్చితంగా అవును. అయితే ఈ నాశనమవటం అనేది గత పదేళ్ళు కాదు. అంతకుముందే మొదలయింది. సామ్యవాదం అనే ఒక వెల్లువ వచ్చి వ్యక్తికి స్వీయ వ్యక్తిత్వాన్ని కాల రాసినపుడే వచ్చింది. దైవభక్తి మూఢత్వమే.కాని భక్తి సంగీతంలోని కళ,క్లాసికల్ మ్యూజిక్ అగ్రవర్ణ కళ అని తిరస్కరిస్తున్నాం. దేవాలయాల మీద శిల్పకళని కూల్చేసుకున్నాం. దేవాలయాల్ని కట్టిన వాళ్ళు అగ్రవర్ణాల వారు కారే! హస్తకళలన్నీ నిజానికి శ్రామిక వర్గం వాళ్ళవే. ఇదొక పెద్ద కాంట్రడిక్షన్. గతంలో ఎన్నడూ లేనంతా మళ్ళీ ఈనాడు స్వాముల వార్లు ఊరికొకరు వెలుస్తున్నారు. గజ్జల మల్లారెడ్డి, అన్న 'భక్తిరసం' డ్రైనేజీ పొంగి పొరలి మనందర్నీ ముంచెత్తుతోంది.

ఓల్డేజ్ హోమ్స్ దేశీయమైన సంస్కృతికి చిహ్నామా? న్యూక్లియర్ కుటుంబాలు దేనికి చిహ్నం? పనికిరాని వినియోగ వస్తుక్రయ విక్రయ సంస్కృతి ఆరోగ్యకరమైన అంశమా? సామ్యవాదం మరి వీటిని ఎందుకు అడ్డుకోలేకపోయింది? దాని వైఫల్యమే గ్లోబలైజేషన్‌కి మూలం.

**విమర్శలన్నీ లెఫ్ట్‌పైనే ఉన్నాయి మరి కన్జర్వేటివ్‌లు,సినిమాలు, చిత్రకళలపై చేస్తున్న దాడులు చేస్తున్నారు కదా?**

అవునండీ! 'ఫైర్' లాంటి సినిమాలు కదా! నిజంగా చూడాల్సిన సినిమాలని వీళ్ళు చూడనివ్వరు. 'సరస్వతి' చిత్రం కదా! వీళ్ళు ఎంత నీచమైన కాలెండర్ ఆర్ట్‌నయినా సహిస్తారు కాని కళాకారుడి సృజనత్వాన్ని బతకనివ్వరు,. కన్జర్వేటివ్‌లు హిందూత్వ వాదులొక్కరేకాదు. కమ్యూనిస్టుల్లోనూ ఉన్నారా లేరా? వాళ్ళనించి తప్పుకోవటానికే ఆదూర్ గోపాలకృష్ణన్ 'ముఖామణం' తోడు 'గజగామిని'లో కాళిదాస మహాకవి సైకిల్ తొక్కుకుంటూ వస్తాడు. గొప్ప యానక్రానిస్టుగా మానస్ పేపర్ చదువుతాడో రోమన్ కాథలిక్ సంస్కృతి ఒక ఇన్స్టిట్యూషన్‌గా అవసరం లేదు కాని సెర బేసిలికాలోని శిల్ప చిత్ర కళల ఔన్నత్యాన్ని నిర్మూలం చేసుకొందామా? కళల్ని ప్రజాస్వామికం చేయటం అంటే కళల్ని ఎప్పటికప్పుడు కొత్త రూపాలని మార్చటమే కాని మొత్తంగా భక్తి సంగీతాన్ని మొత్తంగా శృంగార చిత్రకళని మొత్తంగా హస్తకళని నాశనం చేయటం కాదు.సచ్చిదానంద్ అంటున్నాడు. "Language carries the traces of its earlier uses… associations, memories, aspirations, sufferings, archetypal encrustations and mythological fossils…"

**(ఇంటర్వ్యూ: తె.ర)**

## నా ఉత్తరమా ! ఎక్కడికి పోయావు



- జంధ్యాల రఘుబాబు

ఉత్తరమా
నా ఉత్తరమా
ఎక్కడికెళ్ళావు నన్నొదిలి
సెల్లు సంభాషణలు
ఈ-మెయిల్సు
ఇరవై నాలుగ్గంటల వార్తలు
ఇవన్నీ నిన్నే కాదు
నన్నూ మింగేస్తున్నాయి

నేనెంతో ఆప్యాయంగా
దాచిన పాత ఉత్తరాల్ని
నేటితరం 'శిలాజాల్లా' చూస్తున్నారు
అమ్మ ఒడిలో ఎలా ఉండేవాణ్ణో
చిన్న ఊయలలో ఎలా ఊగానో
ఇంట్లో నన్నెలా ముద్దుచేశారో
నేనెరుగను

కానీ
రాసిందెవరైనా కావచ్చు
నీకై చూసిన ఎదురుచూపుల్లో
ఎన్ని ఆనందాలో ఎన్నెన్ని అనుభూతులో
నీవు రాకముందే, ఊహించి
నేను రాసుకున్న 'రిప్లై' గురించి
ఏమని చెప్పను?

ఈ తరానికి నువ్వు మరణించావని
చెప్పనా
తిరిగొస్తావని చెప్పనా!
సాంకేతికంగా ఎంతో దగ్గరైన
ఈ గోళమనే పల్లెలో
పక్క మనిషికి నాకు ఎంత దూరం!
ఎక్కడెక్కడి వారినో కలిపిన
ఒకప్పటి నా ఉత్తరమా
నన్నొదిలి ఎక్కడికెళ్ళావు
నీకై ఎదురుచూపులు చూడనా
చివరి చూపుకు నోచనా!

ముందుకు నడుస్తున్నామనుకుంటూ
వెనక్కు పరిగెడుతున్న ఈ ఆధునికతలో
అనుభూతులకూ ఆప్యాయతలకూ
ఉత్తరమే ఒకప్పుడు
'కేరాఫ్‌అడ్రస్సని'
చెప్పాలనిపించి....

---

## ఏకాంతం గెలుస్తుంది

- మల్లారెడ్డి మురళీమోహన్



ఉదయపు వెలుగు రేకల ఆగమనంతో
రాత్రి నిర్మించుకున్న ఏకాంతం
చీకటితో చెట్టా పట్టాలేసుకు కరిగిపోతుంది.

మనసు చుట్టూ రాపిడికి
ఊహలన్నీ చచ్చిపోయి
శూన్యం మనసులో ఊపిరి పోసుకున్నప్పుడు
'ఏకాంతం' మానసికమే అవుతుంది.

మళ్ళీ సాయంత్రం కనుమరుగవుతూనే
'నాలుగు కాళ్ళ'పై నడుం వాల్చి,
దోమతెర దించడంతో
మొదలవుతుంది 'స్వప్న విలాపం'.

కీచురాళ్ళ సంభాషణలు,
పైన తిరిగే పంకా శబ్దం,
దిండు ప్రక్కనే పుస్తకం పేజీల రెపరెపలు,
చిరుగాలుల చిద్విలాసం,
అప్పుడప్పుడూ పెనుగాలుల వికటాట్టహాసం...
వీటన్నిటి నడుమ, భౌతికమే అయిన 'ఏకాంతం'
తన అస్తిత్వం కోసం పోరాడుతుంది.

తోటమాలిని చూసి చెట్టుదిగి పారిపోయే
ఆకతాయి గుంపు మాదిరిగా,
నిద్ర రావడంతోనే శబ్దాలన్నీ దూరమైతే
మళ్ళీ 'ఏకాంతం' గెలుస్తుంది

---



## ఆనందోత్సాహం

- మంచికంటి

చిగురుటాకంత స్నేహం కోసం
చినుకు రాలినంత ఆప్యాయత కోసం
పువ్వు పుష్పించినంత వసంతం కోసం
గాలి సవ్వడంత ఆనందం కోసం
మరుమల్లెలు సువాసనంత మధురిమ కోసం
పుప్పొడి చప్పుడంత నిశ్శబ్దంతో
కలువల కళ్ళు విప్పార్చుకుని

ఆకాశంలో మబ్బుల్ని
అవి వర్షించే వానల ధారల్నీ

రెప్ప వాల్చకుండా
వొచ్చే చిరుజల్లుల వెన్నెల తెచ్చే
ఒక ఆత్మీయత కోసం
ఇంకో ఆత్మ ఆర్ద్రంగా ఆప్యాయంగా
కళ్ళు కాయలు కాచేలా
చూపుల అగాధాల నుండి
ఎదురు చూస్తూ చూస్తూ ఉండడం
ఎంత ఆనందోత్సాహమో!

## ఆధునిక ఇటలీ కవులు

**- సౌభాగ్య**



# యూజినియో మోంటేల్

**యూ**జినియో మోంటేల్ ఇటలీలోని ఉత్తర సముద్ర తీర ప్రాంతంలో జన్మించాడు. తండ్రి వ్యాపారస్తుడు. సముద్ర తీర ప్రకృతి సౌందర్యం జీవితమంతా మోంటేల్ హృదయంలో ముద్రించుకుపోయింది.

1917లో మొదటి ప్రపంచయుద్ధం జరిగేటప్పుడు సైన్యంలో చేరాల్సి వచ్చింది. యుద్ధం ముగిశాకా 'ఒపేరా' గాయకుడు కావాలనుకున్నాడు. ఆ కోరిక తీరలేదు. కవితలు రాయడం మొదలుపెట్టాడు. క్రమక్రమంగా అతని పేరు సాహిత్య లోకంలో ప్రచారానికి వచ్చింది.

1927లో ఫ్లోరెన్స్ చేరాడు. మొదట ఒక పబ్లిషింగ్ సంస్థ కోసం కొన్ని పనులు చేసి పెట్టాడు. ఆ సంవత్సరమే గ్రంథాలయ శాఖలో డైరెక్టరుగా నియమింపబడ్డాడు.

ఆయన ఫ్లోరెన్స్‌లో వున్న ఇరవయ్యేళ్ళు ఆయన సాంస్కృతికపరంగా, సాహిత్యపరంగా ఎదగడానికి దోహదం చేశాయి. ఆయన 'అలీన విధానం' ఫాసిస్టుల అనుమానానికి దారితీసింది. ఫలితంగా ఆయన చేస్తున్న ఉద్యోగాన్ని వదులుకోవలసి వచ్చింది.

యుద్ధ కాలంలో అనువాద రంగంలో విశేష కృషి చేశాడు. యుద్ధానంతరం జర్నలిజంలోకి అడుగుపెట్టాడు. మిలాన్ చేరి ఒక పత్రికలో చాలాకాలం ఒక రెగ్యులర్ కాలం నిర్వహించారు. భార్య అనారోగ్యంతో ఆసుపత్రిలో వుంటే వాటర్ కలర్ చిత్ర రచనలో నిమగ్నమయి శ్రమించారు. యూరప్, మధ్య ఆసియాల్లో విస్తృతంగా పర్యటించాడు. యుద్ధానంతరం తన రచనలతో ప్రపంచ ప్రసిద్ధి పొందాడు.

1963లో భార్య మరణంతో తీవ్ర నిరాశకు గురయ్యాడు. పార్లమెంట్‌లో జీవిత కాల సభ్యుడిగా నియమింపబడ్డాడు.

మోంటేల్ ఇంగ్లీషు కవిత్వాన్ని గాఢంగా అధ్యయనం చేసి అనువదించాడు. ఆధునిక సాంస్కృతిక, పత్రికా రంగాలపై ప్రామాణికమైన విమర్శనా గ్రంథాలు రాశాడు. 1975లో నోబెల్ అవార్డు అందుకున్నాడు.

కవిత్వానికి సంబంధించి, జీవితానికి సంబంధించి ఆయనకు కచ్చితమైన అభిప్రాయాలున్నాయి. "మననుంచి దూరమై, మనల్ని వదిలి వెళ్ళిపోతున్న జీవితానికి ఒక అర్థముంది, పరమార్థముంది. వెనక్కి తిరిగి చూసుకోని కవి జీవితంలో ఏమీ మిగుల్చుకోలేడు" అన్నాడు.

కళ గురించి చెబుతూ "కళ, తను నివసిస్తున్న కాలాన్ని ప్రతిఫలించే కళ ఆ కాలం నుంచి తప్పించుకోలేకపోతే ప్రాణం లేనిదవుతుంది" అంటాడు. కవి గురించి చెబుతూ "కవి ఒక సత్యాన్ని తెలుసుకోవాలి. మనిషిని మరో మనిషితో కలిపే మౌలికత గురించి ఆ సత్యం చెప్పాలి. వ్యతిరేక అక్షరాలతో సహా వివరిస్తూ మనిషి ప్రత్యేక వ్యక్తిత్వాన్ని ప్రతిఫలించాలి" అంటాడు.

1925లో 'కటిల్ ఫిష్ బోన్స్' అన్న కవితా సంపుటి వచ్చింది. ఆయన మొదటి కవితా సంపుటి అది. అందులో

"ఈ గొప్ప చైనా రాతి గోడల మధ్య ఒక్క రాతిని కూడా కదల్చకుండా

నెమ్మదిగా మనం ముందుకు సాగిపోవాలి

ఎందుకంటే అన్నీ ముందుగానే నిర్ణయింపబడ్డాయి.

అన్నీ ముందుగానే స్థిరపడిపోయాయి, ముందుగానే రాసేయబడ్డాయి

ఈ మార్గం నించి బయటపడి స్వేచ్ఛ కోసం, అద్భుతాల కోసం

ఆరాటపడే అవకాశమే లేదు! అవసరమే లేదు!" అంటాడు.

ఇట్లా నిశ్చయాత్మక, నిర్ణయాత్మక అభిప్రాయాల్తో బలంగా, దృఢంగా కనిపిస్తాడు. షోపెన్ హోవర్ తత్వశాస్త్ర ప్రభావమున్న కొన్ని నిరాశా గీతాలు, పలాయన గీతాలు కూడా యీ సంపుటిలో వున్నాయి.

"నేననుకుంటాను, ఆలోచించి చూస్తే పరిష్కారమేదీ కనుచూపు మేరలో లేదు

ఎవరో ఒకరు సిద్ధం చేసిన సూత్రాల్ని విధ్వంసం చేయాలి.

ఎదురీదాలి! ఎదుర్కోవాలి! ఆశించిన లక్ష్యాన్ని అందుకోవాలి" అంటాడు.

1939లో 'అకేషన్స్' అన్న ఆయన రెండో కవితా సంపుటి వచ్చింది.

'వ్యక్తి' అన్న కవితలో

"నీ ఆకారం ఇక్కడి నుండి కదిలిపోయింది
నీడలా కదిలిపోయింది, నీళ్ళపై కదిలిపోయింది
మాయమైన మరకలా మరలిపోయింది, అదృశ్యమైపోయింది
కానీ అక్కడ ప్రవాహం సాగిన జాడ లేవీ లేవు" అంటాడు.

వ్యక్తి నిష్క్రమణని సుకుమారంగా ఈ కవితలో చిత్రించాడు.

1956లో వచ్చిన 'ద స్ట్రోమ్ అండ్ అదర్' అన్న కవితా సంపుటిలో ఆయన దృక్పథంలో వచ్చిన పరిణామం కనిపిస్తుంది. ఆ సంపుటిలోని ఒక కవితలో స్త్రీని ఉద్దేశిస్తూ "కవిత్వం దైవ సాన్నిధ్యానికి చేర్చే నిచ్చెనలాంటిదని ప్రాచీనులన్నారు. కానీ నా కవిత చదివితే అది నిన్ను చేరడానికి నేను తయారుచేసిన నిచ్చెన అనిపిస్తుంది' అంటాడు. స్త్రీలో దైవత్వాన్ని దర్శిస్తాడు. 'స్వప్నం తనకు ఆద్యంతాలు లేని అంతరాత్మ గాన'మంటాడు. తన కవిత్వం గురించి ఒక సందర్భంలో చెబుతూ 'నేను నా కవిత్వం విప్పి చెప్పగలిగే సాహసం చేయను కానీ కవితాత్మకమైన జీవన చిత్రణ చేసిన వాణ్ణిగా, జీవిత చరిత్రను చిత్రించుకున్న వాణ్ణిగా చెప్పుకుంటాను' అన్నాడు నమ్రతగా.

సున్నితమైన, సుకుమారమైన కళాత్మక వ్యక్తీకరణలతో, నిర్మలమైన భావుకతతో ఆధునిక ఇటలీ కవుల్లో అజరామరమైన కీర్తిని అందుకున్నవాడు మోంటేల్.

## సంజె వెలుగులో ఆకారాలు

కనిపించని నీటి కాంతి
పై కప్పుపైనున్న మన మధ్యగా ప్రవహిస్తూ
పర్వతాల ఆకారాల్ని, నీ వదనాన్ని
ప్రతిఫలిస్తూ ప్రకంపిస్తోంది
కాంతి నిన్ను అలల్లో కదిలిస్తోంది
నువ్వు ఇక్కడే నా దగ్గర వున్నావు
కానీ నాకు అందనంత దూరంలో వున్నావు.
ఈ వాతావరణం వరదలా వచ్చి జడత్వాన్ని జడపట్టుకు లాగుతోంది.
బాహిరమైన ప్రతిదాన్నీ గుర్తించలేని స్థితిలో వున్నాను
స్ఫటిక కాంతిలో స్మృతులు కదుల్తున్నాయి
ఉలికిపాటు శబ్దం గాలిలో కదుల్తూ అందడం లేదు
అట్లాంటి సందర్భాలు కరిగే దినాన్ని కట్టి పడేస్తాయి
ఆశ్చర్యం అతి నెమ్మదిగా కదుల్తుంది
ఒక ఉప్పెన లాంటి గాలి లోయల్ని అల్లకల్లోలం చేస్తూ
ఆకుల్ని ఉన్మత్తంగా కదిలిస్తూ, చీకట్ని వెంబడించి తరిమి
తొలి కాంతి ద్వారాల్ని గుర్తిస్తుంది.
పదాలు భారరహితంగా మనిద్దరి మధ్యా పడతాయి
నిన్ను మృదువైన ప్రతిబింబంలో ముగ్ధంగా చూస్తాను.
నువ్వు నాకు తెలుసునో లేదో నాకు తెలీదు
ఆలస్యంగా తిరిగి వచ్చినా నేనెప్పుడూ నీనించి విడిపోయి లేను
కేవలం కొన్ని క్షణాలు మనల్ని సంపూర్ణంగా దగ్ధం చేశాయి
కేవలం రెండు మొఖాలు
రెండు అలసిన మాస్కులు
చిరునవ్వులో ద్రవ రూపాల్లా జలదరించాయి.

## చిన్ని మరణశాసనం

ఈ రాత్రి చిత్తడి నేలలో కాంతి ప్రతిఫలించినట్లు
నా కపాలంలో కాంతి చిమ్ముతోంది
ఈ ముత్యాల నెక్లెస్ నత్త అనుభవిస్తున్న నరకంలా వుంది
ఈ నేల మీద వ్యాపించిన అద్దం, వజ్రధూళి కాంతి
యిదేదో చర్చిలోనో, ఆఫీసులోనో వెలిగే దీపం కాదు
పసివాణ్ణి యువకుడిగా మార్చడానికి ఉద్దేశించిన కాంతి కావచ్చు
వాడు కమ్యూనిస్టు కావచ్చు. క్యాథలిక్ కావచ్చు
నీకు ఇచ్చి వెళ్ళడానికి నా దగ్గర ఈ ఇంద్రధనస్సు ఒకటే ఉంది
నా దగ్గరున్న ఆ విశ్వాస చిహ్నం తరచూ బలాత్కరింపబడుతుంది
ఆ ఆశ నెమ్మదిగా మంటల్లోని పచ్చని కొమ్మలా కష్టాల్లో కముల్తుంది
ఈ రూపాన్ని, ఛాయని నీ దగ్గరున్న చిన్ని అద్దంలో దాచిపెట్టు
ప్రతి దీపమూ వెళ్ళిపోయినప్పుడు
నరకలోక జంత్ర వాద్య సమ్మేళనం వణుకుతున్నప్పుడు
అగ్గిపుల్ల కాంతి విలాసంగా నాట్యం చేస్తున్నప్పుడు
అలసట విరిగిన కొమ్మలా వొరిగినపుడు
అప్పుడు నిన్ను ఆహ్వానిస్తాను, సందర్భాన్ని సందర్శిస్తాను
ఆ వారసత్వ సంపద లాంటి వాతావరణం, ఆకర్షణ
రుతువుల్ని ఓదారుస్తుంది
పారదర్శకంగా వున్న సాలెగూడు లాంటి సంతృప్తితో అల్లుకుంటుంది
కానీ ఆత్మకథ కేవలం బూడిదలోనే ఉనికి నిలుపుకుంటుంది
మూర్ఖపు పట్టు ఎప్పుడూ వినాశనం అంచులోనే కదుల్తుంది
అది కచ్చితంగా సంతకమే
దాన్ని ఎవరు చూసినా నీకు తిరిగి
తెచ్చిస్తారు
ఎవడి సంతకం వాడికి పరిచితమే
ఎవడి గర్వం నించీ వాడు
తప్పించుకోలేడు
పశ్చాత్తాపంలో అల్పత్వం లేదు
నైరూప్యంగా అల్లుకున్న భూమి
నిండిన దేహం
తడిచిన అగ్గిపుల్లల్లా నిష్ప్రయోజనం
కాదు కదా!



# బాలల భావి జీవితానికి మేలు చేసే సాహిత్యం రావాలి...

- భూపాల్



**సాహిత్యరంగంలో కీలకమైన కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం రావడం పట్ల మీ స్పందన?**

బాల సాహిత్య రంగంలో ఈ పురస్కారం రావడం ఒకవైపు సంతోషంగానే వుంది. ప్రస్తుత బాలల ప్రపంచం చూస్తే ఇబ్బందిగానూ వుంది. రోజు రోజుకూ పెరుగుతున్న బాల కార్మికులు, బాల బిక్షగాళ్ళు, మధ్యలోనే చదువు మానేస్తున్న బాలలు. వాళ్ళ వాళ్ళ హక్కుల కోసం ఏలాగూ అడగలేరు. వాటిని కాలరాస్తున్న పెద్దలు, కొన్ని ప్రాంతాల్లో గిరిజనులపై దాడులు. ఆ దాడుల్లో పిల్లలు కూడా మరణించడం. అంతా గందరగోళంగా వుంది. ఐతే అభ్యుదయకరమైన దృష్టితో, బాటతో రాసిన ఈ సాహిత్యానికి పురస్కారం రావడం ఆనందంగానే వుంది.

**'ఉగ్గుపాలు' కథలు ఎప్పుడు రాశారు?**

"ఉగ్గుపాలు" కథల పుస్తకంలో 86 కథలున్నాయి. అన్నీ చిన్న కథలే. అవి ఒకసారి కూర్చొని పదిహేను రోజుల్లోనో, నెల రోజుల్లోనో రాసినవి కావు. అవార్డుల కోసం రివార్డుల కోసం అసలే రాయలేదు. కొన్ని నెలలుగా పిల్లల లోకాన్ని గమనించి, వాళ్లతో వుండి, పిల్లల ఎడల పెద్దల ప్రవర్తన వీక్షించి రాసినవి. ఏ కథ కల్పితం కాదు, ఇంట్లో కూర్చొని ఆలోచించి, చించి రాసినదీ కాదు. ప్రతి కథలో పాత్రలు సజీవమైనవి. మనసున్నవి. ఈ 'ఉగ్గుపాలు' కథల పుస్తకం 2005లో ప్రచురించ బడింది. అంతకు ముందు కొన్ని నెలల ప్రయత్నం అది.




**నేడు తెలుగులో వస్తున్న బాలసాహిత్యంపై మీ అభిప్రాయం?**

నేను కాకమ్మ కథలు, కల్పితాలు, భూతాలు, దయ్యాలు, దేవతలు, మహత్యాలు అధికంగా చెప్పడాలు నమ్మను. ప్రస్తుతం ఎక్కువ శాతం కథలు, పాటలు ఇదే విధంగా వస్తున్నాయి. ఐతే అందరూ అట్లే రాస్తున్నారనలేను. మంచి చెప్పాలి, పిల్లల్లో, పిల్లల ఎడల పెద్దల్లో మార్పు రావాలి అనే నేపథ్యం మరచి కేవలం పేరు రావాలనీ, అవార్డులు అందుకోవాలనీ రాస్తున్నవాళ్లూ ఉన్నారు. పిల్లల్ని మనసారా ప్రేమించందే పిల్లల సమస్యలు అర్థం కావు. ఆ సమస్యల పరిష్కారానికి పెద్దలేం చేయాలో చెప్పే సాహిత్యం వస్తే మంచిదని తలుస్తాను. బాల సాహిత్యానికి శాస్త్రీయమైన దృక్పథం ఉండాలని భావిస్తాను. అది ఈ రోజుల్లో కొరతగా వుంది.

**బాలసాహిత్యంలో కథలు, గేయాలు వంటి ప్రక్రియల ప్రాధాన్యత ఎలాంటిది?**

తల్లి జోలపాటలో లయ చెవిని సోకిన నాటి నుండీ పాటకు ప్రాధాన్యత బాలల సొంతమౌతుంది. తర్వాత 'లాల' పోస్తూ, ఉగ్గు తినిపిస్తూ అటు పిమ్మట ఆటలో పాట, పాట వెన్నంటి ఆట... ఆ రెంటిని అనుసరించే కథ మొదలౌతుంది. పాటలెంత ఇష్టమో పిల్లలకు కథలంటే అంతే ఇష్టం. రెండింటిలో విషయం ఉంటుంది. పాటలతో శ్రావ్యత, లయ, విషయం, శబ్ద సౌందర్యం తెలిస్తే.. కథలతో జీవితం తెలుస్తుంది. పసివాడికి, మనిషికి జీవితం తెలియడం కన్నా ఇంకేం కావాలి?

ఈ రోజులలో పిల్లల కోసం పాటలు పాడడం చాలా మంది తల్లులు మర్చిపోతున్నారు. జోలపాటల లయలు అడుగంటిపోతున్నాయి. రాగం అంతరించిపోతుంది. అదో మొరటు పద్ధతిగా.. ఊరి మనుషుల్లా పట్నవాసులు తలుస్తున్నారు. గ్రామాల్లోని తల్లుల ముందు తరం, ఆ ముందుతరం సాంస్కృతిక సంపదను, సాంస్కృతిక సౌందర్యాన్ని విస్మరిస్తున్నారు. ఈనాటి పిల్లలకు తాతల, అమ్మమ్మల, నానమ్మల కథలు పాత చింతకాయ పచ్చడి లెక్క తోస్తున్నాయి. టీ.వీలు, సినిమాలు, సినిమా పాటలు, వారి వారి స్కూళ్ల వాతావరణం అంతా మింగేస్తుంది. పిల్లలకు పెద్దలు – తల్లిదండ్రులు పనిగట్టుకొని ఆటా – పాట – కథల ప్రాధాన్యత గుర్చి చెప్పంది; అందుకు విశేష కృషి చేయంది; వాళ్ల బాల్యానికి హాని చేసిన వాళ్లౌతారు.

**ఇంగ్లీషు మీడియం చదువు మన బాల సాహిత్యంపై ఎటువంటి ప్రభావం చూపుతుంది?**

ఇంగ్లీషు మీడియం చదువద్దని కాదు. కాని, మన భాషను మరుస్తున్నారన్నదే బాధ. ఇంగ్లీషు మీడియం పిల్లలు "అమ్మానాన్న" అనే పిలుపును సైతం మర్చిపోతున్నారు. తెలుగు మాట్లాడడం చులకనై పోతోంది. వెక్కిరింతగా మారుతోంది. నీచంగా భావిస్తున్నారు. గోరు ముద్దలతో ఇంగ్లీషు రైమ్స్' ప్రారంభమౌతున్నారు. 'చందమామ రావే' అనే ప్రకృతి, చల్లదనం పోయి అర్థం కాని 'రైమ్' నిలిచిపోతుంది. మాతృభాష మారితే దాని తర్వాత మారేది సంస్కృతి. ఇది గమనించాలి. ఈనాటి తెలుగువాళ్లు.

***ఎలాంటి బాలసాహిత్యం ఎక్కువగా రావాలని మీ ఉద్దేశ్యం?***

మనిషిని మనిషి ప్రేమించే సాహిత్యం. నైతిక విలువలుండే సాహిత్యం. విజ్ఞాన దాయకమైన, వినోదాత్మకమైన సాహిత్యాన్ని ఎలా ప్రేమిస్తామో బాల సాహిత్యంలో కూడా బాలల భావి జీవితానికి మేలు చేసే సాహిత్యం రావాలన్నదే నా ఉద్దేశ్యం. పిల్లలకు వినోదంతో బాటు విజ్ఞానం అందించాలి. మూఢ నమ్మకాలు, అజ్ఞానాన్ని పెంచే పద్ధతి ప్రక్రియలకు కాలం చెల్లాలి. శ్రామికులకు విలువనిచ్చే, వాళ్లను గౌరవించే బాల సాహిత్యాన్ని ఆహ్వానించాలన్నదే నా తపన.

***శక్తివంతమైన సినిమా, టి.వి. మాధ్యమాలలో బాలల కథాంశాలు ఎక్కువ ఎందుకు రావట్లేదు?***

సినిమా, టీ.వి. రెండూ వ్యాపారాత్మకమైన మాధ్యమాలు. లక్షలు, కోట్లు కుమ్మరించి అంతకు పదింతలు, అంతకన్నా ఎక్కువ లాభం పొందాలన్నదే వాళ్ల ఆకాంక్ష. అంతేగాకుండా 'పిల్లల సినిమా'లు తీసినా పిల్లలకు అందనంత 'సాంకేతిక నైపుణ్యత'నే గొప్పతనాన్ని అందులో చొప్పించి విఫలమౌతున్నారు. పిల్లల స్థాయిలో పిల్లల సినిమా వుండాలి. 'మేము ఇట్లే చెప్తాం' అని పెద్దలు అనుకొని తీస్తే పిల్లలకు అందదు. కథాంశం చిన్నదైనా చెప్పే పద్ధతి గొప్పగా పిల్లలకు అందాలి. అందుకు 'ఇరానియన్' సినిమాలు మంచి ఉదాహరణ. పేరు పొందిన నటులతో సంబంధం వుండదు. మహా సుందరాంగులు అందగాళ్లతో ప్రమేయం లేదు. వాళ్లకు కావలసిందల్లా సూటిగా, ఏ భేషజం లేకుండా కథ నడపడం. పిల్లల ముందు తేటతెల్లం చేయడం. అది మన తెలుగు దర్శక నిర్మాతలకు తెలియాలి.

***ఆ దిశగా రచయితల కృషి ఎలా ఉంది?***

ఆ దిశగా రచయితలు తమవంతు కృషి చేయాలంటే అట్టడుగు ప్రజలతో సంబంధం పెరగాలి. అట్టడుగు పిల్లల మనస్తత్వాలు తెలియాలి. ముఖ్యంగా భూమి పుత్రుల జీవన విధానం తెలిస్తేనే పిల్లలకు చక్కని సినిమా కథ అందించగలం, అందుకు అందరం కృషి చేయాలి.

***బాలల సాహిత్యాన్ని ప్రోత్సహించడానికి ప్రభుత్వం తరపున ఎలాంటి కృషి జరగాలి?***

పాఠశాలల్లో తెలుగు పాటలు, తెలుగు కథలు అంతరించిపోతున్నాయి. సామాజిక శాస్త్రం కనిపించకుండా పోయింది. అంతటా ఇంగ్లీషు ఆక్రమించుకుంది. దాంతో తల్లిదండ్రులకు గొప్ప ఉద్యోగాలు, గొప్ప విదేశీ చదువుల మోజు పెరిగింది. ఇప్పుడు ఖర్చు పెడతాం. రేపు ఇంతకు వంద రెట్లు మా పిల్లలు విదేశాల్లో సంపాదించి పంపిస్తారు అనుకుంటున్నారు. ప్రభుత్వం చేసేవన్నీ పక్కదారులు పట్టించే పనులే కాని, వ్యక్తిత్వాలను నిలుపుకొమ్మనే విధానాలకు తావివ్వదు. ఎందుకంటే ఎవరెట్లా పోతేనేం ప్రభుత్వం తాను నిలిచే వుండాలనుకుంటుంది. అందులో భాగంగానే ప్రైవేటు స్కూళ్ళను ప్రోత్సహిస్తూ, ప్రభుత్వ పాఠశాలకు చిల్లులు పెడుతుంది. ఇక బాలల సాహిత్యం గూర్చిన ప్రాముఖ్యత ఎందుకుంటుంది. పోటీ చదువులు, పరీక్షల చదువులు, ఇక్కడా – ఎక్కడా కథల 'క్లాసు' లేదు పిల్లల్ని సిలబస్‌తో పరిగెత్తించడమే.



***మీరు రాసిన ఇతర పుస్తకాల వివరాలు?***




'ఉగ్గుపాలు' పుస్తకం 2005లో వచ్చింది. 1995లో మొదటిదిగా వచ్చిన అంబల్లబండ' కథల పుస్తకంలో పెద్దల కొరకే కథలు రాసినా అందులో విషయాలన్నీ పిల్లలవే. ప్రధాన పాత్రలూ పిల్లలే. 'భూపాల్ పాటలు' అనే పుస్తకంలో పాట ముప్పైపైన ఉన్నా అందులో నాలుగు పాటలు పిల్లలవి ఉన్నాయి. "వస్తవా పోతావా చిలుకల్లకొలికి" పిల్లల పాటల పుస్తకం. 'గుడుగుడుగుంచం' చిన్ని పిల్లల పాటలు. 'కొత్త బ్యాగ్' కథలు 'కొమరం భీమ్' పిల్లల నవల, బొమ్మల కథల పుస్తకాలు : 'ఎవరి పనివాళ్ళది', 'ఎలా దాటాలి?', 'రాయి – దేవుడు', 'గాలికి ఎంత బలం' వచ్చాయి. అముద్రితాలుగా ఇంకా నాలుగు పుస్తకాలున్నాయి.

***మా భూమి, దాసి, కొమురం భీం వంటి సినిమాలలో నటించారు. అలాగే దర్శకత్వం, రచన చేపట్టారు... ఆ అనుభవాలు..?***

"మా భూమి" "దాసి" "కొమరం భీమ్" "పార్ (హిందీ)" "యెల్లమ్మ" "గులాబీ అత్తరు" టెలీఫిలిం", "జ్యోతిరావుపూలే" టీ.వి. సీరియల్ మొదలైన వాటిల్లో ప్రధాన, ముఖ్య పాత్రలు పోషించాను. కొన్నింటిలో పాటలు రాశాను. 'హరివిల్లు' పిల్లల సినిమాలో చిన్నపాత్ర వేశాను. కథపరంగా ఆ సినిమా పిల్లల, ప్రేక్షకుల ఆదరణ పొందలేకపోయింది. ఏది ఎట్లున్నా 'ఇరాన్' సినిమాల్లా చిన్న సబ్జెక్ట్‌తో ఒక సినిమా తీస్తే బాగుండుననేది నాలో ఎప్పుడూ కొట్టుమిట్టాడే యోచన.

***'అంబల్ల బండ' వంటి కథలు రాసి కథా సంపుటి కూడా ప్రచురించారు. ఆ తర్వాత కథలు ఎక్కువగా రాసినట్టు కనిపించదు?***

'అంబల్లబండ' 'నా కథల పుస్తకం తర్వాత పెద్దల కోసం రాసిన అలాంటి కథలు అక్కడక్కడ పత్రికల్లో ముద్రితమైనవి మరో పుస్తకం అవుతాయి. వాటిని వేయాలి. ఐతే అదే పనిగా ఎక్కువగా రాయలేదు కాని, రాశాను. నా "నెమలి కన్ను" కథల పుస్తకంలో 63 కథలున్నాయి. ఇక పిల్లల కథలు సరేసరి. ఇలా చూస్తే రాయందెప్పుడూ? అనిపిస్తుంది. ఐతే పుస్తకాలుగా రాని సాహిత్యం వుంది.

***ప్రజాశక్తిలో చిన్నారి పేజీకి మీరు గేయాలు, కథలు రాసారు కదా! అరిబండి బాలసాహిత్య ట్రస్టు మీరు రాసిన 'భూంపాప' పాటలు పుస్తకంగా ప్రచురించింది?***

"ప్రజాశక్తి" దినపత్రిక శ్రామికుల పత్రిక. నేను 'ప్రజాశక్తి'లో కథలు రాశాను. పాటలు రాశాను. అట్లే నాటక రంగం గురించి చిన్న పిల్లలకు అర్థమయ్యే రీతిలో వ్యాసాలు రాశాను... పాటలు మినహా మిగతావి. – 'కొత్త బ్యాగ్' అనే పేరుతో పుస్తకంగా వేశారు. 'ప్రజాశక్తి' మిత్రులు మంచి పనిచేశారు. అందుకు సంతోషించాను. "ప్రజాశక్తి"ని సోదర సంస్థగా భావిస్తాను. నిశితమైన శాస్త్రీయ దృక్పథంతో ఇంకా మంచి మంచి బాలల పుస్తకాలు రావాలని నా కోరిక.

అరిబండి బాల సాహితీ ట్రస్టు వాళ్లు నేను రాసిన, "భూం



## బీదవాడి బ్రతుకు

**- గొడవర్తి శ్రీనివాస్**

ఎండయినా, వానయినా,
ఏ అనుమతీ లేకుండానే
దర్జాగా ప్రవేశిస్తాయ్...
పేదవారి గుడిసెల్లోకి
పాలరాతి మేడల చుట్టూ
ప్రదక్షిణలెన్ని చేసినా, లోనికి
ప్రవేశమే దొరకదు, పాపం...
ఎండా, వానా, రెండింటికీ
కానీ...
అదేం చిత్రమో...
బడాబాబుల భవనాలను
చల్లపరచే యంత్రాలు విషగాలుల్ని
కక్కుతూ ఉంటే...
వాటిని మింగలేక, కక్కలేక
ఉక్కిరి బిక్కిరి అయ్యే ప్రకృతి
తన కోపాన్నంతా
వడగాడ్పుగా మార్చి సెగలు రేపినా,
పెనుగాలిగా మార్చి ప్రతాపించినా,
దిగులయ్యేది....
గుబులయ్యేది...
పాలరాతి మేడకు కాదు.
పేదవారి గుడిసెలకే,
బీదవారి బ్రతుకులకే...
బీదవాడి బ్రతుకంటే...
గద్దల్లాంటి పెద్దలకే కాదు
తల్లిలాంటి ప్రకృతికీ
అలుసేనేమో... మరి..

---

పాప పాటలు" అనే పుస్తకాన్ని ముద్రించారు. బొమ్మలతో వచ్చింది. బాగుంది. ఈ పొట్టిపాటలు 'ఆరుద్ర'గారు రాసిన 'కూనలమ్మ పదాలు' అదే పదాలతో రాశాను. అక్షరాలూ అన్నే. ఈ పాటలన్నీ కొన్ని సంవత్సరాల క్రితం 'ఆంధ్రజ్యోతి'లో ఆదివారం అనుబంధంలో "ఆటాడుకుందాం... రా" అనే శీర్షికతో సీరియల్‌గా వచ్చినవే "భూం పాప పాటలు" 2008లో ప్రచురించబడింది. డా॥ అరిబండి ప్రసాదరావుగారు పుస్తకం వ్యవహారమంతా చూశారు. అన్నీ బాగా చేశారు. కానీ, ఒక చిన్న పాటలో నా భావానికి విరుద్ధ అర్థం వచ్చేలా ఎడిట్ చేశారు.

***సాహిత్యంలో మీ ప్రవేశం ఎలా జరిగింది?***

సాహిత్యంలో ప్రవేశం.. చిన్నప్పుడే జరిగింది. మా కుటుంబంలో సాహిత్య ప్రియులు ఎవరూ లేరు. కాని, అందరూ పాటగాళ్లే, జానపద కళా రూపాలను అభిమానించేవాళ్లే. అమ్మ గొప్పగా బతుకమ్మ పాటలు పాడుతుంది. చిన్నమ్మ, పెద్దమ్మలు.. అమ్మమ్మ... చక్కగా పాటలెన్నో జానపదాలవి పాడేవాళ్లు. వాళ్లు బతుకమ్మ కోలాటం ఆడేవాళ్లు.. అంతేగాక హనుమండ్ల గుడి ముందు హరికథలు, ఇంటిముందు భాగవతులు, రకరకాల బిక్షు గాయకులు, భజనపాటలు, చిరుతల రామాయణం ప్రదర్శన ఇలా ఒకటా రెండా ఎన్నో కళారూపాలు నన్ను సాహిత్యం వైపుకీ, ఆ పాటల దర్వుల దిక్కుకే, అడుగులూ నుడుగుల వైపుకే లాక్కున్నాయి. అంతే గాకుండా గ్రామానికి వెళ్లితే అక్కడ పొలాల పాటలు, ఇక్కడ మూసీనది అంచున ఉండిన గడ్డి పొలానికి వెళ్లితే అక్కడ మూసీ అవతల నుంచి పూలతోటలో 'అమ్మలు' పాడే కమ్మని పాటలు ఇవన్నీ నన్ను సాహిత్యంలో ప్రవేశించమని ప్రోత్సహించిన సంఘటనలు. ముందు భజనపాటలు, ప్రేమగీతాలు, పిచ్చి కథలు, 'డిటెక్టు' నవలలు రాసేవాన్ని. ఆ తర్వాత నాటికలు, నాటకాలు కుటుంబ వ్యవహారాల మీద రాసేవాన్ని.. ఎట్లెట్ల ప్రపంచజ్ఞానం అబ్బుతూ వచ్చిందో' ఏ విధంగా 'మార్క్సిస్టు' సిద్ధాంత అవగాహన కలిగిందో అట్లా నా రచనల్లో మార్పు వచ్చింది. శాస్త్రీయత తెలిసింది. ప్రజలంటే ఎవరో అర్థమైంది. జీవితం అవగతమైంది. పిల్లలు - పిల్లల వ్యవహారాలు. వాళ్ల ఆలోచనలు, అభిప్రాయాలు, ఆశలు.. వాళ్ల అంతరంగం కొంతలో కొంత నా మనస్సుకు అందింది.

***మీ కుటుంబ నేపథ్యం?***

మాది వ్యవసాయ కుటుంబం. నేలను నమ్మిన కుటుంబం. నాన్న రాంరెడ్డి, అమ్మ అంబమ్మ, నాన్న అవినీతి నిరోధక శాఖలో డ్రెస్సువేయనని మొండికేసిన కానిస్టేబుల్‌గా వుండి ఉద్యోగ విరమణ చేసి తన 86 వ సంవత్సరంలో ఇప్పటికి రెండున్నర సంవత్సరాల క్రితం చనిపోయారు. నాకు అన్న, అక్క తమ్ముడు, ముగ్గురు చెల్లెళ్లు ఉన్నారు. అందరి పెళ్లిళ్లు జరిగాయి. మా అన్న దమ్ములకు మా అమ్మకు మూసీలో ఉన్న గడ్డిపొలమే తిండి పెట్టింది. బర్లను పోషించి, పాలు పిండుకొని అమ్మి పొట్టపోసుకున్న బాల్యం మాది. చదువులు అరకొరగా సాగినా నా స్వంత పట్టుదలతోనే నా 57 సం॥రాల ప్రాయంలో "డాక్టరేట్ పట్టా పొందాను". దానికి నా కొడుకు, కూతురు సహకారం వుంది. వాళ్ళిద్దరూ పెళ్ళిళ్లు చేసుకున్న ఉద్యోగస్తులు. మరీ ముఖ్యంగా నా భార్య నా ఆలోచనలకు తోడు లేకుంటే ఇన్ని పనులు నాకు సాధ్యమయ్యేవి కావు.

నా ఇద్దరు పిల్లల చిన్నతనంలో వాళ్లను తిట్టి - కొట్టి మార్చుకుంటా వాళ్ళకు తెలియని సంగతులు చెప్పడానికి, ఒక క్రమశిక్షణను పాటించడానికి చిన్నవీ, పెద్దవీ, కథలు అల్లి చెప్పేవాడిని. ప్రతి సంఘటన వింత వింత పోకడలతో జోడించి, హాస్యం కల్పించి చెప్పడంతో ఆ కథలంటే పడిసచ్చేవాళ్లు. ఇవన్నీ ఎక్కడున్నాయంటే ఒక పుస్తకం వుంది అని అనేవాడిని. అంతే ఆ పుస్తకం లేదని ఇప్పుడు తెలిసి ఈ ప్రాయంలో కూడా వాళ్లు బాధపడుతుంటారు. అప్పుడే రాసి వుంటే అవి మా పిల్లలకు పనికొచ్చేవని ఎప్పుడూ అంటా వుంటారు. కథలు అల్లడం ఆ విధంగా నేను నా పిల్లలతోనే నేర్చుకున్నాను.

***మీ భవిష్యత్ కృషి?***

ఏముందీ? పిల్లల కోసం ఇంకా బాగా రాయాలి. వాళ్లను ఇంకా అర్థం చేసుకోవాలి. వాళ్ల నుండి నేర్చుకోవాలి... వీలైతే డబ్బులుంటే ఒక మంచి సినిమా - 'పిల్లల సినిమా' తీయాలి.

**(ఇంటర్వ్యూ: వొరప్రసాద్)**

- కె. సత్యరంజన్
(ఇంగ్లీషు నుండి అనువాదం)

## తగలడిపోనీ

నా యవ్వనం ఎక్కడ కూలిపోయింది
చూడండి, భవిష్యత్తు ఎలా నిప్పడిపోతుందో
ఇవాళ నేను నోరు విప్పుతున్నా
మీరు తెలుసుకోవాలి
ఈ లోకానికంతటికీ తెలియజెప్పాలి
రేపటి మా రోజు గురించి చెప్పే
భవిష్యవాణి ఎట్టకేలకు పురుడు పోసుకుంది

**- అపోలనీర్ (1914)**

## యుద్ధ బీభత్సం

అంతా స్తబ్దుగా ఉంది
వాళ్ళొచ్చి కందకాల్లో వాలిపోయారు
బతికిన వాళ్ళు, రక్తమోడుతున్న
చచ్చిన శవాల సహజీవనం
అసహ్యించుకోవడానికి ఏముంది
రేపో మాపో మనమంతా మరణించాల్సిన వాళ్ళమే

ఎవరక్కడ? లేచి నిలబడండి
నేను రెవిల్లేని ఆజ్ఞాపిస్తున్నాను
అనామక మొహాలు
నీలం బారిపోయి ఉన్నాయి
ఎవరన్నా రెండవ తుఫాను బెటాలియన్ వాళ్ళు
బతికున్నారా?
లేచి నిలబడండి. మీకీ తమాషా చూపిస్తా

ఇదేంటిదీ చిత్రం - శవాలు
లేచి నిలబడుతున్నాయేమిటి?
నేనింకా ఇక్కడ బతికున్న వాళ్ళు ఉన్నారనుకున్నానే...

**- ఎర్నెస్ట్ నీజ్ వెస్ట్‌నీ (1914)**
**(నీజ్ వెస్ట్‌లీ అంటే రష్యన్ భాషలో అనామకుడు అని అర్థం)**

## వియత్నాం

అంత ఎత్తునా లేదు
మరీ అంత దూరమూ కాదు
నువ్వు చక్రవర్తివీ కాదు
రాజువీ కాదు
అంతా చేసి నువ్వో చిన్న మైలురాయివి
జాతీయ రహదారికి కొసగా నిలబడినదానివి
నిన్ను దాటుకుని వెళ్ళే జనాలందరికీ
సరైన తోవ చూపిస్తుంటావ్
బాటసారులు దోవ తప్పకుండా కాపు కాస్తుంటావ్
దూరాల గురించి చెబుతుంటావ్
ప్రయాణ భారాన్ని గుర్తు చేస్తుంటావ్
నువ్వు చేసే సేవ చిన్నదే
కాని ప్రజలు ఎప్పటికీ నిన్ను గుర్తుంచుకుంటారు

**- హోచిమిన్**

## 1

కార్ఖానాలో పని అంటే
మొహానికి ఇంత మసి పూసుకోవడమేగా
ఆనక తీరిక దొరికితే ఏం చేస్తాం
కలిగినోళ్ళ విలాసాలు చూసి
రెప్పవేయడం మర్చిపోతాం
ఏం వాయిదా ఉంది దీనిలో
నీ హృదయం నుండి ఈ పాత రోతని తుడిచెయ్
అణాకాణీ నిజాలెన్ని ఉన్నాయ్
ఈ కూడళ్ళే రంగుల రేకలు (ప్యాలెట్)
ఈ వీధులే కుంచెలు

వెయ్యిన్నొక్క పేజీల కాలపు ఉద్గ్రంథంలో
విప్లవం గురించి ఒక్క అక్షరమూ లేదు
కవులారా, కలలు కనేవాళ్ళరా
ఆగామి భవితవ్యాన్ని స్వంతం చేసుకునే వాళ్ళారా
రండిక, వీధుల్లోకి రండి

**- వ్లదిమీర్ మయకోవ్‌స్కీ (1918)**

## 2

పాత ప్రపంచాన్ని ధ్వంసం చేస్తాం
అతి క్రూరంగా
ఈ ప్రపంచం మీద ఒక కొత్త లోకాన్ని
ఉరుముతాం
కాలపు ముళ్ళ కంచెల్ని
మా కాళ్ళతో తొక్కి మరీ కూలదోస్తాం
ఇంద్రధనస్సుతో
మేం ఒక మార్మిక కాలమానాన్ని తయారుచేస్తాం

గులాబీల, కలల రేకల్ని
ఈ కవులెంతగా నలిపి నాశనం చేసారూ...
సంతసం నిండిన మా కనుల నుంచి
పసి బాలల పెద్ద పెద్ద కళ్ళ నుంచి
జాలువారే కాంతిలో వాటి గుట్టు విప్పుతాం

మేం ఇప్పుడు కొత్త గులాబీలు పట్టుకొస్తాం
కూడళ్ళనే రెక్కలతో కూడిన
ఎర్ర గులాబీలను రాజధానుల్లో పూయిస్తాం

**- వ్లదిమీర్ మయకోవ్‌స్కీ (1917)**

కథ

# స్పందన



## - ముక్కామల దేవీ నాగ మోహనరావు

**నగరంలో రద్దీగా వుండే నాలుగు రోడ్ల కూడలి అది. కానీ, సెంటర్లో ట్రాఫిక్ కానిస్టేబులు వుండడు. వెంకటేశ్వర స్వామి వారి ఆలయం, షిరిడి సాయిబాబా వారి ఆలయం పక్కపక్క వీధుల్లో సెంటరుకు దగ్గరగా వుంటాయి. వెంకటేశ్వర స్వామి వారి ఆలయానికంటె షిరిడి సాయిబాబా వారి ఆలయానికొచ్చే భక్తుల సంఖ్య ఎక్కువ. ఆ భక్తులలోనూ యువభక్తుల సంఖ్య ఎక్కువ.**

ఇక షాపింగు కాంప్లెక్సులు, అపార్టుమెంటు బిల్డింగులు, కాలేజీలు, కంప్యూటరు సెంటర్లు, గ్రామర్ స్కూళ్ళు, గ్లామర్ వున్న స్కూళ్ళు, గ్లామర్ లేని స్కూళ్ళు సెంటరుకు నాలుగు వైపులా సర్దుకొని వుంటాయి. పై నుండి కిందికి రాలేని గృహిణులు కిందనున్న కూరగాయల వ్యాపారస్తులతో అరచుకుంటూ మాట్లాడడం, పైనుండి బుట్టలో, బక్కెట్టులో దిగడం, అందులో కూరగాయలు పడిన తరువాత తాడును పైకి లాగడం, పై ఫ్లోర్‌లో వాళ్ళు కింది ఫ్లోర్‌లో వాళ్ళతో పిచ్చాపాటీ మాట్లాడడం, నవ్వులు, అరుపులు – ఆ సందడి అంతా యింతా కాదు. సెంటరుకు చుట్టూ హోటళ్ళు, బడ్డీకొట్లు, పళ్ళ దుకాణాలు, కూరగాయల దుకాణాలు, ఆ దుకాణాల్లో రాసులుగా పోసిన కూరగాయలు దర్శనమిస్తాయి. మరి వచ్చేపోయే వాహనాలకు అంతులేదు. హారన్ల మోతలు, కీచుమని పడుతున్న బ్రేకుల చప్పుళ్ళు, మనుషుల కేకలు, అరుపులు, ఆడియో సెంటర్లనుండి వినవచ్చే కర్ణకఠోరమయిన లేక కర్ణపేయమయిన సంగీతం, అది సంరంభమో, సంక్షోభమో అనిపిస్తూ అటుఇటూ హడావుడిగా తిరుగుతూన్న జనం– ఇదంతా చూస్తూంటే మానవ జీవితంలో ఏదో లోపించిందని స్ఫురించక మానదు.

నగరంలో రద్దీగా వుండే నాలుగు రోడ్ల కూడలి అది. కానీ, సెంటర్లో ట్రాఫిక్ కానిస్టేబులు వుండడు.

సాయంత్రం ఆరున్నర కావొస్తున్నది. చీకట్లు మెల్లమెల్లగా ముసురుకొంటున్నాయి. కార్పోరేషను వారి విద్యుద్దీపాలు వెలగడం ఆరంభమయింది. షాపింగు కాంప్లెక్సులు, అపార్టుమెంటులు, తదితరమైనవన్నీ కూడా విద్యుద్దీప కాంతుల్ని విరజిమ్మడం కూడా మొదలయ్యింది.

అంతలో కీచుమంటూ భయకరంగా ఒక శబ్దం. "అమ్మో!" అంటూ గుండెలను పిండివేసే దీనమయిన సన్నని కేక. ఏడుపులు. అంతా క్షణాలమీద జరిగిపోయింది. చుట్టూ జనం పోగవుతున్నారు. వ్యాపారస్తులు షాపుల్లోంచి తొంగి చూస్తున్నారు. – వ్యాపారానికి అంతరాయం కలక్కుండా చూసుకుంటూనే. అపార్టుమెంట్లనుండి కొన్ని తలకాయలు బయటకు తొంగి చూశాయి. మనకెందుకులే అని కొన్ని అదృశ్యమయ్యాయి. వైట్ కాలర్ పీపుల్ కొందరు ఒక్క క్షణం ఆగి లీగల్ పాయింట్లను కొన్నింటిని జ్ఞప్తికి తెచ్చుకొని మౌనంగా ముందుకు సాగిపోయారు.

జరిగింది చిన్న యాక్సిడెంటు. ఇద్దరు అందమైన యువతులు పెద్ద హోండా యాక్టివా మీద వేగంగా వచ్చి, ఇద్దరు చిన్నపిల్లల్ని ఇంచుమించుగా గుద్ది కీచుమంటూ సడెన్ బ్రేకు వేశారు. ఆ ఇద్దరు చిన్న పిల్లలు - ఎనిమిది తొమ్మిదేళ్ళ అమ్మాయి, అయిదారేళ్ళ అబ్బాయి. ఇద్దరూ కిందపడిపోయారు. చిన్న చిన్న దెబ్బలు తగిలాయి. ఆ ఇద్దరు యువతులు హోండా దిగి తెల్లబోతూ నిలబడ్డారు. వాళ్ళకు పాపం కొంచెం సిగ్గువేసింది. హఠాత్తుగా జరిగిన సంఘటన వల్ల వాళ్ళ నుదుళ్ళ మీద చిరుచెమటలు పోశాయి. 'ఏం చెయ్యాలి' అన్నట్లు చుట్టూ మూగుతూన్న జనం కేసి చూశారు.

"అమ్మో! రత్తం!" అని అరిచింది చిన్నపిల్ల తనకు తగిలిన దెబ్బను చూసుకొని.

పిల్లవాడు ఏడవడం మొదలుపెట్టాడు. వాడికి ముడుకు మీద దెబ్బ తగిలింది. రక్తం కొంచెం ఎక్కువగానే కారింది చిన్న పెచ్చు కూడా వూడి పోయింది.

"అక్కా! కిర్సనాలు వొలికిపోయిందే" అంటూ ఏడ్చాడు వాడు.

ఆ పిల్ల చేతిలోని పొట్లం కూడా కిందపడి, చితికి, అందులోని బియ్యం మట్టిలోకి వొలికిపోయాయి.



ఇంతలో ఒక మానవుడు ఆ పిల్లలిద్దర్నీ లేవదీసి, చుట్టూ ఒకసారి చూసి, విషాదంగా నవ్వి ముందుకు సాగిపోయాడు.

ఆ ఇద్దరు యువతులు చాలా నాజూకయిన వారు. బంగారు కాంతీలీను శరీర ఛాయగల వారు. అందమయిన వారు. ఇంతింత కళ్ళతో బెదురు చూపులతో నిలబడ్డారు. వాళ్ళకంటే వాళ్ళు ధరించిన దుస్తులు మరింత అందంగా వున్నాయి. వాళ్ళ హోండా యాక్టివా యింకా యింకా అందంగా వుంది. వాళ్ళు ఎంత సుకుమారంగా వున్నారంటే చుట్టూవున్న వాతావరణం ఒక్క సారిగా 'అలర్టు' అయింది.

దారిన పోతూన్న ఓ ముసలాయన, తెల్లని బట్టల్లో - ఏ రిటైర్డు ఆఫీసురో, కొంచెం కోప్పడ్డాడు.

"ఏవిటమ్మా ఇది? కొంచెం చూసుకోవద్దూ! ఎవరమ్మాయిలు?"

"మేం వస్తూ వుంటే ఈ ఫిల్లలు అడ్డంగా వచ్చేరండీ " అంది బండిని నడిపిన అమ్మాయి.

ఆ యువతులిద్దరికీ పదహారు, పదిహేడేళ్ళకు మించి వయసుండదు.

"తెలుక్కాడా యింగిలిపీసులా మాటాడాలా!" అని కూరగాయల దుకాణం వాడొకడు గొణిగాడు.

"మీరొచ్చింది రాంగుసైడు. ఇంత పెద్ద బండిని నడపడమేవిటి? ఎవర్దీ బండి? " అడిగాడు ముసలాయన.

"మా డాడీదండి"

"మీ డాడీదయితే లైసెన్సూ అదీ లేకుండా బండిని నడపొచ్చా? ఛ! ఛ! ఏం పిల్లలు! " ఆ పెద్దాయన గొణుక్కుంటూ ముందుకు నడిచాడు.

గుంపులో ఒక గిరజాల జుత్తాయన వున్నాడు. అతడొక నాట్యాచార్యుడు. నడక కూడా ఆడదాని లాగానే నడుస్తాడు. కాటుక కళ్ళు తిప్పుతూ కొంచెం ముందుకు వచ్చి,

"ఏంటర్రా యిది! చూసుకోవద్దూ? ఎవరమ్మాయిలు? అనడిగాడు ముద్దుగా.

ఇద్దరు యువతులు ఫలానా ఫలానా అని చెప్పారు. చెప్పకపోయినా ఎవరికయినా తెలుస్తుంది బాగా బలిసిన వారి అమ్మాయిలని.

నాట్యాచార్యుడు,

"జాగ్రత్తర్రా! చూసుకోవాల్రా" అంటూ అచ్చంగా వయ్యారంగా ముందుకు సాగిపోయాడు.

గుళ్ళల్లో యువభక్తులకు ఇద్దరు యువతులు యాక్సిడెంటు చేసారన్న వార్త క్షణాల మీద చేరింది.

యాక్సిడెంటు చేసిన అమ్మాయిలు చాలా ఇబ్బందికరంగా ఫీలవుతున్నారు.

"మా డాడీకి ఫోన్ ఛేస్తాన్" అంది బండిని నడిపిన అమ్మాయి, సెల్‌ఫోన్ తీస్తూ.

"ఛ! అఖ్ఖర్లేదులేవే." అంది రెండో అమ్మాయి, గుంపులో అప్పటికే చొరబడిన అబ్బాయిల కేసి ఆసక్తిగా చూస్తూ.

చేరిన గుంపులో అన్ని రకాల మనుషులూ వుంటారు. ఉద్యోగులు, నిరుద్యోగులు, పనీపాటా లేని వాళ్ళు, సైటు కొట్టే వాళ్ళు, భోగులు, విరాగులు, రచయితలు, కవులు, ఇంకా మరెందరో మహానుభావులు......

కొందరు, యాక్సిడెంటు చేసిన అమ్మాయిలను చూసి,

"అయ్యో! పాపం ఆడపిల్లలు!" అన్నారు.

"నిన్న మొన్నటి దాకా పేడా, పిడకలూ అమ్మినోళ్ళే కదూ! ఇప్పుడు లక్షలు గడించేరు! కళ్ళు నేలమీదెలా వుంటాయి?! అన్నారు.

ఇంకొందరు,

"అమ్మాయిలయితే ఏంటి? ఒళ్ళు పొగరా?" అన్నారు.

పక్కనే బడ్డీ కోట్లో టీ తాగుతూ విషాదంగా నవ్వాడో యువకుడు. అతడొక రచయిత నిరుద్యోగి. బ్రతుకుతెరువు లేని దిక్కుమాలిన ప్రాణి ఆ యువతులను ఆకర్షించడానికి అతడు రవ్వంత ప్రయత్నించాడనడం వాస్తవం. జరిగినదంతా గమనించిన అతడి మొహంలో చిన్న ఆశాకిరణం మెరిసింది. ఉత్సాహంగా చేతిలోని కాగితాల కట్టను వూపుకుంటూ పార్కుకేసి గబగబ అడుగులు వేస్తూ నడిచాడు.

# నాలుగు పదాలు

- ఎ. సూర్య ప్రకాష్



"ప్లీజ్
థాంక్యూ
సారీ
ఎక్స్‌క్యూజ్ మీ"
అనే ఈ
నాలుగు పదాలతోనే
అమెరికన్లు ప్రపంచాన్ని
కొల్లగొడుతున్నారు
నోటమాట పెగలక
గుడ్లప్పగించి
నిశ్శబ్దంగా చూస్తూ
మిగతా దేశాలవారు
కొల్లగొట్టబడుతున్నారు!

---

నలుగురూ విసురుతున్న మాటలకు ఆ అమ్మాయిలిద్దరూ కొంచెం బెదిరారు. వారి అందమైన హోండా కూడా కొంచెం బెదిరింది. విద్యుద్దీపాల పసుపు పచ్చని వెల్తురులో బంగారు తీగల్లా మెరుస్తున్న ఆ యువతులను చూస్తుంటే గుంపులోని కొందరిలో సానుభూతి వెల్లువలై ప్రవహించడం మొదలయ్యింది.

చుట్టూ చేరిన యువకుల్లో, బాగా ధైర్యమున్న యువకుడొకడు ముందుకొచ్చాడు. గుడికొచ్చే చాలామంది ఆడపిల్లలతనికి తెలుసు. సాయి భక్తి గీతాలను చాలా శ్రావ్యంగా ఆలపిస్తాడు. ముందుకొచ్చిన ఆ కుర్రాడి కేసి ఆడపిల్లలిద్దరూ ఆసక్తిగా చూశారు. అతడికి, వాళ్ళ కళ్ళల్లో చిన్న కన్నీటి పొర తళుక్కుమన్నట్లు కనిపించింది.

ఆ యువకుడి ఛాతీ కొంచెం పొంగింది.

"పిల్లలకేమీ అవ్వలేదు కదా! చిన్న చిన్న దెబ్బలు తగిలాయంతే ఫర్లేదండీ, నేను చూసుకుంటాను. మీరెల్లండి. " ఆ యువతుల్తో అని,

"లేడీసు కదా!" అన్నాడు చుట్టూ వున్నవాళ్ళతో గుంపులో మనుషులెవరూ మాట్లాడలేదు. అందరూ ఆ అమ్మాయిలకు దారి ఇచ్చారు.

ఆ యువకుడి కేసి కృతజ్ఞతగా చూశారా యువతులు. వాళ్ళ కళ్ళు కొంచెం మెరిసాయి. బండిని నడిపే అమ్మాయి కనీ కనిపించని చిన్న చిరునవ్వును ఆ అబ్బాయి వైపు రువ్వింది. హోండాను స్టార్టు చేసి, ఇద్దరూ 'రంయ్' మని ముందుకు దూసుకుపోయారు.

గుంపు మెల్లగా చెదిరిపోయింది. ఎవరి దారిన వాళ్ళు పోవడం మొదలుపెట్టారు.

"ఏం పర్లేదమ్మా జాగర్తగింటికెలిపోండేం " అన్నాడా యువకుడు ఏడుస్తూన్న పిల్లలతో. తను మళ్ళీ కీర్తనలు ఆలపించడానికి ఉత్సాహంగా గుడివైపు నడిచాడు.

పిల్లలు ఏడుస్తూనే వున్నారు. చాలా రక్తమే కారింది. వాళ్ళు నిలుచున్న నేల కొంచెం రక్తంతో తడిసింది. ఏడుస్తూ, మన్నులోకి వొలికిపోయిన బియ్యాన్ని మట్టితో కలిపి తీస్తూ, గౌనును కొంచెం పైకెత్తి ఒడిగా చేసి అందులో పోస్తూందా పిల్ల.

మనుషులందరూ ఎవరిదారిన వాళ్ళు పోయారు. భయంతో, బాధతో, హడలిపోయిన ప్రాణాలతో దిక్కులేనట్లుగా నిలబడిన ఆ పిల్లల్ని,

"ఏరా రవణా! ఈడున్నారేంటి?" దారినపోతూన్న రిక్షావాడొకడు అడిగాడు, ఆ పిల్లల్ని గుర్తుపట్టి, తన పక్కింటి తాగుబోతు పిల్లలు.

రిక్షాలో మనుషులున్నారు.

"తాత! కూటరు గుద్దీసింది! " అంటూ గట్టిగా ఏడ్చాడా పిల్లాడు.

తాత రిక్షాదిగాడు. చుట్టూ ఆవేదనతో చూశాడు. ఏం చేయగలడు?!

రిక్షాలో మనుషులు విసుక్కుంటున్నారు.

"రకతం కారతందా?" అన్నాడు బాధగా. జాగ్రత్తగా పిల్లల్ని రోడ్డు దాటించాడు.

"జాగర్తగెలిపోండింటికి. అమ్మ మందెడతాది."

చీకటి, వెల్తురు రెండూ పరచుకొని వున్న ఆ వీధిలో పిల్లలు ఏడుస్తూ పోతూవుంటే, అప్పటికే బయటికి వచ్చి చోద్యం చూస్తున్న గృహిణుల్లో ఒకమె,

"పాపం! చిన్న పిల్లలమ్మా! ఈ కాలేజీ పిల్లలకు మంచీ చెడ్డా తెలియడం లేదు." అంది. ఆ సానుభూతి మాటలకు పిల్లలిద్దరూ ఆమె వైపు తిరిగారు.

ఆ ఇల్లాలు కంగారు పడింది.

"ఆఁ! ఆఁ! ఇలా రాకండి జాగ్రత్తగా వెళ్ళండి కుక్కలుంటాయి చూసుకోండేం! అంది.

"ఏ జాతి పిల్లలో" అనుకుంది లోలోపల.

ఏడుస్తూ వస్తూన్న పిల్లల్ని తల్లి చూసింది, గుడిసెలోంచి బయటికొస్తూ. తల్లి ప్రాణం విలవిలలాడింది. కళ్ళు నీళ్ళతో నిండాయి. పిల్లలిద్దర్నీ అక్కున చేర్చుకుంది. మొగుడు రిక్షాలాగుతాడు. తాగుతాడు. తంతాడు. తను కొంచెం చదువుకుంది. పేదరికం వలన సంక్రమించిన సంస్కారమో, వైరాగ్యమో, మరి దేని వలననోగాని ఆమె గొంతు నుండి ఒక్క మాటా పెగలి రాలేదు. కన్నీళ్ళు జలజలా వాడిన చెక్కిళ్ళ మీద రాలుతూ వుంటే, దీనంగా విధాత కనబడతాడా అన్నట్లు శూన్యంలోకి చూస్తూ వుండిపోయింది. శూన్యంలో ఏముంటుంది?!

ఆ చిన్నారులిద్దరూ చిందించిన రక్తం వృథాపోలేదు.

ఆ సంఘటనను కథగా, అద్భుతంగా మలిచిన యువ రచయితకు పత్రికాఫీసు నుండి మంచి పారితోషికం అందింది.

యువతులను ధైర్యంగా అక్కడినుండి తప్పించిన ఆ వీర యువకుడికి చిరునవ్వు రువ్విన ఆ అమ్మాయి ప్రేమ లభించింది.

జరిగిన సంఘటనకు స్పందించిన ఎవరో ఒక వ్యక్తి వల్ల ఆ సెంటర్లో ఒక ట్రాఫిక్ కానిస్టేబుల్ని వేయడం కూడా జరిగింది.



ఆర్ ఎస్ శర్మ (1920-2011)

# అభ్యుదయ ఉద్యమానికి తీరని లోటు

- గుడిపూడి విజయరావు

ప్రాచీన భారత చరిత్రను కేవలం ఆయా ఘటనల క్రమం తెలుసుకోవడానికి మాత్రమే కాకుండా, ప్రాచీన చరిత్రగురించిన శాస్త్రీయ అవగాహనకున్న ప్రస్తుత ప్రాధాన్యతను సంపూర్ణంగా గుర్తించి, దాన్ని ఓ బృహత్తర కర్తవ్యంగా కడదాకా కొనసాగించిన విశిష్ట వ్యక్తి ఆరెస్ శర్మ. పూర్వ ఆర్యులు, ఇండో ఆర్యులు, గ్రీకులు, స్కైథియన్లు, హూణులు, తురుష్కులు ఇలా ప్రాచీన కాలంలో భారత దేశంలో ప్రవేశించినవారు దీన్నే స్వదేశంగా చేసుకొని ఇక్కడి సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక అభివృద్ధి క్రమంలో పాలుపంచుకున్నారని వారి ముద్ర ప్రతి అంశంలోను స్పష్టంగా కనిపిస్తుందని ఆయన చెప్పారు. ఇదే భారత దేశంలో నేటికీ కొనసాగుతున్న భిన్నత్వంలో ఏకత్వానికి పునాది అని వివరించారు.

అగ్రశ్రేణి భారతీయ చరిత్రకారుల్లో ఒకరైన ఆర్ ఎస్ శర్మ, సన్నిహితులు ఆరెస్‌గా పిలిచే రామ్ శరణ శర్మ తన 92వ ఏట పాట్నాలో కన్నుమూశారన్న వార్త అభ్యుదయకాముకులందరిని విచారంలో ముంచెత్తింది. భారత దేశ ప్రాచీన చరిత్రను శాస్త్రీయ దృక్పథంతో అధ్యయనం చేయడమే కాకుండా, భిన్నత్వంలో ఏకత్వం అనే భారత దేశ విశిష్టతను ధ్వంసం చేయడడానికి పూనుకున్న మతోన్మాదుల కుహనా వాదనలను ఆయన తన రచనల ద్వారా పటాపంచలు చేశారు. స్వయంగా కార్యరంగంలోకి సైతం దిగి వారి వాదనలను ఎండగట్టారు. అందువల్లనే ఆరెస్ శర్మను అభ్యుదయవాదులు ఎంతగా అభిమానిస్తారో, మతోన్మాదులు అంతకన్నా ఎక్కువ భయపడతారు. పుక్కిటి పురాణం స్థాయినుండి ప్రాచీన భారత చరిత్రను విముక్తి చేసిన ప్రముఖునిగా ఆయన పేరుగాంచారు.

బీహార్, బెగుసరాయ్ జిల్లాలోని బరౌనీ సమీపంలో ఓ పేదబ్రాహ్మణ కుటుంబంలో జన్మించిన ఆర్ఎస్ శర్మ అరా హెచ్‌డి జైన్ కాలేజీలో తన అధ్యాపక వృత్తిని ఆరంభించారు. లండన్ విశ్వవిద్యాలయంలో ఫెలోగా ఉంటూ ప్రఖ్యాత చరిత్రకారుడు ఎఎల్ భాషమ్ ఆధ్వర్యంలో డాక్టరేట్ పూర్తిచేశారు. ఆ తర్వాత పాట్నా విశ్వవిద్యాలయంలోను, ఢిల్లీ విశ్వవిద్యాలయంలోను, టొరొంటో విశ్వవిద్యాలయంలోను భారతప్రాచీన చరిత్ర, భారత తొలి మధ్యయుగాల చరిత్రలను అనేక దశాబ్దాలపాటు బోధించారు. 1985లో ఢిల్లీ విశ్వవిద్యాలయం నుండి పదవీవిరమణ పొంది పాట్నాలో స్థిరపడ్డారు. ఈ సుదీర్ఘ చారిత్రక అధ్యయనం, పరిశోధన, బోధన, కార్యాచరణల క్రమంలో ఆయన 115 పుస్తకాలు రచించారు. అవి 15 భాషల్లో ప్రచురితమయ్యాయి.

ప్రాచీన భారత చరిత్రను కేవలం ఆయా ఘటనల క్రమం తెలుసుకోవడానికి మాత్రమే కాకుండా, ప్రాచీన చరిత్రగురించిన శాస్త్రీయ అవగాహనకున్న ప్రస్తుత ప్రాధాన్యతను సంపూర్ణంగా గుర్తించి, దాన్ని ఓ బృహత్తర కర్తవ్యంగా కడదాకా కొనసాగించిన విశిష్ట వ్యక్తి ఆరెస్ శర్మ. పూర్వ ఆర్యులు, ఇండో ఆర్యులు, గ్రీకులు, స్కైథియన్లు, హూణులు, తురుష్కులు ఇలా ప్రాచీన కాలంలో భారత దేశంలో ప్రవేశించినవారు దీన్నే స్వదేశంగా చేసుకొని ఇక్కడి సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక అభివృద్ధి క్రమంలో పాలుపంచుకున్నారని వారి ముద్ర ప్రతి అంశంలోను స్పష్టంగా కనిపిస్తుందని ఆయన చెప్పారు. ఇదే భారత దేశంలో నేటికీ కొనసాగుతున్న భిన్నత్వంలో ఏకత్వానికి పునాది అని వివరించారు. భారత దేశంలో హిందూ, జైన, బౌద్ధ మతాలు, వాటికి సంబంధించిన రక రకాల సంప్రదాయాలు, అలవాట్లు, ఆచారాలు, జీవన విధానాలు నేటికీ కొనసాగుతున్నాయి. అయినప్పటికీ ప్రతి ఒక్కరిలోను భారత దేశం అంతా ఒక్కటే అన్న భావన ప్రగాఢంగా నాటుకొని ఉంటుంది. ఇదే సమయంలో ఇతర దేశాలలో లేని అనేక ప్రత్యేకతలు కూడ భారత దేశంలో ఉన్నాయి. అలాంటిది కులవ్యవస్థ. ఉత్తర భారతంలో మొదలయి, దేశమంతటికి కుల వ్యవస్థ వ్యాపించింది. ఆఖరికి కులాలంటే ఏమిటో తెలియకుండా భారత దేశంలో ప్రవేశించిన ముస్లిములు, క్రిస్టియన్లను కూడ అది ప్రభావితం చేసింది.

గతం ఏమిటో పూర్తిగా తెలుసుకోకపోతే, దానిపట్ల శాస్త్రీయ అవగాహన పెంచుకోకపోతే, గతాన్ని పునరుద్ధరించాలంటూ గతం గురించి అనేక అవాస్తవాలు, కట్టుకథలు ప్రచారం చేసేవారి దాడిని తిప్పికొట్టలేమని ఆరెస్ శర్మ లాంటి చరిత్రకారులు భావించారు. ప్రాచీన భారత దేశం వివిధ రంగాలలో అనేక రకాలుగా అభివృద్ధి

చెందినప్పటికీ, నేటి పురోగమనానికి అడ్డుపడే ఆనాటి అవశేషాలు ఇప్పటికీ మిగిలిఉన్నాయని వారు గుర్తించారు. క్రింది కులాల వారిని, ప్రత్యేకించి శూద్రులను, అస్పృశ్యులను వివక్షతకు గురిచేయడం, మహిళలపట్ల వివక్ష ప్రదర్శించే చట్టాలను, సూత్రాలను కొనసాగించడం జరుగుతున్నది. నేటికీ విద్యావంతుల్లో సైతం శారీరక శ్రమ పట్ల చిన్న చూపు, ఉమ్మడి ప్రయోజనం కోసం ఒక్కటిగా నిలబడకుండా అడ్డుకోవడం కులవ్యవస్థ దుష్ప్రభావం మూలంగానే అని చెప్పారు. ఈ ప్రతికూల అంశాలను నిర్మూలించాలంటే ప్రాచీనకాలంలో ఈ వ్యవస్థల ఆవిర్భావం, అభివృద్ధి, అవి నిర్వహించిన పాత్ర పట్ల శాస్త్రీయ అవగాహన అవసరం అని భావించారు.

ఇలాంటి అవగాహనను పెంపొందించుకోవడానికి వారికి దోహదపడినది చరిత్ర పరిశోధనలో వారు అనుసరించిన పద్ధతి. చరిత్రను వారు రాజుల, రాజ్యాల చరిత్రగా పరిగణించలేదు. ఉత్పత్తి శక్తుల అభివృద్ధి, దానికి అనుగుణంగా ఉత్పత్తి సంబంధాలు, వాటి ఆధారంగా ఏర్పడే సామాజిక, రాజకీయ, సాంస్కృతిక సంబంధాలు- అనే భౌతికవాద దృక్పథాన్ని తమ చరిత్ర పరిశోధనల్లో వారు అనుసరించారు. భారత దేశంలో ఈ తరహా విధానానికి ఆద్యుడు డిడి కోసంబి. ఆ తర్వాత దాన్ని అంతటి ఉత్కృష్టస్థాయికి తీసుకు వెళ్లిన చరిత్రకారుడు ఆరెస్ శర్మ. అందుచేతనే ఆయన మృతి పట్ల ఇంత పెద్ద ఎత్తున స్పందన వ్యక్తమవుతున్నది.













1980లలో సబాల్టర్న్ చరిత్రకారులంటూ వచ్చారు. భారత దేశ చరిత్ర పరిశోధనల్లో దిగువశ్రేణి తరగతులకు తగిన ప్రాధాన్యత లభించలేదని, వారి పాత్రను పూర్తిగా వెలికి తీయడమే తమ లక్ష్యమని వారు ప్రకటించారు. కాని ఆరెస్ శర్మ ఆ పని తన పరిశోధన తొలిదశలోనే ఆరంభించారు. 'ప్రాచీన భారతదేశంలో శూద్రులు' అనే గ్రంధాన్ని 1958లోనే ఆయన వెలువరించారు. అదే ఆయన పిహెచ్‌డి పరిశోధనాంశం కూడ. నేటికీ ఆ గ్రంథం భారతదేశంలో అణగారిన వర్గాల ఆవిర్భావం గురించి తెలుసుకోవడానికి ప్రామాణిక పునాదిగా పనిచేస్తున్నది. తర్వాత ఆయన 1965లో వెలువరించిన మరో ప్రధాన గ్రంథం 'భారత దేశంలో ఫ్యూడలిజం'. వేద యుగం, బుద్ధుని కాలం, తదుపరి దశలనుండి భారత దేశంలో ఫ్యూడలిజం ఎలా ఆవిర్భవించిందన్న అంశాలను ఆయన దీనిలో పరిశీలించారు. భారత దేశంలో ఫ్యూడలిజానికి, ఐరోపాలో ఫ్యూడలిజానికి ఉన్న వ్యత్యాసం ఏమిటి అన్న విషయాన్ని కూడ ఆయన దీనిలో వివరించారు. భారతదేశంలో ఫ్యూడలిజం గురించి భిన్నాభిప్రాయం కలిగిన హర్బన్స్ ముఖియాలాంటి చరిత్రకారులతో ఆయన చర్చకూడ నడిపారు. ప్రాచీన భారత ఆర్ధిక వ్యవస్థ గురించి కూడ ఆయన నిశితమైన అవగాహనతో కూడిన గ్రంధాలను ప్రచురించారు.

ఆరెస్ శర్మ రచనల్లో అత్యంత ప్రచారం పొందినది, అత్యంత వివాదాస్పదమయినది 1977లో ప్రచురించిన 'ప్రాచీన భారతదేశం'. ఎన్‌సిఆర్‌ఇటి చరిత్ర పాఠ్యగ్రంథంగా రాసిన ఈ పుస్తకంలో ఆయన ప్రాచీన భారత చరిత్రపై తన పరిశోధనల సారాంశాన్నంతటినీ క్రోడీకరించారు. విద్యార్థులనుద్దేశించి రాసినప్పటికీ ఎంతో సులభశైలిలో ఉన్న ఈ పుస్తకం ప్రతి ఒక్కరికి అర్థమయ్యే రీతిలో ఆకట్టుకునే రీతిలో ఉంది. హిందూ మతోన్మాదులు దీనిపై సహజంగానే విరుచుకుపడ్డారు. అప్పటిదాకా వారు ప్రచారం చేస్తున్న కట్టుకథల బండారాన్ని ఈ పుస్తకం ఎత్తి చూపుతున్నది. భారతదేశంలో లౌకికతత్వం ఎలా వేళ్లూనుకొని ఉన్నది, భిన్నమతాలవారు, భిన్నకులాలవారు ఈ దేశ చరిత్రలో ఎంతటి పాత్రను నిర్వహించినది వెల్లడించే ఈ గ్రంథం పరమతద్వేషాన్ని నూరిపోసే వారికి మింగుడుపడలేదు. ఆనాటి జనతా ప్రభుత్వ హయాంలో మానవవనరుల శాఖను నిర్వహిస్తున్న వారి ప్రతినిధులు ఈ గ్రంధాన్ని 1978లో నిషేధించారు. ఈ చర్యకు మేధావి వర్గంలోనే కాకుండా, దేశవ్యాపితంగా అభ్యుదయ వాదులనుండి కూడ తీవ్ర నిరసన వ్యక్తమయింది. 1980లోనే ఈ పాఠ్యగ్రంథాన్ని పునరుద్ధరించాల్సి వచ్చింది. కొన్ని లక్షల ప్రతులు ఇప్పటి వరకు ఒక్క ఇంగ్లీషులోనే కాకుండా అనేక ఇతర భాషానువాద గ్రంధాలు సైతం ప్రచురించబడినాయి. 2001లో ఈ గ్రంథాన్ని రచయిత అనుమతి తీసుకోకుండానే ఎన్‌సిఆర్‌టి కొన్ని అంశాలను మినహాయించి ప్రచురించింది. చివరకు 2002లో పూర్తిగా ఉపసంహరించింది. ఆ తర్వాత ఇదే గ్రంథాన్ని రచయిత విస్తరించి, సవరణలతో, తాజా సమాచారం, అభిప్రాయాలతో కూడిన ప్రతిని 'భారత దేశపు ప్రాచీన గతం' (ఇండియాస్ ఏన్షియంట్ పాస్ట్) అనే పేరుతో 2005లో వెలువరించారు. ప్రాచీన భారత దేశంపై ఆరెస్ శర్మ పూర్తి అవగాహనను ప్రతిబింబించే ఈ గ్రంథం ప్రస్తుతం అందుబాటులో ఉంది.

ఆరెస్ శర్మ కార్యాచరణ గురించి చెప్పుకోవాలంటే ఆయన 1975లో స్థాపించిన 'ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ హిస్టారికల్ రీసెర్చి' (ఐసిహెచ్‌ఆర్) తొలి అధ్యక్షుడు. దాన్ని ఆయన కేవలం ఒక చరిత్ర పరిశోధకుల సంఘంగా మాత్రమే నడపలేదు. ఎమర్జెన్సీకి వ్యతిరేకంగా ఆ సంస్థ చేత తీర్మానం చేయించారు. 1986 నుండి వరుసగా ప్రతి సంవత్సరం బాబ్రీమసీదు పరిరక్షణపై ఈ సంస్థ తీర్మానాలు చేస్తూ వచ్చింది. బాబ్రీ కూల్చివేతను తీవ్రంగా ఖండిస్తూ తీర్మానించింది. 1993లో ఆనాటి కేంద్ర ప్రభుత్వం బాబ్రీనేలమట్టం అయిన ప్రదేశంలో ఆలయం ఉందన్న విషయాన్ని కనిపెట్టడదానికి పరిశోధనకు ఆదేశించడాన్ని ఇండియన్ హిస్టరీ కాంగ్రెస్ గట్టిగా వ్యతిరేకిస్తూ తీర్మానం చేసింది. మతోన్మాదానికి వ్యతిరేకంగా ఆరెస్ శర్మ చివరి వరకు క్రియాశీల పాత్ర నిర్వహించారు. అనేక సెమినార్లలో, చర్చల్లోను పట్టుదలతో పాల్గొనే వారు. మొట్టమొదటి నుండి ఆయనకు రాజకీయ నాయకులతో, రైతు ఉద్యమ నాయకులతో సన్నిహిత సంబంధాలుండేవి. జనజీవనం గురించి వారి ద్వారా తెలుసుకునే అంశాలు ఆయన పరిశోధ నాంశాలను ఎంచుకోవడంలోను, అవగాహనను పెంపొందించుకోవడంలోను దోహదపడేవి. చివరి వరకు ఆయన దీన్ని కొనసాగించారు.

సామాజిక అవగాహనతో మేధోకృషిని మేళవించి క్రియాశీల జీవనం గడిపిన ఆరెస్ శర్మ లాంటి విశిష్ట వ్యక్తి మరణం అభ్యుదయ ఉద్యమానికి తీరని లోటు. ఆయన బాటలో పరిశోధనలను, కార్యకలాపాలను ముందుకు తీసుకుపోవడమే ఆయనకు నిజమైన నివాళి.

# కొమరం భీముడు!

- కమలేకర్ డాగోజీరావు



ఓ గోండు భీమ వీరుడా!
గిరిజన హక్కులు పోరాట యోధుడా!
నిరంకుశ నైజాం పాలకులకు
ఎదురొడ్డి పోరాడినావు
నీ ధైర్యంతో, నీ త్యాగంతో,
తెలుగు జాతికి స్ఫూర్తినిచ్చావు!

జాగీరు దారులు, జామీనుదారులు
పోలీసులు, రజాకారులు,
గూండాలు, భూస్వాములు
దేశముఖులు, అధికారుల
మేకపుల్లరి పన్నులకు,
ఎదురు తిరిగి పోరాడలేని
నీ జాతిని మేల్కొలిపిన,
నీవు వైతాళికుడవు!

జంగల్, జల్, జమీన్ హమారా"
గోండు ఆదివాసుల
పోరాట నినాదంతో
ప్రజలను ఉత్తేజపరిచినావు.
పాలకుల గుండెల్లో, నగారా మోగించి,
గడగడ లాడించినావు.
గుట్టలను సైన్యం చుట్టు ముట్టినా,
చివరి రక్తం బొట్టు వరకు
పోరాడిన వీర మరణం పొందినావు
వీర మరణంతో అమరుడవైనావు!

గోండు భీమ కొమరం
నీ ధైర్యమే సమరం
నీ త్యాగమే అమరం
తెలుగు జాతి జనాళి
ఇస్తున్నది నివాళి!

# పిలుపుల గంట

- రాజేశ్వరి దివాకర్ల



పిలుపుల గంట మోగుతుంది
అందరూ కార్యావృతులై
కదలి వెళ్ళాక
నాకు మిగిలిన ఏకాంతం,
నగరంలో ఉదయం
బాహువులు లేని సర్పం
ఎప్పుడు కబళిస్తుందో తెలియని భయం
ఎవరు వచ్చారో ఆతురత కలుగుతుంది.
భద్రతల మాయా దర్పణంలోంచి
తొంగి చూసి కాని
తలుపులు తెరువలేని కాలం
ఒక ఆకారం కనిపిస్తుంది
ఒక నివేదనల తాపత్రయం
అనిపిస్తుంది
నా వంతు సహకారం
అందివ్వాలనిపిస్తుంది.
అభ్యర్థనలో నిజం ఉందో లేదో
భ్రమ చేసి నను బంధించే నెపమో
కలవరం కలుగుతుంది
గూఢ నిశ్శబ్ధం ఆవహిస్తుంది.
బదులు పలుకని మౌనానికి
మోగి మోగి పిలుపుల గంట ఆగిపోతుంది

తీరు బడిగ స్నానమాడే సమయం
దూరవాణి మోగుతుంటుంది
పిలుపుల మోతట
అదే పనిగా పురమాయిస్తుంటుంది.
ఒంటిమీద సబ్బు నురగ
నీటితో మేలమాడుతుంటుంది.
ఉత్కంఠ పెరుగుతుంటుంది
కలతల జలకాలకు
తొందర తోడవుతుంది.
అతలాకుతలంగా అయిందనిపించి
పాదాల తడితో నడచి వచ్చి
అందుకునే సరికి
సంఖ్య తెలియని సద్దు
సందిగ్ధమై నిలిచిపోతుంది
పగలు గుబులుగా గడచిపోతుంది.

మధ్యాహ్నం పూట తిరగేసే దినపత్రికలో
అత్యాచారాలు, అపఘాతాలు
తెలియకుండానే భుజాన
కొంగు పరచుకుంటుంది
నలత మూలకు ఒదిగి కునుకు పడుతుంది

పిలుపుల గంట మోగుతుంది
నా వాళ్ళందరూ తిరిగి ఇంటికి చేరిన
సంక్షేమ సంధ్యలో
ముంగిట దీపం వెలుగుతుంది.

# రైతు నానీలు

- మేరెడ్డి యాదగిరిరెడ్డి



మేఘ మథనానికి
వందలకోట్లు
అక్కడక్కడా
చిరుజల్లులు.

శాసనసభలో
వ్యవసాయంపై చర్చ
ఉరుములు మెరుపులు
పిడుగుపాట్లు

రైతులకు
ఎరువుల కొరత
మిక్సింగ్ ప్లాంట్లలో
భారీగా నిల్వలు

వ్యవసాయమొక
తీరని దాహం
ఎదురుచూపుల
ఎండమావులు

జడివాన
ఎంతకష్టం ఎంత నష్టం
మొసలి కన్నీటితో
తడిసిన పంట పొలం

వర్షం
పంటకు ప్రాణం
అధిక వర్షం
రైతుకు ప్రాణ సంకటం

# ప్రసార మాధ్యమాలు : ప్రభావం

- డాక్టర్ నాగసూరి వేణుగోపాల్




టెలివిజన్ వచ్చేదాకా రేడియో ఒకటి మాత్రమే ప్రసార సాధనం. నిజానికి టెలివిజన్ వచ్చేదాకా మీడియా అనే పదాన్ని పత్రికా రంగానికి మాత్రమే వాడేవారు. టీవీ వంటి బలోపేతమైన సాధనం రావడంతో మీడియా అనే పదానికి విశేషణాలు అవసరమయ్యాయి. ప్రస్తుతం పత్రికా రంగాన్ని ప్రింట్ మీడియా అని పరిగణిస్తుండగా, రేడియో, టెలివిజన్‌ను ఎలక్ట్రానిక్ మీడియా అని వ్యవహరిస్తున్నాం. ప్రస్తుతం మనం ప్రసార మాధ్యమాలు అంటే రేడియో, టెలివిజన్లుగా పరిగణించాలి లేదా ఇంకా పూర్తిగా చెప్పుకోవాలంటే సినిమా, ఇంటర్నెట్ వంటి వాటిని కూడా ఇందులో చేర్చుకోవాలి.

**సిం**హాచలము.. మహా పుణ్యక్షేత్రము – అనే అక్షరాలు ఆర్టీసీ బస్సుపై చాలా ప్రస్ఫుటంగా కనపడతాయి. సింహాచలం వెళ్ళే బస్సులు కనుకనే అనుకుని మనం పట్టించుకోకపోవచ్చు. కానీ ఆ రెండు మాటలు ఎక్కడివో అని ఒక్కసారి పరికిస్తే మాధ్యమాల ప్రభావం ఎంతటిదో బోధపడుతుంది. సింహాచల మహాత్మ్యం సినిమాలో ఘంటసాల పాడిన గీతం పల్లవి అది. కానీ ఆ విషయం బస్సు పైన ఎక్కడా కనబడదు. అట్లని దీనికి స్ఫూర్తి ఆ చిత్రగీతం కాదని మనం చెప్పగలమా? నిజానికి ప్రసార మాధ్యమాల ప్రభావం ఇలాగే నిగూఢంగా, దృఢంగా ఉంటుంది.

విరివిగా వాడబడే పదాలు తరచుగా వేరే అర్థ ఛాయలకు దారితీసే రీతిలో ఉపయోగించడం సహజం కావచ్చు. అటువంటి పదమే సంస్కృతి. దీని గురించి నిఘంటువులు, పండితులు ఏమని వివరిస్తారో ఎంతోమందికి తెలియకపోవచ్చు. కానీ, ఈ పదాన్ని మాత్రం చాలా విస్తృతంగా వాడుతున్నాం. ఒక సమాజపు భాషను, వేషాన్ని, ఆలోచనను, ప్రవర్తనను స్థూలంగా చెప్పాలంటే నాగరికతను లేదా జీవనశైలిని వివరించేది సంస్కృతి. అదే సమయంలో ఈ సంస్కృతి అనేది ఒక చోట ప్రత్యేకంగా దొరుకుతుందని, అధ్యయనం చేయవచ్చని కూడా మనం చెప్పలేం. అంటే పరిశీలకుడి భావనా విస్తృతిని బట్టి, చూపు నైశిత్యాన్ని బట్టి బోధపడే విషయాలు మరింత లోతుగా ఉండవచ్చు. మరి అటువంటి సంస్కృతి గురించి, దాని మీద ప్రసార మాధ్యమాల ప్రభావం గురించి వివరించడమనేది చాలా కష్ట సాధ్యం. సంస్కృతికి సంబంధించి దాని ఆనవాలును గుర్తించడం ఎంత కష్టమో, ప్రసార మాధ్యమాల వేగాన్ని, ప్రభావాన్ని గుర్తించడం మరింత సంక్లిష్టం. అయినా కష్టమని, సంక్లిష్టమని మనం పరుగు లంకించుకుంటే అది భావ్యం కాదు. అంతకుమించి వర్తమాన సమయంలోనే ఈ గతిశీలమైన కోణాలను గుర్తించకపోతే, ముందు ముందు ఈ విషయాలు బోధపడవు లేదా అధ్యయనం చేయాలనుకునే వారికి ఇప్పటి పరిస్థితి అర్థం కాదు. అందువల్ల మనం కష్టమైనా లేదా మనం చేపట్టిన పని అసంపూర్తి అయినా ముందుకు సాగక తప్పదు.

మీడియా అనే పదాన్ని మనం తెలుగులో మాధ్యమం అని వాడుకుంటున్నాం. మాధ్యమం అంటే ఇక్కడ మధ్యన ఉండేది అని పరిగణించాలి. చెప్పేవారికి దాన్ని అందుకునే వారికి మధ్యన ఉండే ప్రసార సాధనం ఈ మాధ్యమం. ఇది అప్పటికప్పుడే అంటే చెప్పినది చెప్పినట్లే ఎక్కువ మందికి చేరగలిగిన దాన్ని ప్రసార సాధనం అని అంటాం. టెలివిజన్ వచ్చేదాకా రేడియో ఒకటి మాత్రమే ప్రసార సాధనం. నిజానికి టెలివిజన్ వచ్చేదాకా మీడియా అనే పదాన్ని పత్రికా రంగానికి మాత్రమే వాడేవారు. టీవీ వంటి బలోపేతమైన సాధనం రావడంతో మీడియా అనే పదానికి విశేషణాలు అవసరమయ్యాయి. ప్రస్తుతం పత్రికా రంగాన్ని ప్రింట్ మీడియా అని పరిగణిస్తుండగా, రేడియో, టెలివిజన్‌ను ఎలక్ట్రానిక్ మీడియా అని వ్యవహరిస్తున్నాం. ప్రస్తుతం మనం ప్రసార మాధ్యమాలు అంటే రేడియో, టెలివిజన్లుగా పరిగణించాలి లేదా ఇంకా పూర్తిగా చెప్పుకోవాలంటే సినిమా, ఇంటర్నెట్ వంటి వాటిని కూడా ఇందులో చేర్చుకోవాలి. ఎందుకంటే టెలివిజన్ ద్వారా సినిమా మాధ్యమం చాలా సులువుగా, విరివిగా చేరుతోంది. అలాగే ఇంటర్నెట్ ద్వారా టెలివిజన్ చూడగలుగుతున్నాం. లేదా ఇంటర్‌నెట్‌లో భద్రపర్చబడిన టెలివిజన్ కార్యక్రమాలు పొందగలుగుతున్నాం. ఇలా పరిగణించినప్పుడు ప్రసార మాధ్యమాలు అనే దాని నిర్వచనం విస్తృతమైనా అది వాస్తవిక పరిస్థితికి దర్పణమే అవుతుందని ఒప్పుకోవాలి.

ఒకరకంగా చూసినప్పుడు మాధ్యమాలనేవి చాలా బ్యాలెన్స్‌డ్‌గా, క్రియాశీల రహితంగా ఉండాలి. ఎందుకంటే అందుకున్నది అందివ్వడమే దాని పని కనుక. అలాంటప్పుడు ప్రసార మాధ్యమాల ప్రభావం తక్కువే ఉంటుంది. అయితే అందించే క్రమంలో వస్తువులో గాని, దాని శిల్పంలో గాని మార్పులకు ప్రసార మాధ్యమాలు కారణమవుతున్నాయి. కేవలం ఈ కోణంలోనే మనం ప్రసార మాధ్యమాల ప్రభావాన్ని పరిగణించి పరిశీలించాలి. ఈ ప్రభావాలు ప్రయోజనాత్మకంగా ఉన్నంత కాలం విమర్శలకు అవకాశం ఉండదు. కేవలం గౌరవం, ప్రతిష్ట మాత్రమే మాధ్యమాలకు దక్కుతాయి. అయితే ఈ పరిస్థితిలో మార్పు లేకపోతే చర్చకు పెద్దగా అవకాశం ఉండదు. ప్రసార మాధ్యమాల ప్రవర్ధమానమైన తీరును జాగ్రత్తగా గమనిస్తే మనం ఎంతో కొంత వాటి ప్రభావాన్ని కూడా గుర్తించడం కష్టం కాకపోవచ్చు. ప్రస్తుతం మనం అదే పని చేద్దాం.

ప్రసార మాధ్యమాల అసలైన బలం ఏమిటంటే అవి నిరక్షరాస్యులను కూడా సులువుగా చేరగలగడం. అంతేకాకుండా వారు

ఎటువంటి ప్రయత్నం లేకుండా ఈ మాధ్యమాలు వారిని అందుకోగలవు. కొంగ్రొత్త సాంకేతిక విజ్ఞానం మరింత మేళవించడంతో రేడియో, టెలివిజన్ ఛానళ్ళు చాలా విరివిగా మనకు అందుబాటులోకి వచ్చాయి. ఇలా రాకముందు సైతం ప్రసార మాధ్యమాలను గమనించిన వారు అందుకున్న విషయాలను ఇతరులతో పంచుకోవడం బాగా ఉండేది. నేడు ఇలా పంచుకోవడం తగ్గిపోయి నేరుగా అనుభవంలోకి రావడం పెరిగి ఉండవచ్చు. ఈ విషయాన్ని పరిగణనలోకి తీసుకున్నప్పుడు ప్రసార మాధ్యమాల ప్రభావం ఎప్పటికీ తక్కువలేదు.

టీవీ రాకముందు రేడియో చరిత్ర ఉండేది. అందులో కేవలం మాటలు మాత్రమే ప్రధాన వాహకం. అందువల్ల రేడియో ప్రసార సాధనం కారణంగా తొలుత ప్రభావానికి లోనైంది భాష. ఒక యంత్రం ద్వారా మాట గాని, పాట గాని రావడమనేది మొదట్లో ఒక ఆశ్చర్యకరమైన విషయమే. అప్పట్లో అదే ఆకర్షణకు కారణం. ఏకకాలంలో ఎక్కువ మందిని చేరడం వల్ల క్రమంగా అటువంటి భాష స్థిరపడటం లేదా అలా మాట్లాడటం ఒక ఉన్నతమైన స్థాయి అని భావించే పరిస్థితి కూడా ఏర్పడింది. తద్వారా ఒక రకమైన భాష మెరుగైన స్థానాన్ని పొందడం అన్నది ఒక రకమైన కోణం కాగా, ఎక్కువమందిని అందుకోగలిగే స్థాయిలో భాష వ్యాపించిందనేది మరో కోణం. భాష నేపథ్యంలో ఉండే భావాలు మరింత బలవత్తైనవీ, ప్రభావవంతమైనవి. ఉపాధ్యాయుడు చెప్పే పాఠం ఒకటే అయినా వేర్వేరు విద్యార్థులు రకరకాల స్థాయిల్లో మార్కులు తెచ్చుకున్నట్లే – ప్రసార మాధ్యమాలు ప్రసారం చేసే ఒకే కార్యక్రమాన్ని వివిధ శ్రోతలు వారి హృదయ సంస్కారాన్ని బట్టి అందుకుంటారు. అంతేకాదు. క్రమంగా ఆ సంస్కార స్థాయిని కూడా ఇటువంటి కార్యక్రమాలు ప్రభావితం చేయవచ్చు. ఆకాశవాణి శాస్త్రీయ లలిత సంగీతాల ద్వారా చేసిన కృషి విశేషమైనది. నిజానికి ఇటువంటి కృషిని ఖరీదు కట్టే షరాబులు ఇంకా రాలేదు. ప్రభుత్వ యాజమాన్యంలో నడిచేది కనుక చేసిన కృషిని ఉగ్గడించే ప్రయత్నాలు కూడా పెద్దగా ఉండవు. అందుకే ఆకాశవాణి సంస్కృతిపరంగా చేసిన సేవను బేరీజు వేసే పరిశోధన కూడా తెలుగునాట పెద్దగా జరగలేదు లేదా జరిగిన పరిశోధన అందరికీ అందుబాటులోకి రాలేదు.

మంచి కన్నా చెడుకే ఆకర్షణ ఎక్కువ, హడావుడి ఎక్కువ, ప్రచారం ఎక్కువ, చర్చ కూడా ఎక్కువే. ఎఫ్.ఎం. రేడియోలు ఉపగ్రహ టీవీ ఛానళ్ళు రావడం కారణంగానే తెలుగు సంస్కృతిపై ప్రసార మాధ్యమాల ప్రభావం అని మనం ఇక్కడ చర్చించుకుంటున్నాం అని నేరుగా గుర్తించడంలో దోషమేమీ లేదు. రేడియో కన్నా టీవీ దృశ్య మాధ్యమం కావడంతో ప్రభావం చాలా రెట్లు ఎక్కువ. కార్యక్రమం చివర యాంకర్ డ్రస్ కర్టెసీ, జ్యూయలరీ కర్టెసీ వగైరా పేర్లు వాటి వెనుక చిరునామాలు ఎందుకు బుల్లితెరపై కనబడుతూ వుంటాయో మీరు గమనిస్తే, దృశ్య మాధ్యమం ప్రభావం ఎంతటిదో సులువుగా తెలుస్తుంది. కొన్ని దశాబ్దాల క్రితం వాణిశ్రీ చీర అని ఎంత ప్రచారంలో ఉండేదో, ఇప్పుడు ఫలానా యాంకర్ డ్రస్ అని మార్కెట్లో ఉండకపోయినా ధరించే యువత దృష్టిలో తప్పక వుంటుంది. ఎటొచ్చి అప్పట్లో వాణిశ్రీ ఒక్కర్తే అంతటి కథానాయిక కావచ్చు. ఇప్పుడు లెక్కకు మించిన యాంకర్లు అభిమానుల అభిరుచులను బట్టి వారి మనస్సులను ప్రభావితం చేస్తున్నారు. ఆ మధ్య శోభా డే అనే ఆంగ్ల రచయిత్రి, కాలమిస్టు ఒక టీవీ కార్యక్రమాన్ని పేర్కొంటూ ఇలా అభిప్రాయపడ్డారు. ఆ చర్చా కార్యక్రమంలో పాల్గొన్న ఫలానా మహిళ వ్యాఖ్యాత్రి అభిప్రాయాల కన్నా ఆవిడ ధరించిన జూకాలే మరింత ఊగుతూ ఎక్కువగా ఆకర్షించాయని. ఈ చిన్న విషయాన్ని గమనిస్తే టీవీ తెరపై కనిపించే ప్రతి చిన్న విషయం చాలా ప్రభావవంతమైందని మనం తెలుసుకోవచ్చు. దీనికి కేవలం కార్యక్రమాలే కానక్కర్లేదు. ఉదాహరణకు టూత్‌పేస్ట్ ప్రకటన గమనిస్తే బ్రష్ నిండుగా పేస్టు వేసుకోవాలనే అభిప్రాయాన్ని చెప్పకుండానే చూపిస్తూ తద్వారా తమ సరుకు ఎక్కువ వినియోగించుకునేలా ప్రేరేపించడం.

పార్లమెంట్‌లో, అసెంబ్లీలో ప్రవేశిస్తున్న తమిళ నాయకుల్ని పరిశీలిస్తే వారు ధరించిన తెల్లని చొక్కా, తెల్లని పంచె, భుజాన వేసుకున్న వస్త్రం గమనించవచ్చు. దీని ఆధారంగా ఎవరూ చెప్పకుండానే ఆయా వస్త్రాలు తమిళనాడు సంస్కృతి అని మనకు బోధపడుతుంది. కానీ, ఆ స్థాయిలో తెలుగువారు ధరించే దుస్తుల గురించి మనం చెప్పగలమా? అంతేకాదు. మన తెలుగు న్యూస్ రీడర్లు, యాంకర్లు ధరించే దుస్తులు ఎక్కడవి? అవి ఆంధ్రప్రదేశ్ వాతావరణానికి గాని, సంస్కృతికి గానీ దర్పణాలా? అనే సందేహాలు తొలుత వచ్చేవి. ఇప్పుడు అటువంటి పరిస్థితి రాకుండా మనం అలవాటుపడ్డాం. ఇక భాష గురించి మాట్లాడటం ఇంకా బాధాకరమైన అంశం. భాషకు సంబంధించి, వేషానికి సంబంధించి ప్రసార మాధ్యమాల పోకడలను పరిశీలించి వివరించడానికి మన మేధావులు ఆసక్తి చూపడంలేదు.

తెలుగు టెలివిజన్ పరిణామక్రమాన్ని గమనిస్తే తొలుత ఎక్కువగా సినిమాలు, తర్వాత సినిమా ఆధారిత కార్యక్రమాలు, పిమ్మట సీరియళ్ళు, తరువాత రకరకాల షోలు, మరోవైపు వార్తా కార్యక్రమాలు ఇలా విభిన్న దశలను గుర్తించవచ్చు. ప్రతి దశలోనూ ప్రచారంలోకి వచ్చిన భాషలో చాలా పోకడలున్నాయి. యాంకర్లు మాట్లాడే దానిలో ఇంగ్లీషు పదాలు ఎక్కువగా ఉంటే సీరియళ్ళ భాషలో అర్థరహితమైన అనువాద రీతులు దర్శనమిస్తాయి. సీరియళ్ళలో లైంగిక ప్రవృత్తికి సంబంధించిన ధోరణులే, లేదా వ్యక్తిగత కీచులాటలే ప్రధాన కథా వస్తువు కనుక అందులో వినియోగించబడిన భాష కూడా దానికి తగిన రీతిలో కొంత జుగుప్సాకరంగా మారింది. రకరకాల షోలు రావడంతో ఉన్న ఫళంగా మాట్లాడటం కనుక కొంత క్రమశిక్షణలేని భాష మనకు తారసపడుతుంది. వార్తల విషయానికి వస్తే ముఖ్యంగా ప్రత్యక్ష ప్రసారాలు రావడంతో రాష్ట్రంలోని అన్ని ప్రాంతాల పలుకుబడులు, ప్రాంతీయాలు పెద్ద స్థాయిలో గౌరవానికి నోచుకుని గుర్తింపు పొందాయి. ఇది చాలా అర్థవంతమైన, ఆహ్వానించదగిన ప్రజాస్వామ్య పోకడ. నిజానికి ఈ పరిణామాలను అధ్యయనం చేయాల్సిన అవసరం ఎంతో ఉంది. కానీ, ప్రసార మాధ్యమాలకు ప్రసారం చేయడం తప్ప, ప్రసారం చేసిన దాన్ని ఒక్క క్షణం కూడా పరిశీలించుకునే తీరిక ఉండదు కనుక వాటి నుండి ఎటువంటి అధ్యయనాన్ని మనం ఆశించలేం. మరోవైపు ఈ ప్రసార మాధ్యమాల వేగాన్ని గుర్తించలేని సమాజం దానికి

**ప్రసార మాధ్యమాలు ప్రసారం చేసే ఒకే కార్యక్రమాన్ని వివిధ శ్రోతలు వారి హృదయ సంస్కారాన్ని బట్టి అందుకుంటారు. అంతేకాదు. క్రమంగా ఆ సంస్కార స్థాయిని కూడా ఇటువంటి కార్యక్రమాలు ప్రభావితం చేయవచ్చు. ఆకాశవాణి శాస్త్రీయ లలిత సంగీతాల ద్వారా చేసిన కృషి విశేషమైనది. నిజానికి ఇటువంటి కృషిని ఖరీదు కట్టే షరాబులు ఇంకా రాలేదు. ప్రభుత్వ యాజమాన్యంలో నడిచేది కనుక చేసిన కృషిని ఉగ్గడించే ప్రయత్నాలు కూడా పెద్దగా ఉండవు. అందుకే ఆకాశవాణి సంస్కృతిపరంగా చేసిన సేవను బేరీజు వేసే పరిశోధన కూడా తెలుగునాట పెద్దగా జరగలేదు లేదా జరిగిన పరిశోధన అందరికీ అందుబాటులోకి రాలేదు.**

సంబంధించిన పరిశోధన అవసరమని గమనించలేకపోవడం విషాదం.

సంగీతానికి సంబంధించి, నృత్యానికి సంబంధించి, జానపద సంగీతానికి సంబంధించి తెలుగు ఛానళ్ళు చేసిన, చేస్తున్న కృషి గణనీయం. అశ్లీలమైన గీతాలకు, అర్థం తెలియని పిల్లలతో నృత్యం చేయిస్తున్నారనే విమర్శ అటు ఛానళ్ళ మీద, ఇటు పిల్లల తల్లిదండ్రుల మీదా చాలా ఉంది. కానీ పిల్లల్లో నిగూఢంగా ఉండే నైపుణ్యాన్ని వెలికితీయడానికి టీవీ ఛానళ్ళు కల్పించిన వేదిక సాటిలేనిది. ఈ వెసులుబాటు లేకపోతే ఆ పిల్లల ప్రతిభ బయల్పడి ఉండేది కాదు. ఇది కేవలం నృత్యం విషయంలోనే కాదు. గానం విషయంలో కూడా ఎంతో నిజం. వీరి అద్భుత ప్రతిభను గమనించి స్ఫూర్తి చెందిన బుడతలు మరెంతో మంది ఉన్నారు. అదే రీతిలో చిత్రకళ గురించి, శిల్పకళ గురించి లేదా మరో కళ గురించి ఎందుకు ప్రయత్నం జరగడం లేదు అని కూడా మనకు కొంత ఆలోచిస్తే అనిపించవచ్చు.

వాణిజ్య కారణంగా, పోటీ కారణంగా ఎఫ్.ఎం. ఛానళ్ళు, టెలివిజన్ ఛానళ్ళు రకరకాల పోకడలు పోతున్నాయన్నది వాస్తవమే. అయితే అదే సమయంలో ఈ వైవిధ్యం తెరిచిన తలుపులను కూడా మనం గమనించాలి. భక్తి పేరున, ఆరోగ్యం పేరున, వంటకాలు పేరున ప్రసారమవుతున్న కార్యక్రమాలు గమనిస్తే వాటి ప్రభావం ఎంతో కొంత బోధపడుతుంది. తాత్విక అర్థాన్ని, సామాజిక పరమార్థాన్ని వివరించలేకపోయినా భక్తి సంబంధమైన ఆధ్యాత్మిక సంబంధమైన కార్యక్రమాలు ఎంతో కొంత పరిచయాన్ని కలిగిస్తున్నాయి. ఫలితంగా ఆసక్తి వున్నవారు అధ్యయనం వైపు మొగ్గవచ్చు లేదా కేవలం ఆచారప్రాయంగా అనుకరణతో మిగిలిపోవచ్చు. రకరకాల పండుగల నేపథ్యంలో ఆ పండుగ వెనుక ఉండే ఆచారాలు, పద్ధతులు కూడా విరివిగా ప్రచారంలోకి వస్తున్నాయి. సంక్రాంతి ముగ్గులు ఈ దశాబ్ద కాలంలో విపరీతమైన ప్రచారంలోకి వచ్చాయి. గతంలో వీటి గురించి మాట్లాడుకోవడం, అభివృద్ధి నిరోధకత్వం అని భావించే పరిస్థితి ఉండేది. ఇప్పుడు రంగుల ప్రసారాల కారణంగా లెక్కకు మించిన ప్రత్యక్ష ప్రసారాల కారణంగా నిత్య వైవిధ్యంగా, వర్ణ శోభితంగా మారింది.

వస్తు సముదాయం, సమాచార పంపిణీ అనేవి విపరీతంగా పెరిగిపోయి వాటిని వివరించడం గానీ, అందులోని అంతరార్ధాన్ని వింగడించడం గాని లేకపోవడంతో ఆచారాలు మాత్రమే మిగిలిపోయి అర్ధాలు అదృశ్యమయ్యే పరిస్థితి మరింత పెరిగే అవకాశం చాలా ఉంది. ఈ లెక్కన పరిశీలిస్తే ప్రసార మాధ్యమాల సాంస్కృతిక పరమైన ప్రభావం చాలా విశేషమైనది. చాలా సందర్భాల్లో అవాంఛనీయమైనది కూడా. నియంత్రించడానికి సాధ్యం కాని రీతిలో ఒక వెల్లువలా రావడంతో ఆందోళన కలిగిస్తోంది.

అలాగే వంటా - వార్పూ అనేవి సైతం మనకు అవసరం లేదు అని ఎంతోమంది భావించేవారు. కానీ, నేడు రకరకాల ప్రసార మాధ్యమాల విభిన్న కార్యక్రమాల కారణంగా ఆంధ్రప్రదేశ్‌లో ఎన్ని రకాల వంటకాలున్నాయో బోధపడుతోంది. అంతేకాదు చాలాసార్లు ఎంతో ఆశ్చర్యానికి గురిచేస్తోంది. ఆయుర్వేదం వంటి అంశాలు ఇటువంటి వంటకాల ఆరోగ్య కోణాలను కూడా స్పృశిస్తున్నాయి. పోటీ విపరీతంగా పెరిగిపోవడంతో మండల స్థాయి దేవాలయమైనా వార్తాంశంగా మారిపోయింది. కొంత పెద్ద దేవాలయమైతే అది తరచూ ప్రత్యక్ష ప్రసార అంశంగా మిగిలిపోతుంది. అంటే అక్కడ సాగే ప్రతి తంతు వీక్షకుల దృష్టి నుంచి తప్పుకునే అవకాశం లేదు.

వస్తు సముదాయం, సమాచార పంపిణీ అనేవి విపరీతంగా పెరిగిపోయి వాటిని వివరించడం గానీ, అందులోని అంతరార్ధాన్ని వింగడించడం గాని లేకపోవడంతో ఆచారాలు మాత్రమే మిగిలిపోయి అర్ధాలు అదృశ్యమయ్యే పరిస్థితి మరింత పెరిగే అవకాశం చాలా ఉంది. ఈ లెక్కన పరిశీలిస్తే ప్రసార మాధ్యమాల సాంస్కృతిక పరమైన ప్రభావం చాలా విశేషమైనది. చాలా సందర్భాల్లో అవాంఛనీయమైనది కూడా. నియంత్రించడానికి సాధ్యం కాని రీతిలో ఒక వెల్లువలా రావడంతో ఆందోళన కలిగిస్తోంది.

# అవునేమో

- బి. ఇందిర



ఖచ్చితంగా వీడు
పీసీ సర్కారు
తాతై ఉంటాడు!
కాకపోతే-
ఇన్ని గమ్మత్తులు
ఎలా చేయగలడు!
అందర్నీ
తన చుట్టు తిప్పుకున్నే
కనికట్టెలా చేస్తాడు!
ఎన్నెన్నో
వరుసలు మార్చే
మాయలెలా వస్తాయి!
మనోవాకిళ్లలో
వెన్నెలలు
గుమ్మరిస్తాడు!
చందమామకు
వేలు విడిచిన
మేనమామో ఏమో!

సూర్యునికీ
దగ్గరి బంధువై ఉంటాడు!
మరి ఈ చైతన్యం
ఎక్కడిదనుకోవాలి!
అంతుచిక్కని
చిందుల విందులు చేస్తాడు
మైకేల్ జాక్సన్‌కు
ఏకలవ్య శిష్యుడే కావచ్చు!

పట్టు చిక్కని
పరుగుల వరదలు
పారిస్తాడు!
లిటిల్ మాస్టర్‌కు
వీడే సాటి!
కన్నీరు చూస్తే
కరిగిపోతాడు!
మదర్ థెరీసాకు
స్ఫూర్తి వీడేనేమో!

గాంధీ తాతకు
బోసినవ్వుల్ని
నేర్పింది కూడా
వీడే అయి ఉంటాడు!

నెపోలియన్‌కు
నేస్తమై ఉంటాడు
అలజడి లేకుండా
అసలుండలేడు!

స్వపర భేదాలు తెలియని
శాంతి దూత!
ఎవ్వరినైనా
చిరునవ్వుతో
సంధి చేసుకుంటాడు!
ఎంత చండశాసనుడో!
నిముషం
నిలబడనీయడు!
దర్పంలో రారాజు!
వేలెడు లేకున్నా
వెనుక
మందీ - మార్బలం
కదలాలి!

**(చిన్నారి లోకానికి)**

---

# కన్నీళ్ళు

- డమాముల గాయత్రి



గుండె భారాన్ని దింపి ఆయుస్సును పెంచే మనోల్లాస కారకాలు...
అధికమైతే ఆయస్సును తగ్గించి ఊపిరి తీసే యమపాశాలు....
కాసింత బాధ ఎక్కువైతే.. కన్నీళ్ళు
కాసింత ఆనందం ఎక్కువైనా కన్నీళ్ళే!?!
బాధ దాహం తీర్చే ఉపశమన మంత్రం కన్నీళ్ళు
ఆనందానికి సంకేతంగా పెల్లుబికేవి కన్నీళ్ళే!?!
కానీ ఎంత వ్యత్యాసం....???

కన్నీళ్ళు... ఎలా పుట్టినా....
ఒక్కో సందర్భంలో ఒక్కో రకమైన కన్నీళ్ళు
జాలితోనో... దయతోనో.. కూడుకున్న కన్నీళ్ళు
అక్కరతోనో.. అసహ్యంతోనో ... వచ్చే కన్నీళ్ళు
దుఃఖానికో... పాపభీతికో... చిహ్నంగా కన్నీళ్ళు
వెటకారంతోనో... నటనతోనో... వెల్లడయ్యే కన్నీళ్ళు
శరీరానికో... మనసుకో.... తగిలిన గాయానికి గుర్తుగా కన్నీళ్ళు
మరి ఆనంద భాష్పాలు
అదృష్టవంతుల్ని మాత్రమే పలకరించే ఆత్మీయ పరిమళాలు
కానీ.... జీవితమనే సముద్రంలో....
ఆటుపోట్లకు తట్టుకొనే శక్తి కరవై ఉప్పొంగే....
కన్నీటి కెరటాలే... ఎక్కువ
కన్నీళ్ళు... కాలేవు సమస్యలకు పరిష్కారాలు
ఆవేదనను చల్లార్చి మనో నిబ్బరాన్ని నేర్పగల జ్ఞాన ప్రవాహాలు
బాధనూ.... సంతోషాన్నీ...
కన్నీళ్ళ రూపంలో దాచుకున్న కళ్ళు.....
అపురూప వరాలు
బాధతో వచ్చే కన్నీళ్ళను సైతం
సంతోషంగా మలచుకున్న కళ్ళు....
అమృత కలశాలు
సృష్టిలో అద్భుతాలు

# విషాద జీవన సజీవ దృశ్యాలు




- డా॥ బి.వి.ఎన్ స్వామి

వ్యక్తిగత జీవితం అనేది అనివార్యమైంది. మనిషి సంఘజీవిగా ఉంటూనే, వ్యక్తిగతం పట్ల శ్రద్ధ కూడా చూపెడుతుంటాడు. రచయిత సాంఘిక పరిణామాల్ని ఏవిధంగా చిత్రిస్తుంటాడో, వ్యక్తిగత మార్పుల్ని అంటే సమానంగా రాస్తూ ఉంటాడు. వ్యక్తిగతమైన దాంట్లో కుటుంబం అత్యంత కీలకమైనది. మొత్తంగా చూస్తే కుటుంబం అనేది సంఘానికి సంబంధించిన ప్రాథమిక యూనిట్. అయినా కుటుంబం వ్యక్తిగత జీవితానికి, వ్యక్తి ప్రైవసీకి ఆలంబనగా నిలుస్తుంది. అలాంటి కుటుంబం నేపథ్యంగా, కుటుంబ సమస్యలు ప్రధానంగా, సాగిన కథా రచన 'నడుస్తున్న చరిత్ర'. రచయిత పంజాల జగన్నాథం.

దశాబ్ద కాలంగా కథా రచనను కొనసాగిస్తున్న జగన్నాథం రెండో కథా సంపుటి 'నడుస్తున్న చరిత్ర'. ఇందులో దృష్టంతా కుటుంబ సమస్యలపై కేంద్రీకరించారు. తల్లిదండ్రుల జ్ఞాపకాలు, తల్లిపై తండ్రి చేసిన దౌర్జన్యం, తండ్రి పెత్తందారీ ధోరణి, తల్లి ఆత్మీయత, తమకున్న ఆస్తి వల్ల సంక్రమించిన పెత్తనం, తండ్రి చూపిన క్రమశిక్షణ బాల్య స్నేహాలు, కథల్లో చిత్రించారు. తను పెరిగిన వాతావరణం, జీవించిన జీవితం,ఉద్యోగ ధర్మం, తన పిల్లల పోషణ, అందులోని కష్టాలు, సుఖాలు, కౌటుంబిక హింస, ఆర్థిక పరిమితులు, ఎదుగుతున్న పిల్లల పెంకితనం, ఉద్యోగ బాధలు, బాధ్యతారాహిత్యాలు, తన బంధువుల యోగక్షేమాలు, ఇలా ఒకటేమిటి సమస్త విషయాలు పూసగుచ్చినట్లుగా విడమరిచి చెప్పారు. కథల్లో ఎక్కువగా ఇవే కనబడతాయి. మిగతా కథల్లో సామాజిక సమస్యలపై దృష్టి సారించారు.

చాలా కథలు విషాద స్థితిని నింపుకున్నవే. తన గురువు, ఆదర్శప్రాయుడు అనుకున్నవాడు చనిపోయిన సందర్భంగా 'వీడని జ్ఞాపకాలు' కథగా వెలువడింది. ఇందులో ఆయన బాధలు, ఎదుర్కొన్న సమస్యల్ని విపులీకరించారు. వెనుకబడ్డ లంబాడీ కూలీల కష్టాలను, ఇష్టాలను, సమస్యలను, అలవాట్లను, దాంపత్య జీవితాన్ని, కొట్లాటలను లేబర్ అడ్డాగా కథీకరించారు. తనకు ఇష్టమైన రచయితను నాయకుడిగా చేసి కథ అల్లటం కూడా ఈ సంపుటిలో ఒక ప్రత్యేకత. ఆదర్శప్రాయమైన జీవితం గడిపిన రచయిత, అంతిమ ఘడియల్లో కూడా ఆదర్శ లక్షణాలను పాటించడం ఒక విశిష్టత. అతనొక విశిష్ట వ్యక్తిగా ఎదగడం వెనక గల బాధల పల్లవులను అక్షరీకరించారు. తన చుట్టూ ఉన్న వ్యక్తులను నిశితంగా పరిశీలించే అలవాటు వీరికి ఉంది. అందులో నుండి బయటకొచ్చిందే 'సమర్థుడి జీవితయాత్ర'. నీడలేని వ్యక్తి, విషాదాన్ని అధిగమించి ఢిల్లీ స్థాయిలో అవార్డు పొందేంత ఎత్తుకు ఎదిగిన క్రమం ఈ కథలో కనబడుతుంది. సజీవ కళేబరం, సర్వర్‌గోపి, తండ్లాట లాంటి కథలు అత్యంత దుర్భరమైన పరిస్థితులను తట్టుకొని మనిషి ఏవిధంగా పురోగమిస్తాడో తెలుపుతాయి. నేటి హైటెక్ కాలంలో తల్లిదండ్రులకు, కొడుకులకు మధ్య ఉన్న సంబంధాన్ని, తల్లి మరణం సాక్ష్యంగా చర్చకు పెట్టిన కథ నడుస్తున్న చరిత్ర. కథ కాని కథ అనేది బాధ్యతగల అధికారికి, అతని వద్ద పనిచేస్తున్న బాధ్యతలను విస్మరించిన వారికి మధ్య నడచిన సంభాషణ, సంఘర్షణ. పూర్తి మాండలికంలో రాసిన కథ తాయిమాయి. మానవతా దృక్పథంతో అడవిలో అన్నలకు అన్నంపెట్టిన కాశయ్యను పోలీసులు పొట్టనపెట్టుకున్న తీరును చిత్రించింది కాశయ్య కథ. ఈ రెండు కథలు కాస్త భిన్నంగా కనిపించినా, సారాంశంలో మాత్రం మానవ సంబంధాలలోని విషాదాన్ని, దుఃఖాన్ని, అమానవీయతను గూర్చి చెప్పినవే. నేను సైతం అనే కథ పూర్తి నాటకీయతతో నడిచింది. ముగింపులో శ్రీశ్రీ కవితా పంక్తిని ఉటంకించడం కూడా అందులో భాగమే. దండలోని దారంలా, కథలో ఆర్తి, ఆవేదనలు పరుచుకొని ఉన్నాయి. కన్నీటి దృశ్యాలు, నాన్నా నన్ను క్షమించవు. బాధ్యత, చందన, పరిమళించిన జీవితం మొదలైన కథలు వీరి పరిశీలనాసక్తికి నిదర్శనాలు.

సమాజంలోని అన్యాయాలను చూసి చలించడం వీరి నైజం. వెంటనే ఆర్తితో విషయాన్ని కథగా మార్చడం వీరి అలవాటు. అందుకే కథల్లో విషాదం పరుచుకుంది. అదంతా రచయిత అనుభవించిందే. రచయిత కథలో ప్రవేశించడం తరచుగా జరిగింది. నాలుగు మంచి మాటలు, రెండు వ్యాఖ్యలు అలాంటి చోట తారసపడతాయి. అవి పాఠకుల్ని ఆలోచింపజేసేవిగా ఉన్నాయి. అనేక విషయాలు చెప్పడం వల్ల కథల నిడివి పెరిగింది. వర్ణనలు, అలంకారాలు కూడా అందుకు దోహదపడ్డాయి. అధ్యాపకుడిగా తరగతి గదిలో బోధన చేసిన వీరు, రచయితగా పాఠకులకు హితబోధ చేయడం జరిగింది. నాలుగు మాటలు కలబోసుకునే తీరిక కరువైన కాలంలో వీరి కథలు ఆ లోటును తీరుస్తాయనడంలో సందేహం లేదు.

# కొత్త పుస్తకాలు

## వెన్నలో లావా (కథలు)




- ఎమ్వీ రామిరెడ్డి

వెల : రూ.70/- పేజీలు : 206

**ప్రతులకు : అన్ని ప్రముఖ పుస్తక విక్రయ కేంద్రాలు**

నా మటుకు నాకు కవిత్వం కన్నా కథా రచన కష్టమైన ప్రక్రియ. పదేళ్ళ వ్యవధిలో 40 దాకా కథలు రాయగలిగాను. వీటిలో చాలావరకు రాయకుండా ఉండలేక రాసినవే. చదవడమంటే చాలా ఇష్టం. కదిలించే కథ చదివాక కుదురుగా ఉండలేను. అలా నన్ను డిస్టర్బ్ చేసిన కథలు లెక్కలేనన్ని. అలాంటి పాత, కొత్త రచయితల్ని చదివినప్పుడల్లా బోల్డంత ఆశ్చర్యపోతుంటాను. అలా అధ్యయనం ద్వారా అబ్బిన జ్ఞానంతోనే నా స్థాయిలో నేను కథలు రాయడానికి ప్రయత్నించాను.

- ఎమ్వీ రామిరెడ్డి

## సౌభాగ్య కవిత




- డా॥ శిఖామణి

వెల : రూ.125/- పేజీలు : 250

**ప్రతులకు : 9848157909**

బహుశ సౌభాగ్య విషయంలో నేనలాగే అనుకుంటా. చాలా డైవర్షన్స్ తీసుకున్నాడు. ఏకోన్ముఖంగా ప్రవహించాల్సిన శక్తంతా, కవితా శక్తంతా పలు పాయలై పోయిందని. ఈ కవితలన్నీ ఒక దగ్గర చదివి చూడండి. తొలినాళ్ళ ఆ అనాయాస ఊహాశాలిత్వం, సర్వాన్ని, మోహంతో సంలీనం చేసుకునే శక్తి ఎందుకు చిద్రుపలయ్యిందో తెలియదు. సౌభాగ్య కారణాలు వెతుక్కోవాలి. ఈ సర్వ కవితా సంకలనం సందర్భంగా మళ్ళీ అన్ని శక్తుల్ని గూడుకట్టుకుని, సమీకరించుకుని విజృంభించాల్సిన అవసరం వుందనుకుంటా.

- కె. శివారెడ్డి

## పడగనీడ (నవల)




- సలీం

వెల : రూ.100/- పేజీలు : 184

**ప్రతులకు : అన్ని ప్రముఖ పుస్తక విక్రయ కేంద్రాలు**

చదువుని మార్కెట్ వస్తువు చేసి, తల్లిదండ్రుల కలల్ని కానులుగా మార్చుకుంటున్న కార్పొరేట్ విద్యాసంస్థల నైజాన్ని బైటపెట్టి, చదువంటే మార్కులూ, ర్యాంకులూ కాదనీ, జీవితాన్ని ధైర్యంగా ఎదుర్కొనే నమ్మకాన్ని, ఆత్మస్థైర్యాన్ని అందించేదే అసలైన చదువని చెప్పిన నవల 'పడగ నీడ'.

- ప్రచురణకర్త

## మనిషి వాసన (కవిత్వం)




- ఏటూరి నాగేంద్రరావు

వెల : రూ.50/- పేజీలు : 120

**ప్రతులకు : 7416665323**

తన కవిత్వానికి "మనిషి వాసన" అని పేరు పెట్టడంలోనే ఏటూరి నాగేంద్రరావు మనిషి గురించి ఎంత తపన పడుతున్నాడో అర్థమవుతోంది. మనిషికీ, మనసుకూ పెరుగుతున్న దూరాన్ని గుర్తించడమే గాక, దానికి గల కారణాల్ని అన్వేషించే ప్రయత్నం చేశాడు కవి. నాన్నలు నిత్య కార్ఖానాలుగా, అమ్మలు స్విచ్చాన్ చేసిన మిక్సీలుగా జీవితాలు యాంత్రికమై పోయాయని ఆవేదన చెందుతున్నాడు. నదుల్ని మురికి కాల్వలుగా మారుస్తున్న ఫ్యాక్టరీల ప్రగతిని ప్రశ్నిస్తున్నాడు. సంస్కృతి కాలుష్య సునామీతో కొట్టుకుపోతోందని ఆవేదన చెందుతున్నాడు. "అద్దం ముక్కలో నా ముఖానికి బదులు అమెరికా మ్యాపు కనబడుతోంది" అన్న ఒక్క ముక్కలో సామ్రాజ్యవాద ప్రభావాన్ని స్ఫురింపజేస్తున్నాడు.

- వి. చెంచయ్య

## మన నవలలు మన కథానికలు




- రాచపాళెం చంద్రశేఖరరెడ్డి

వెల : రూ.69/- పేజీలు : 178

**ప్రతులకు : 040-27608107**

**(ప్రజాశక్తి బుక్‌హౌస్ & విశాలాంధ్ర బుక్‌హౌస్ అన్ని బ్రాంచీలు)**

సాహిత్య విమర్శా రంగంలో నా కృషి అటు ప్రాచీన సాహిత్యం మీదా, ఇటు ఆధునిక కవిత్వం, కథానిక, తెలుగు సాహిత్య విమర్శల మీద జరిగింది. నవల మీద నా కృషి చాలా పరిమితమని ఈ గ్రంథమే రుజువు చేస్తున్నది. తెలుగు నవలల మీద నేను రాసిన ఈ పదమూడు వ్యాసాలే నేనింకా చేయవలసిన కృషిని గురించి హెచ్చరిస్తున్నాయి. వీటిలో కొన్నింటిని అఫ్సర్ రాయించగా, తక్కినవి ఇతర సందర్భాల కోసం రాసినవి.

- రాచపాళెం చంద్రశేఖరరెడ్డి

## నరుడు - నక్షత్రాలు




- గుంటూరు శేషేంద్రశర్మ

వెల : రూ.100/- పేజీలు : 132

**ప్రతులకు : అన్ని ప్రముఖ పుస్తక విక్రయ కేంద్రాలు**

సహజంగా లోకంలోని అన్యాయాలకు, అక్రమాలకు దుఃఖించే వాళ్ళే కవులు. దానికి తోడు శేషేంద్ర శర్మ బాల్యం నుండే అన్యాయాలకు, అక్రమాలకు వ్యతిరేకంగా అంతర్జాతీయ తాత్వికతతో పనిచేస్తున్న కమ్యూనిస్టు పార్టీ ప్రభావానికి లోనయ్యాడు. ఋతుఘోష, పక్షులు మొదలైన సంకలనాల నిండా లెఫ్టిస్టు పొయట్రీ వుందని చెప్పగలిగిన ఆత్మవిశ్వాసం ఆయనది. తన కవిత్వ తాత్విక భూమిక అదేనంటాడు.

- డా॥ కాత్యాయనీ విద్మహే




### పునరపి... (కవితా సంపుటి)

– ఉప్పలధడియం వెంకటేశ్వర

వెల : రూ.40/- పేజీలు : 64

**ప్రతులకు : 044 - 25541572**

జీవితంలో మునక వెయ్యడం, గట్టున ఉండి గమనిస్తూ దాని గురించి ఆలోచించడం, ప్రపంచంలోని శాశ్వతత్వాన్ని, చలనశీలతను కూడా గమనించడం వెంకటేశ్వర గారికి చాతనయ్యాయనడానికి ఈ చిన్న కవితా సంపుటిలో దాఖలాలున్నాయి.

**- రెంటాల శ్రీ వెంకటేశ్వరరావు**




### కొన్ని కలలు కొన్ని జ్ఞాపకాలు

– కట్టమంచి బాలకృష్ణారెడ్డి

వెల : రూ.200/- పేజీలు : 188

**ప్రతులకు : 94405 59575**

ఇది వరకు నేను రాసిన "యూరప్ జ్ఞాపకాలు", " ఆ పది రోజులు" యాత్రా అనుభవాలు చదివిన మిత్రులు నా అండమాన్ యాత్ర అనుభవాలు కూడా తెలుసుకోవాలని పదే పదే అడుగుతుండటం తోను, నాకు కూడా అండమాన్ యాత్రలో నేను చూసిన ముఖ్యంగా అక్కడ సెల్యులార్ జైలులో మన స్వాతంత్ర పోరాట వీరులు అనుభవించిన చిత్రవధలు, మరణాలు, ఆత్మహత్యల గురించి తెలియజేయాలన్న తపన నన్ను అండమాన్ యాత్ర అనుభవాలు రాయడానికి పురికొల్పింది.

**- కట్టమంచి బాలకృష్ణారెడ్డి**

### ఇందిర కవితలు

సంకలనం : కె. రామలక్ష్మి

వెల : రూ.150/- పేజీలు : 180

**ప్రతులకు : (విశాలాంధ్ర బుక్‌హౌస్ అన్ని బ్రాంచీలు)**




వస్తు వైవిధ్యం ఇందిర కవితల్లోని విలక్షణ లక్షణం. వైచిత్రి జీవంగా రచించిన కవితలివి. దేనికదే ఒక చెణుకు. ఆకస్మాత్తుగా మండు వేసవిలో నేలపై రాలిన చినుకు. కొన్ని కవితలు సరదాగా పరవళ్ళు తొక్కుతాయి. మరికొన్ని కాసేపు ఆపి ఆలోచింపజేస్తాయి. అనుభూతి చిలికినవి కొన్ని. అనుభవం పలికినవి కొన్ని. అన్నిటిలో సమాన గుణం వేగం.

**- సి. నారాయణరెడ్డి**




### మట్టి పరిమళం (కవిత్వం)

– రాచమళ్ళ ఉపేందర్

వెల : రూ.30/- పేజీలు : 72

**ప్రతులకు : 98492 77968**

ఉపేందర్ ఎంచుకున్న అంశాలన్నీ మానవీయ స్పందనకు సంబంధించినవి. ప్రతి కవితలోనూ ఒక చైతన్య పూరితమైన ఉద్బోధ వుంది. చిన్న పిల్లల మనస్సులను బాధిస్తున్న విషయాల నుండి ముసలివాళ్ల దీనత్వాన్ని ఆవిష్కరించిన తీరు హృద్యంగా వుంది. జీవితంలో నిరాశకు చోటు లేదని చాటడం, జీవన రణ రంగంలో జెండావోలె రెవరెవలాడుతూ పైకి తేవాలంటూ చైతన్యపర్చడం ఉపేందర్ కవితలో మనకు చాలా కనపడుతుంది. భవిష్యత్తుపై అచంచల విశ్వాసం కలవాడిగా కనపడతాడు.

**- కె. ఆనందాచారి**




### ఆధునికాంధ్ర కవిత్వంపై బౌద్ధమత ప్రభావం

– డా|| రాయదుర్గం విజయలక్ష్మి

వెల : రూ.125/- పేజీలు : 193

**ప్రతులకు : 9840331820**

డా|| రాయదుర్గం విజయలక్ష్మి మద్రాసు విశ్వవిద్యాలయానికి డాక్టరేట్ ఆర్జనకై 1982లో 'ఆధునికాంధ్ర కవిత్వంపై బౌద్ధమత ప్రభావం" అనే అంశంపై సమర్పించిన సిద్ధాంత వ్యాసమీ ప్రకృత గ్రంథం. నేజూచిన మేర తెలుగులో, తెలుగు సాహిత్యం మీద – ఆధునికాంధ్ర కవిత్వంపై మాత్రమే కాదు. బౌద్ధ ప్రభావం గురించి పరిశోధించినవారు రాయదుర్గం వారికి ముందు లేరు. ఈ విధంగా ఆమె ప్రథమ తాంబూలం అందుకొంటున్నది.

**- అన్నపరెడ్డి బుద్ధఘోషుడు**




### మట్టి పలకలు (నానీలు)

– మంత్రి కృష్ణమోహన్

వెల : రూ.75/- పేజీలు : 127

**ప్రతులకు : 9441028186**

కవికి మౌలికంగా ఉండవలసిన మానవీయ సంవేదన, ఆర్తి మంత్రి నానీల్లో ఉన్నాయి. సకల మానవాళికి అక్షరాలు దిద్దించిన పలకల ఊరు మార్కాపురం నుండి వచ్చాడు మంత్రి. నానీల్లో తన 'మార్కు' తనదే.

**- డా|| ఎన్. గోపి**

# అట్టహాసంగా తెలుగు రచయితల సభలు



విజయవాడలో తెలుగు రచయితల సభలో ప్రసంగిస్తున్న డా॥ సి. నారాయణరెడ్డి

ఆగస్టు 13, 14, 15 తేదీల్లో విజయవాడ నగరంలో ప్రపంచ తెలుగు రచయితల మహాసభలు ఎస్.వి.ఎస్. కళ్యాణమండపంలో జరిగాయి. తెలుగు కీర్తిని ప్రపంచానికి తెలియచెప్పే కళారూపాల ప్రదర్శనలు తుమ్మలపల్లివారి కళాక్షేత్రంలో జరిగాయి. 13వ తేదీన ఈ మహాసభలను ప్రముఖ రచయిత పద్మభూషణ్ డాక్టర్ సి. నారాయణరెడ్డి ప్రారంభించారు. ఈ సభలో ప్రముఖ రచయిత మాలతీ చందూర్, ఈనాడు అధినేత రామోజీరావు, యార్లగడ్డ లక్ష్మీప్రసాద్, మండలి బుద్ధప్రసాద్, కేంద్ర సాహిత్య అకాడమీ ఛైర్మన్ అగ్రహార కృష్ణమూర్తితో పాటు పేరెన్నికగన్న అనేక మంది ప్రముఖ రచయితలు పాల్గొన్నారు.

తొలి రోజు సదస్సు సురవరం ప్రతాపరెడ్డి వేదికపై తెలుగు ప్రజల చరిత్ర, సంస్కృతి, భాషా, ప్రాచీనతలకు సంబంధించిన పురావస్తు ఆధారాలు, చరిత్ర పరిశోధనలో ఎదురవుతున్న సమస్యలు. రేపటి సామాజిక అవసరాలు అనే అంశంపై జరిగింది. రెండో సదస్సు రాష్ట్రేతరులు తెలుగు భాషా సమస్యలు అనే అంశంపై జరిగింది. దీనికి తమిళనాడు, కర్ణాటక, ఒడిస్సా, పశ్చిమబెంగాల్, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాల్లో స్థిరపడ్డ తెలుగు రచయితలు హాజరయ్యారు. తెలుగు రచనలన్నీ తమకూ అందే విధంగా చూడాలని, ఇతర రాష్ట్రాల్లోనూ తెలుగు భాషాభివృద్ధికి కృషి చేయాలని వారందరూ ముక్తకంఠంతో కోరారు. మూడోరోజు వేగుంట మోహనప్రసాద్ 'మో' వేదికపై ప్రత్యేక కవి సమ్మేళనం నిర్వహించారు. అదేరోజు మూడో సమావేశం పువ్వాడ శేషగిరిరావు వేదికపై ప్రతినిధుల కవి సమ్మేళనం నిర్వహించారు. 14వ తేదీ ఉదయం తొమ్మిది గంటలకు గుర్రం జాషువా వేదికపై సాహిత్యం, సాహిత్యానువాదాలు ప్రచురణ రంగం అనే అంశంపై చర్చ జరిగింది. ఈ చర్చల్లో గొల్లపూడి మారుతీరావు, రావి రంగారావు, శంకరనారాయణ వంటి ప్రముఖులతో పాటు అనేకమంది రచయితలు పాల్గొన్నారు. గిడుగు రామ్మూర్తి వేదికపై మాతృభాషల మనుగడ, మాండలికాల వినియోగం, తెలుగు భాషకు ప్రాచీన హోదా అనంతరం చర్యలు, తెలుగు భాషోద్యమం వంటి అంశాలపై చర్చ జరిగింది. కాశీనాథుని నాగేశ్వరరావు వేదికపై సాహిత్య పత్రికలు రేపటి మనుగడ అనే అంశంపైనా, కొమర్రాజు లక్ష్మణరావు వేదికపై సాహిత్య సంస్థల ప్రతినిధుల సమావేశమూ జరిగాయి. మహాకవి దాశరథి వేదికపై ప్రతినిధుల కవి సమ్మేళనం జరిగింది. 15వ తేదీన స్వాతంత్ర దినోత్సవం సందర్భంగా గరిమెళ్ళ సత్యనారాయణ వేదికపై జాతీయతాభావం, రచయితల పాత్ర అనే అంశంపై చర్చ నిర్వహించారు.

సి.పి. బ్రౌన్ వేదికపై సాంకేతికంగా తెలుగు భాషాభివృద్ధి ముగింపు సభ జరిగింది. సభలు జరిగిన మూడు రోజులూ తుమ్మలపల్లి వారి కళాక్షేత్రంలో తెలుగు భాషా ప్రశస్తి, మయసభ, తెలుగుభాష నాడు నేడు వంటి కళారూపాలనూ ప్రదర్శించారు. ఈ మహాసభలకు గౌరవాధ్యక్షులుగా మండలి బుద్ధప్రసాద్, కార్య నిర్వాహక అధ్యక్షులుగా యార్లగడ్డ లక్ష్మీప్రసాద్, అధ్యక్షులుగా గుత్తికొండ సుబ్బారావు, ప్రధాన కార్యదర్శిగా జి.వి. పూర్ణచంద్ వ్యవహరించారు. ఈ మహాసభలకు నేటి తరానికి ప్రాతినిధ్యం వహిస్తున్న అనేకమంది యువకులు హాజరయ్యారు. అష్టావధానం, కళారూపాలు, రచనలపై విశ్లేషణలు ఇలా తెలుగును దశదిశలా చాటే అన్ని రకాల కళారూపాలనూ, తెలుగు ప్రశస్తిని, తెలుగు ఔన్నత్యాన్ని చర్చించే చర్చా వేదికలను ఏర్పాటు చేశారు. తెలుగు గొప్పతనాన్ని చాటిచెబుతున్న అనేకమంది ప్రముఖులూ ఇక్కడ తమ అభిప్రాయాలను వెల్లడించారు. తెలుగును విస్తృత పరిచేందుకు చేయాల్సిన పనులను, ఇందుకోసం చేపట్టాల్సిన కార్యాచరణను రూపొందించారు. కర్ణాటక, తమిళనాడు, ఒరిస్సా, మహారాష్ట్రలో ఉంటున్న తెలుగువారికి మన రచనలు చేరువ చేయాలనే అభిప్రాయానికి వచ్చారు.

మహాసభలకు వచ్చిన వారందరిలోనూ తెలుగు బిడ్డలుగా పుట్టి మట్టిలో మాణిక్యాలైన వారిని వెలుగులోకి తీసుకురావాలనే తపనతో పాటు తెలుగు నేల విడిపోకుండా చూడాలనే ఆరాటం ప్రస్ఫుటించింది. అదే సమయంలో కొద్దిమంది తెలుగును అప్రదిష్ట పాల్జేస్తున్నారని, అపోహలతో భాషాభిమానులను ముక్కలు చెక్కలు చేయాలనే ఆలోచన చేపట్టారని, దీన్ని విరమించుకోవాలనే నినాదమూ వినిపించింది.

**- వల్లభనేని సురేష్**

# తెలుగు యూనివర్శిటీ ప్రతిభా పురస్కారాలు

పత్రికా రంగంలో నిత్యం మార్పులు వస్తుంటాయని, ఆ మార్పులను పత్రికా రంగం స్వీకరిస్తోందని "ప్రజాశక్తి' సంపాదకులు ఎస్. వినయ్‌కుమార్ అన్నారు. ఈ రంగంలో చేసిన సేవలకు గాను ఆయనకు 2010 ప్రతిభా పురస్కారం లభించింది. వివిధ రంగాల్లో విశేష కృషి చేసిన వారికి పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ఇచ్చే ప్రతిభా పురస్కార ప్రదానం కార్యక్రమం ఆగస్టు 12న యూనివర్శిటీలోని ఆడిటోరియంలో జరిగింది. 12 రంగాల్లో కృషి చేసిన వారికి ఈ అవార్డులను యూనివర్శిటీ ఉప కులపతి ఆచార్య అనుమాండ్ల భూమయ్య ప్రదానం చేశారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ 1985లో విశ్వవిద్యాలయం ఏర్పడిందన్నారు. యూనివర్శిటీ తరపున నాలుగు రకాల పురస్కారాలను ఇస్తోందన్నారు. కీర్తి,ప్రతిభా, సాహిత్య ప్రక్రియతో పాటు విశిష్ట పురస్కారాలను ఇస్తోందని తెలిపారు. గత 20 ఏళ్ళుగా ప్రతిభా పురస్కారాలను



తెలుగు విశ్వవిద్యాలయం ఉప కులపతి డా. అనుమాండ్ల భూమయ్య నుండి కవితా ప్రక్రియలో ప్రతిభా పురస్కారం అందుకుంటున్న నిఖిలేశ్వర్



ఆగస్టు 12న హైదరాబాద్‌లోని తెలుగు యూనివర్శిటీ ఆడిటోరియంలో పత్రికారంగంలో ప్రతిభా పురస్కారం అందుకుంటున్న వినయ్‌కుమార్

ఇస్తోందన్నారు. ఆయా రంగాల్లోని వారు చేస్తున్న విశేష సేవలను గుర్తించి 55 సంవత్సరాలు పైబడిన వారికి ఈ పురస్కారాలను అందజేస్తున్నట్లు చెప్పారు. యూనివర్శిటీలో చదువుకొని వివిధ ప్రచార మాధ్యమాలలో పనిచేస్తున్న వారు చాలామంది ఉన్నారన్నారు. కొందరు స్వంతంగా సంస్థలను కూడా స్థాపించి ఇతరులకు ఉపాధి కల్పిస్తున్నారని తెలిపారు. ప్రతిభా పురస్కారం అందుకొనే వారికి రు. 20,116తో పాటు ప్రశంసా పత్రం, శాలువాతో సత్కరిస్తామన్నారు. పురస్కారాలు పొందిన వారిని యూనివర్శిటీ విస్తరణ సేవా విభాగం ఇన్‌ఛార్జి డాక్టర్ చెన్నయ్య పరిచయం చేశారు. ఎస్. వినయ్‌కుమార్ (పత్రికారంగం), నిఖిలేశ్వర్ (కవిత్వం), ఆచార్య హెచ్.ఎస్. బ్రహ్మానంద (విమర్శ), ఎస్. జనార్దన్ (చిత్రకళ), రవీంద్రకుమార్‌శర్మ (శిల్పకళ), పసుమర్తి సీతారామయ్య (నృత్యం), అయ్యగారి శ్యామసుందర్ (సంగీతం), ఆచార్య ప్రదీప్‌కుమార్ (నాటకరంగం), గజవెల్లి సారయ్య (జానపద కళారంగం), మాచిరాజు శివరామరాజు (అవధానం), డాక్టర్ జె. భాగ్యలక్ష్మి (ఉత్తమ రచయిత్రి), ఐతా చంద్రయ్య (కథ / నవల), ప్రతిభా పురస్కారాలు పొందారని తెలిపారు.

# "దిక్సూచి" ఆవిష్కరణ

సాహిత్య ప్రస్థానం ప్రత్యేక సంచిక 'దిక్సూచి' ఆవిష్కరణ సభ జూలై 31న కర్నూలు పట్టణంలోని కార్మిక కర్షక భవన్‌లో జరిగింది. సిల్వర్ జూబ్లీ కళాశాల, తెలుగు అసిస్టెంట్ ప్రొఫెసర్ డా॥ పి. విజయకుమార్ 'దిక్సూచి' ప్రత్యేక సంచికను ఆవిష్కరించారు. తెలుగు సాహిత్య చరిత్రలో బహుశా ఇటువంటి పుస్తకం రాలేదన్నారు. 50 మంది ప్రాంతీయ స్థాయి నుండి అంతర్జాతీయ స్థాయి రచయితలు, సంఘ సంస్కర్తలకు చెందిన రచనల సమాహారం లాంటి 'దిక్సూచి' ప్రచురణకర్తలైన సాహితీ స్రవంతిని అభినందించారు. అడుగుజాడ గురజాడ అన్న విధంగా ఈ పుస్తకం గురజాడ రచనతో ప్రారంభం కావడమే ఈ పుస్తక ప్రత్యేకతను తెలియజేస్తుందన్నారు. 'దేశ సాహితీ సొంపు'లో మన సాహిత్య సొంపులను తెలుసుకుంటాము. "శ్రీపాద వారి నా కుటుంబం చెట్టు కింద వుంది" కన్నీళ్ళు తెప్పిస్తుందన్నారు. సాహితీ సేవకుల పట్ల సమాజం బాధ్యత వహించాలన్నారు. ఇటువంటి పుస్తకం తీసుకురావడం సాహసమన్నారు. సాహితీ ప్రియులందరూ



జూలై 31న కర్నూలులో 'దిక్సూచి' ఆవిష్కరణ సభలో (ఎడమ నుండి కుడికి వరుసగా) జంధ్యాల రఘుబాబు, పానుగంటి చంద్రయ్య, డా॥ పి. విజయకుమార్, కెంగార మోహన్

చదవవలసిన పుస్తకం 'దిక్సూచి' అని కొనియాడారు. సాహితీ స్రవంతి జిల్లా కార్యదర్శి కెంగార మోహన్ అధ్యక్షత వహించిన ఈ సమావేశంలో ప్రజాశక్తి ఎడిషన్ ఇన్‌ఛార్జి పి. చంద్రయ్య, సాహితీ స్రవంతి రాష్ట్ర కార్యదర్శి రఘుబాబు ఇంకా సాహితీ ప్రియులు పాల్గొన్నారు. జిల్లా సహాయ కార్యదర్శి మహేష్ వందన సమర్పణ చేశారు.




ఆగస్టు 15న హైదరాబాద్‌లోని గచ్చిబౌలిలో గల సుందరయ్య విజ్ఞాన కేంద్రం ప్రాంగణంలో నూతనంగా నిర్మించిన కాన్ఫరెన్స్ హాలును ప్రారంభించి మాట్లాడుతున్న డా॥ సి.నారాయణరెడ్డి



జూలై 7న నల్గొండలో జరిగిన డా॥ బోయ జంగయ్య సాహితీ స్వర్ణోత్సవం సభలో మాట్లాడుతున్న కలెక్టర్ ముక్తేశ్వరరావు, వేదికపై సభాధ్యక్షులు మేరెడ్డి యాదగిరిరెడ్డి, డా॥ బోయ జంగయ్య, దామోదర్ ఉన్నారు.



జూలై 31న నిజామాబాద్ పట్టణంలో కిరణ్‌బాల రచించిన కానుక (కథా సంపుటి), నా కలల ప్రపంచంలో (కవితా సంపుటి), చందమామ... మామే (నాటికల సంపుటి) మూడు పుస్తకాల ఆవిష్కరణ సభలో (కుడి నుండి ఎడమకి) తుర్లపాటి లక్ష్మి, కె. నరేందర్ రెడ్డి, ఎ. మల్లారెడ్డి, కిరణ్‌బాల, అమృతలత, ఝాన్సీ కె.వి. కుమారి, శిలాలోలిత, నెల్లుట్ల రమాదేవి, తారాచౌదరి, పి.వి. సుబ్బారావు, కాసర్ల నరేశ్‌రావు, ఘణపురం దేవేందర్



జూలై 7న సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో ప్రముఖ కవి, రచయిత ఎస్.ఆర్. పృథ్వీ రచన 'వ్యాస దీపిక'ను ఆవిష్కరిస్తున్న పెద్దాపురంమున్సిపల్ ఛైర్‌పర్సన్ శ్రీమతి ముప్పన శ్యామలాంబ, డా॥ అద్దేపల్లి రామమోహనరావు, జి. అనంతరావు, బచ్చు ఫౌండేషన్ అధినేత బచ్చు రామమోహనరావు, యాసలపు సూర్యారావు తదితరులు



జూలై 13న డా॥ నందమూరి తారక రామారావు కళామందిరం, హైదరాబాద్ పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం నిర్వహించిన కీర్తి పురస్కారాల ప్రధానోత్సవ కార్యక్రమంలో గుదిబండి వెంకటరెడ్డి సాంస్కృతిక నిర్వహణకుగాను వట్టి వసంతకుమార్, ఎస్. చెల్లప్ప, ఆచార్య అనుమాండ్ల భూమయ్యల ద్వారా కీర్తి పురస్కారం స్వీకరిస్తున్న దృశ్యం



అనంతపురంలో జూలై 10న కోడూరి విజయకుమార్‌కి 23వ ఉమ్మడిశెట్టి సాహితీ అవార్డును ప్రదానం చేస్తున్న అవార్డు వ్యవస్థాపకులు డా॥ రాధేయ, సాహితీవేత్తలు ఆచార్య రాచపాళెం, విహారి తదితరులు



జూలై 31న నెల్లూరులో కవి శ్రీనివాసగౌడ్‌కి తిక్కన సాహిత్య పురస్కారాన్ని అందజేస్తున్న నెల్లూరు నగర శాసనసభ్యులు ముంగమూరు శ్రీధర్ కృష్ణారెడ్డి, వినుకొండ వెంకటేశ్వర్లు, ఆర్.వి. శేషయ్య నాయుడు తదితరులు



జూలై 10న కథకుడు, కవి, సీనియర్ జర్నలిస్టు 'జయకేతన' పత్రికా సంపాదకులు కస్తూరిని ప్రభా సాంబ సాహితీ పురస్కారంతో విశాఖపట్నంలో సత్కరిస్తున్న (ఎడమ నుండి కుడికి) కీర్తిప్రియ (ఆచార్య డా॥ జి.వి.ఎస్.ఎల్. నరసింహరాజు), ఆచార్య డా॥ ఎ. ప్రసన్నకుమార్, కస్తూరి, ఆచార్య డా॥ జి.వెంకటపతి రాజు, డా॥ డి.వి. సూర్యారావు, బి. వెంకటరావు



జూన్ 8న నిజామాబాద్‌లో విశ్వకవి రవీంద్రనాథ్ ఠాగూర్ 150వ జన్మదినోత్సవం పురస్కరించుకొని నిర్వహించిన 'మిరుగు' మినీ కవిత జాతరకు హాజరైన ముఖ్య అతిథి డా॥ నాళేశ్వరం శంకరం, సభాధ్యక్షులు ఎ. సూర్యప్రకాష్, మేక రామస్వామి



జూలై 25న మచిలీపట్నంలో ఆంధ్ర సారస్వత సమితి ఆధ్వర్యంలో గ్రంథావిష్కరణలు, అద్దేపల్లికి వివిధ సాహిత్య , సాంస్కృతిక సంస్థలచే సన్మానం జరిగాయి. చిత్రంలో ఎడమ నుండి ఎస్.ఎస్. శాస్త్రి, డా॥ పి.వి. సుబ్బారావు, కొట్టి రామారావు, దేవదాసు, డా॥ అద్దేపల్లి, పి. శ్రీనివాసగౌడ్, చక్రవర్తి



ఆగస్టు 1న కళా సుబ్బారావు కళా వేదిక హైదరాబాద్‌లో జి.వి.ఆర్. ఆరాధన కల్చరల్ ఫౌండేషన్ నిర్వహించిన కార్యక్రమంలో ముఖ్య అతిథి డా॥ సి. నారాయణరెడ్డి, సత్కారకర్త మల్లాది శైలజా సుమన్, డా॥ రావూరి భరద్వాజ, శ్రీమతి రావూరి కాంతమ్మ, వి.వి. రాఘవరెడ్డి, డా॥ ఉండేల మాలకొండారెడ్డి, గుదిబండి వెంకటరెడ్డి, కళా వేంకట దీక్షితులు




జూలై 18న కర్ణాటకలోని దార్వాడ్‌లో కేంద్ర సాహిత్య అకాడమీ నిర్వహించిన జాతీయ సదస్సులో కవితాగానం చేస్తున్న డా॥ వేంపల్లి గంగాధర్



తంగిరాల మెమోరియల్ ట్రస్ట్ ఆధ్వర్యంలో రవీంద్రభారతిలో జూలై 24న జరిగిన 12వ తంగిరాల స్మారక అవార్డు సభలో సాహితీ కిరణం రంగస్థల ప్రత్యేక సంచిక ఆవిష్కరించిన డా॥ ఎం. కాంతారావు, చిత్రంలో వరుసగా ఆ పత్రిక ఎడిటర్ పొత్తూరి సుబ్బారావు. దీపికారెడ్డి, శోభానాయుడు, ఎన్. సాంబయ్య, జి. వెంకటరెడ్డి, డా॥ అక్కినేని, కేతవరపు రాజశ్రీ, తంగిరాల చక్రవర్తి



జూలై 20న నెల్లూరుజిల్లా రచయితల సంఘం ఆధ్వర్యంలో 'దర్పణం' పుస్తకావిష్కరణ సభలో ప్రముఖ సంపాదకులు, పొత్తూరి వెంకటేశ్వరరావు, కాకాణి గోవర్ధనరెడ్డి, ఎ. జయప్రకాష్, పాతూరి అన్నపూర్ణ, మాటేటి రత్నప్రసాద్ తదితరులు



జూలై 28న హైదరాబాద్‌లో త్యాగరాయ గానసభ, హైదరాబాద్‌లో జి.వి.ఆర్. ఆరాధన కల్చరల్ ఫౌండేషన్ నిర్వహించిన సినారె 81వ జన్మదిన వేడుకల కార్యక్రమంలో ముఖ్య అతిథి మండలి బుద్ధప్రసాద్, సభాధ్యక్షులు పి. విజయబాబు, డా॥ సి. నారాయణరెడ్డి పురస్కారాలందుకొన్న బైసా దేవదాస్, జె.కె. భారతి, అరుణా సుబ్బారావు, శ్రుతకీర్తి, పులివర్తి కృష్ణమూర్తి, కె. చిన వేంకట దీక్షితులు, టీవి నటి క్రాంతి, గుదిబండ వెంకటరెడ్డి, ఆర్.వి. రమణ



జూలై 31న హైదరాబాద్‌లో సాహితీ సోపతి ఆధ్వర్యంలో జరిగిన అన్నవరం దేవేందర్ అనువాద కవితా సంకలనం 'ఫార్మ్‌లాండ్ ఫ్రాగ్రెన్స్' ఆవిష్కరణ సభ. చిత్రంలో ఎడమ నుండి కుడికి డా॥ లక్ష్మీ హరిబండి, శ్రీమతి పి. విజయలక్ష్మి, అన్నవరం దేవేందర్, శ్రీమతి వసంత కన్న భీరన్, అల్లం నారాయణ, ప్రొ॥ ఎన్. గోపి కె. శ్రీనివాస్, జూకంటి జగన్నాథం



జూన్ 25న హైదరాబాద్ సచివాలయంలో జరిగిన సాహితీ కార్యక్రమంలో ప్రభుత్వ ఉప కార్యదర్శి, ప్రముఖ రచయిత్రి డా॥ సి. భవానీదేవి రచించిన 'బొబ్బిలియుద్ధం' చారిత్రాత్మక నాటకాన్ని డా॥ కె.వి. రమణాచారి ఆవిష్కరించారు. ఈ సభలో పింగళి సాంబశివరావు, హనుమంతరెడ్డి, బి. వెంకటేశ్వరరావు తదితరులు పాల్గొన్నారు



జూలై 17న నిజామాబాద్‌లో 'వెతలే... కథలై' పుస్తకావిష్కరణ సభలో పాల్గొన్న డా॥ వి. త్రివేణి, తుర్లపాటి లక్ష్మి, అనిశెట్టి రజిత, కిరణ్‌బాల, అమృతలత, ముదిగంటి సుజాతారెడ్డి, రత్నమాల, డా॥ తిరునగరి దేవకీదేవి , మల్లీశ్వరి, డా॥దేవరాజు మహారాజు, ఎలిశెట్టి శంకర్, కె. నరేందర్‌రెడ్డి, డా॥ జి. లచ్చయ్య



ఆగస్టు 6న విశాఖపట్నంలో ఆంధ్ర విశ్వకళా పరిషత్ దూర విద్యా కేంద్రం, తెలుగుశాఖ ఆచార్యులు వెలమల సిమ్మన్న రచించిన "తెలుగు సాహిత్య చరిత్ర" పుస్తకావిష్కరణలో సభలో యార్లగడ్డ లక్ష్మీప్రసాద్, పి.వి.జి.డి. ప్రసాద్‌రెడ్డి, కొండపల్లి సుదర్శన్‌రాజు, పర్వతనేని సుబ్బారావు తదితరులు

# తెలుగు, ఉర్దూల వారధి 'సంకేతం' కవిత్వం



'సంకేతం' పుస్తకాన్ని ఆవిష్కరిస్తున్న
డా. జి.వి. రత్నాకర్, బూర్గుల నరసింహరావు, తెలకపల్లి రవి, ఆలీ జహీర్

ఉర్దూ, హిందీ, ఇంగ్లీషు భాషల్లో ప్రఖ్యాతి గాంచిన ప్రముఖ కవి అలీ జహీర్ రాసిన సంకేతం కవితా సంపుటి తెలుగు, ఉర్దూ భాషల మధ్య సంబంధానికి ఒక 'సంకేతం' అని సాహితీ స్రవంతి రాష్ట్ర అధ్యక్షులు తెలకపల్లి రవి అన్నారు. జూలై 30న సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో సంకేతం కవితా సంపుటి ఆవిష్కరణ జరిగింది. అలీ జహీర్ ఉర్దూలో రచించిన కవితలను తెలుగులో ప్రొఫెసర్ జి.వి.రత్నాకర్ సంకేతం పేరుతో అనువదించారు. ఈ పుస్తకాన్ని ప్రొఫెసర్ బూర్గుల నర్సింగరావు ఆవిష్కరించారు. ఆవిష్కరణ సభకు తెలకపల్లి రవి అధ్యక్షత వహించారు. ఈ సందర్భంగా రవి మాట్లాడుతూ సంకేతం దేనికి అని ప్రశ్నించుకుంటే వైవిధ్య సాంస్కృతిక సంఘర్షణకు ఇదొక సంకేతం అని, బూర్జువా, భూస్వామ్యం నుంచి నేటి సమాజం వరకు పరిణామ క్రమానికి ఇదొక సంకేతం అని అన్నారు. సమరశీల భావజాలాన్ని స్పృశిస్తూ రాసిన ఎన్నో కవితలు మనం సంకేతంలో చూడొచ్చన్నారు. రచయితను గూర్చి చెబుతూ సంఘ సంస్కరణ, లౌకిక ప్రజాస్వామ్య భావజాలం గల కవి అలీ జహీర్ అని రవి అన్నారు. ఆవిష్కర్త బూర్గుల నర్సింగరావు మాట్లాడుతూ ఆవిష్కరణకు తనను ఆహ్వానించడం సంతోషంగా ఉందన్నారు. రచయితతో తన 30 ఏళ్ళ అనుభవాన్ని ఆయన గుర్తు చేసుకున్నారు. అలీ జహీర్ రాసిన కవితలు ఏ ఒక్కదానికో పరిమితం కాదని, అన్నీ కలగలిపి ఉంటాయన్నారు. ఆయన వ్యక్తి, ప్రకృతి, సమాజం అన్నీ కలిపి చూస్తారని తెలిపారు. రచయిత అలీ జహీర్ మాట్లాడుతూ కవితలు నవాబుల కాలంలోనే తెలుగు, ఉర్దూ, ఇంగ్లీష్ తదితర భాషల్లో అనువాదం చేసేవారన్నారు. ప్రస్తుతం ఇతర భాషల్లో అనువాదానికి అంత ప్రాముఖ్యత నివ్వడం లేదని అన్నారు. తాను కవితలు రాయడంలో కుటుంబ సభ్యుల ప్రోత్సాహం ఎంతో ఉందని అన్నారు. అనువాదకులు రత్నాకర్ మాట్లాడుతూ అలీ జహీర్ రాసిన కవితల్లో ప్రతి అక్షరాన్ని సృజించి, అనుభవించి, అనువదించానన్నారు. ఇదొక ప్రత్యేకమైన అనుభూతి అని తెలిపారు. ఈ కార్యక్రమంలో ఉస్మానియా విశ్రాంత ప్రొఫెసర్ మాణిక్యాంబ, సాహితీ ప్రియులు పాల్గొన్నారు.





Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,
Published at **Shaitya Prasthanam** 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad-20. **Editor. T. Ravi**



# బి.సి.లకు రిజర్వేషన్ల సౌకర్యం...
# ప్రభుత్వ కృషికి నిదర్శనం



**ముఖ్యమంత్రి శ్రీ ఎన్.కిరణ్‌కుమార్ రెడ్డి ప్రభుత్వం తీసుకున్న కీలక నిర్ణయాలు :**

- స్థానిక సంస్థల ఎన్నికలలో బి.సి.లకు మరో పదేళ్లకు రిజర్వేషన్ల కొనసాగింపు
- విద్య, ఉపాధి రంగాలకూ వర్తింపు
- ప్రభుత్వ ఉద్యోగాలలో బీసీలకు వయోపరిమితి 5 సం॥ల సడలింపు



**ప్రియమైన ప్రజలారా!**

సమసమాజ నిర్మాణానికి, బలహీన వర్గాల అభ్యున్నతికి కట్టుబడి కృషిచేస్తోంది ఈ ప్రభుత్వం. ఈ కృషిలో భాగంగా స్థానిక సంస్థల ఎన్నికలలో బీ.సి.లకు రిజర్వేషన్ అమలును పొడిగిస్తూ నిర్ణయం తీసుకోవడం జరిగింది. రాష్ట్రంలోని వెనుకబడిన వర్గాలు అన్ని రంగాల్లో ముందంజ వేయాలని ఆకాంక్షిస్తూ...

మీ

కిరణ్ రెడ్డి

(నల్లారి కిరణ్ కుమార్ రెడ్డి)



**ప్రభుత్వం కల్పించిన ఆసరా - ఇక సంక్షేమానికి పూర్తి భరోసా**

PRSVM02A129 ...M RNI N0.APTEL/2004/18396 Postal Regd. No.H/SD/415/10-12

# ప్రజాశక్తి బుక్‌హౌస్ తాజా ప్రచురణలు




వెల: రూ. 125/-




వెల: రూ. 50/-




వెల: రూ. 35/-




వెల: రూ. 60/-




వెల: రూ. 50/-




వెల: రూ. 60/-




వెల: రూ. 75/-




వెల: రూ. 60/-




వెల: రూ. 100/-




వెల: రూ. 90/-




వెల: రూ. 125/-




వెల: రూ. 100/-




వెల: రూ. 50/-




వెల: రూ. 30/-




వెల: రూ. 20/-




వెల: రూ. 80/-




వెల: రూ. 20/-




వెల: రూ. 100/-

50




వెల: రూ. 70/-




వెల: రూ. 40/-

**ప్రతులకు: ప్రజాశక్తి బుక్‌హౌస్, ఫోన్: 040-27660013 27608107, ఫ్యాక్స్: 04027635136**

**If Un delivered please return to :** Prasthanam, C/o M.H.Bhavan, Plot No. 21/1, Azamabad
Near RTC Kalyanamandapam, Hyderabad - 500 020 (A.P), Ph: 040-27660013, Cell: 9490099059



**మనసు ఫౌండేషన్**

**పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVM02A129 |
| పుస్తకం పేరు | ప్రస్థానం |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | M. Lavanya |
| పేజీలు విడదీసినది | M. Lavanya |
| స్కాన్ చేసినది | Rakshitha |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good. |